# బోల్డ్ ఈజ్ గోల్డ్

## -రాధికా ఆప్టే

**తెర మీద అందాల ఆరబోతను గ్లామర్ అని కవర్ చేస్తుంటారు కానీ బోల్డ్‌గా కనిపిస్తున్నా మన్న విషయాన్ని మాత్రం హీరోయిన్లు ఒప్పుకోరు. ఈ విషయంలో రాధికా ఆప్టే రూటే సెపరేట్. బోల్డ్ ఎప్పుడూ గోల్డ్ అని అంటోంది. అలా కనిపించడానికి నా లెక్కలు నాకు ఉన్నాయి. ఈ విషయంలో ఎవరేమనుకున్నా ఫరవాలేదు అంటున్న రాధికా ఆప్టేతో...**

**తెరమీద నగ్నంగా కనిపించడానికి మిగతా వారు జంకుతుంటే మీరెందుకు బోల్డ్‌ని గోల్డ్ అంటారు?**

అన్ని సినిమాల్లోనూ అలాగే కనిపిస్తానని ఎప్పుడూ ఎక్కడా చెప్పలేదు. నేను అలా కనిపించాలంటే బంగారం లాంటి కథ అయి ఉండాలి. నా పాత్రకు విపరీతమైన ప్రాముఖ్యం ఉండాలి. అలాంటప్పుడే నగ్నంగా కనిపించినా బోల్డ్ ఈజ్ గోల్డ్ అంటారు. నేను చేసే పాత్రలు చూసి రాధిక చాలా హాట్ అన్న బిరుదు ఇచ్చేశారు. గ్లామర్‌గా కనిపిస్తే హాట్ అనడం సినిమా వారికి అలవాటు. అలాంటి బిరుదులు వినీ వినీ అలవాటైపోయింది.

**నేను చేసే ప్రతి పనికీ ఓ లెక్క ఉందని అంటూంటారు? ఆ లెక్క కథ ఏమిటి?**

చిన్నతనం నుంచీ సినిమాలంటే పిచ్చి ఉండేది. చూసిన సినిమాల్లోని హీరోయిన్‌ని నాలో చూసుకునేదాన్ని. అలాగని చదువును నిర్లక్ష్యం చేయలేదు. లెక్కలంటే ఇష్టపడేదాన్ని. దానికి కారణం మా గ్రాండ్ మదర్. తను ఆరోజుల్లోనే లెక్కల టీచర్. ఆవిడ కారణంగానే లెక్కలంటే ఇష్టం ఏర్పడింది. చిన్నతనం నుంచే పెద్దయ్యాక ఏం కావాలి? అన్న స్పష్టమైన అవగాహన ఉండేది. అందుకే నా లెక్కలు నాకున్నాయని చెప్పాను. ఇదేదో సినిమా డైలాగని నవ్వుకున్న వారూ ఉన్నారు. కానీ నా జీవితంలో జరిగింది అది.

**నటిగా మారతానంటే మీ ఫ్యామిలీ ఎలా రియాక్ట్ అయ్యారు?**

వాళ్లకి నా పిచ్చి గురించి బాగా తెలుసు. కాలేజీకి వెళ్లినా కచ్చితంగా క్లాసుకు హాజరు కానని వారి నమ్మకం. యాక్టింగ్ క్లాసులకి మాత్రం రెగ్యులర్‌గా వెళ్లేదాన్ని. దానికి డుమ్మా కొట్టడం జరిగేది కాదు. ఇదంతా మా ఫ్యామిలీకి తెలుస్తూనే ఉండేది. సినిమా అంటే నాకున్న ఇష్టాన్ని చూసి ఏమీ అనలేకపోయారు. చదువుకునే రోజుల్లోనే అలా ఉన్నానంటే నేను కోరుకున్న రంగంలో స్థిరపడతానని అంటే



ఏమంటారు? మౌనంగా ఉండిపోయారు.

**ఒకవేళ నటి కాకపోయుంటే...?**

మా పేరెంట్స్‌లా డాక్టర్‌ని అయ్యుండేదాన్నేమో! ఏ రంగంలో ఉన్నా ఆ వృత్తికి పూర్తి న్యాయం చేయాలన్నది నా పాలసీ. డాక్టర్, యాక్టర్ కాకుండా మరే రంగమైనా ఇదే అంకితభావంతో పనిచేస్తా.

**మీరు చాలా షార్ప్ అంటారు నిజమేనా?**

లెక్కలు బాగా చేసేవారు షార్ప్‌గా ఉంటారంటారు నిజమే! చిన్నతనం నుంచి మా గ్రాండ్ మదర్ నా చేత లెక్కలు ఎప్పుడూ చేయిస్తూనే ఉండేది. దాంతో నా మెదడు షార్ప్‌గా తయారైంది. ఒక్కటి మాత్రం చెప్పగలను. ఈ రంగంలో మిగతా వారికన్నా చాలా షార్ప్‌గా ఆలోచించగలను. ఫాస్ట్‌గా నిర్ణయాలు తీసుకోగలను. ఆ నేర్పు, వేగం అంతా మా గ్రాండ్ మదర్ నుంచి వచ్చినవే!

**సినిమాల ఎంపిక ఎలా చేసుకుంటారు?**

చెప్పానుగా నా లెక్క నాకుంటుంది. ఎలాంటి సినిమా చేసినా, ఈ పాత్రను రాధిక మాత్రమే చేయగలదు అన్నపేరు తెచ్చుకునేట్టు చేస్తాను. సినిమాల ఎంపిక కూడా అలాగే ఉంటుంది.

**మీ హజ్బెండ్ జోక్యం చేసుకోరా?**

అస్సలు చేసుకోరు. కొన్నిసార్లు నేను ఏ సినిమా చేస్తున్నానో కూడా పట్టించుకోరు. తెరమీద చూస్తారు. నేను తెర మీద ఎలా కనిపించినా, తెర మీద నా పాత్రను చూస్తారేతప్ప నన్ను చూడరు. బాగా చేశానా? లేదా? అన్నది చెబుతారు. సన్నివేశానికి తగినట్టు బోల్డ్‌గా నటిస్తానన్న విషయం ఆయన అర్థం చేసుకున్నారు. తెరమీద నేను ఎలా కనిపించాలి అన్న విషయం పూర్తిగా నాకే వదిలేశారు.

**దక్షిణాదిలో సినిమాలు చేస్తున్నారా?**

లేదు. బాలీవుడ్‌లో ఒప్పుకున్న సినిమాలు ఉన్నాయి. అవి పూర్తయిన తరువాత దక్షిణాది సినిమాల గురించి ఆలోచిస్తాను.

-కె.రామకృష్ణ

నవ్య వీక్లి-ఉపాధ్యాయుల భాస్కరరావు స్మృతిసాహితి సంయుక్త నిర్వహణలో

# కథల పోటీ

| | | |
|---|---|---|
| ప్రథమ బహుమతి | : | రూ. 10,000 |
| ద్వితీయ బహుమతి | : | రూ. 8,000 |
| తృతీయ బహుమతి | : | రూ. 7,000 |
| 7 విశేష బహుమతులు (కథ ఒక్కొంటికి) | : | రూ. 5,000 |

## కథ: నిబంధనలు

A కథ తెలుగు వారి జీవితానికి అద్దం పట్టేలా ఉండాలి.

A ప్రపంచంలోని ఏ ప్రాంతమైనా కథకు నేపథ్యం కావచ్చు. అయితే అది తెలుగువారి జీవితానికి సంబంధించినదై ఉండాలి.

A కథలు అరటావు సైజులో *10* పేజీలకు మించకుండా ఒకవైపునే రాసి పంపాలి. దస్తూరి చక్కగా అర్థమయ్యేలా ఉండాలి. డి.టి.పి. చేసిన పక్షంలో అది *6* పేజీలకు మించరాదు.

A కథను పంపేటప్పుడు రచయిత/రచయిత్రి పేరు అందులో ఉండరాదు. పేరు, పూర్తి చిరునామా వేరే కాగితం మీద రాసి జత పరచాలి. అనుకరణ, అనుసరణ కాదని, బ్లాగుల్లోనూ, వెబ్ మాగజైన్స్‌లోనూ రాలేదని హామీ పత్రం విధిగా జత చేయాలి. కవరు మీద 'నవ్యవీక్లి - ఉపాధ్యాయుల భాస్కరరావు కథల పోటీకి' అని స్పష్టంగా పేర్కొనాలి.

A విదేశాల నుంచి కథలు పంపించే రచయితలు/రచయిత్రులు మాత్రమే ఈ-మెయిల్ (navyaweekly@andhrajyothy.com)కి పంపగలరు.

A బహుమతి పొందిన కథలు 'నవ్య' వీక్లీలో ప్రచురితమవుతాయి.

A పోటీ గడువు తేదీని పొడిగించేందుకు కానీ, అర్హమైన రచనలు రాకపోతే బహుమతుల్లో మార్పులు చేసేందుకు కానీ 'నవ్య వీక్లి' యాజమాన్యానికి సర్వహక్కులూ ఉన్నాయి.

A కథల ఎంపిక విషయంలో తుది నిర్ణయం నవ్య సంపాదక వర్గానిదే! ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు కాని, వాద ప్రతివాదాలకు కాని తావు లేదు. ప్రచురణకు అనర్హమైన కథలను తిప్పి పంపడం సాధ్యం కాదు.

M £ ¸$
‡˘ ‡—Ł flŁ
$flØ—Ł *
flŁ¯ —Ł ¯ M ˇ
B {«§ gZ¯
...˝z V
·°ˇs fl . 76,
˘ły fl 70
A Ł –

కథలు చేరవలసిన ఆఖరు తేది

# 31 జనవరి 2017



8

## వింతయిన వంతెనలు

ప్రపంచవ్యాప్తంగా ప్రత్యేకత సంతరించుకున్న వంతెనలు ఎన్నో ఉన్నాయి. సాంకేతిక అద్భుతాలతో ఖ్యాతికెక్కిన ఈ వారధులు పర్యాటకులను తెగ ఆకర్షిస్తున్నాయి. నయా డిజైన్లతో ఆకట్టుకుంటున్న ఆ వంతెనలేంటో మీరూ తెలుసుకోండి.

60

### గెలవాలంటే వదిలేయాలి

గెలుపుదారిలో పయనించేటప్పుడు మానసికంగా డీలా పడిపోకూడదు. తక్షణ ఫలితాలు ఆశించకూడదు. ఓటమిని, జాప్యాన్ని అవమానంగా భావించకూడదు. మరేం చేయాలో చదవండి.

72

### ఇంటర్వ్యూ

బహుభాషా నటి ఇంద్రజ. సినిమాల్లోకి వచ్చిన తర్వాత రెండు నేర్చుకున్నాననీ, ఆ రెండూ తనకు ఎంతో మేలు చేశాయనీ అంటున్న ఇంద్రజ ఇంటర్వ్యూ...

## సీరియల్స్


| | |
|---|---|
| వెట్టి | 16 |
| మహానంది | 30 |
| సినీవాలి | 48 |
| సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు | 62 |


## కథలు


| | |
|---|---|
| హేతువేదం | 10 |
| భామనే సత్యభామనే! | 24 |
| వృక్షబలి | 38 |
| సరదా కథలు | 44 |
| విపులాచ పృథ్వీ | 56 |


## ఫీచర్స్


ఆరోగ్యమే మహాభాగ్యం-14, తీన్‌మార్-15
హరివంశం-22, సురభి-28
టీనేజ్ ట్యూన్స్-36, పుస్తక సమీక్ష-43
జీవితమే ఒక ప్రతిఘటన-46, రివ్యూ-54
మనమీదేనర్రోయ్-59, క్రైమ్-66,
సౌభాగ్యచక్రం-68, నవ్యసినిమా-69
ఆ వ్యక్తిని ప్రేమిస్తున్నాను-70
ఇవన్నీ నిజాలే!, పదగారడి-74


ముఖచిత్రం: కాజల్ అగర్వాల్
ఫొటో: గోపీకృష్ణ


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33. email: navyaweekly@andhrajyothy.com





### స్విమ్మింగ్‌పూల్

కొత్తజంట. హనీమూన్‌కి వచ్చారు. ఓ హోటల్లో దిగారు. పెద్ద స్విమ్మింగ్‌పూల్ ఉందక్కడ. ఈదుదామంటే ఈదుదామనుకున్నారు. బికినీతో ఆమె, డ్రాయర్‌తో అతనూ ఇద్దరూ పూల్‌లోనికి దూకి ఈదసాగారు. కాసేపటికి తెలిసింది, తను ధరించిన బికినీ లూజ్‌గా ఉండి తొలగిపోయిందని. దాంతో ఆమె ఆందోళన చెందింది. ఆందోళన అనవసరం అన్నాడతను. ఉన్నది మనిద్దరమేగా! ఏం కాదు అన్నాడు. పూల్‌లో అట్టడుగున ఉన్న బికినీ తెచ్చి ఇచ్చాడామెకు.

ఆ సాయంత్రం హోటల్లో డిన్నర్‌కి కూర్చున్నారిద్దరూ. దగ్గరగా ఉన్న పెద్ద అక్వేరియంను చూస్తూ కూర్చున్నారు. అయితే అక్వేరియంలో ఒక్క చేప కూడా కనిపించలేదు. ఆ మాటే అడిగారు వెయిటర్‌ని.

"ఈ అక్వేరియంలో ఒక్క చేప కూడా లేదేంటి?"

"అది అక్వేరియం కాదండీ! స్విమ్మింగ్‌పూల్." అన్నాడు పెద్దగా నవ్వుతూ వెయిటర్.

### సులువు

హియరింగ్ ఎయిడ్ అవసరం తనకి చాలా ఉన్నదని గ్రహించాడు సుబ్బయ్య. అయితే మరీ ఎక్కువ ఖరీదుది కొనరాదని నిర్ణయించుకున్నాడు. షాప్‌కి వెళ్లాడు.

"రకరకాల హియరింగ్ ఎయిడ్స్ చూపించండి." అడిగాడు. చూపించాడు సేల్స్‌మన్.

"బాగా ఖరీదా?" అడిగాడు సుబ్బయ్య.

"మీకు ఏ ఖరీదులో కావాలో చెప్పండి. రెండు వందల్లో కావాలా? రెండు వేలల్లో కావాలా?" అడిగాడు సేల్స్‌మన్.

"రెండువందల్లో కావాలి."

ఓ చిన్న బొడిపెలా ఉన్న ఎయిడ్‌ని తీసి చూపించాడు సేల్స్‌మన్. దానికి పొడుగ్గా వైర్ వేలాడుతూ ఉంది.

"ఈ బొడిపె చెవిలో పెట్టుకుని, ఈ వైర్ జేబులో పెట్టుకోండి, చాలు." చెప్పాడు సేల్స్‌మన్.

"బాగా పని చేస్తుందా?" అడిగాడు సుబ్బయ్య.

"అస్సలు పని చెయ్యదు. కాకపోతే ఈ బొడిపె మీ చెవిలో ఉండి, ఈ వైర్ మీ జేబులో ఉంటే, మిమ్మల్ని చూసిన వారికి మీరు చెవిటివారని ఇట్టే తెలిసిపోతుంది. దాంతో గట్టిగా మాట్లాడతారు. మీ పని సులువవుతుంది." అన్నాడు సేల్స్‌మన్.

-వైనతేయ

w m w

పుస్తక పఠనం ఎంతటి
బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 13 సంచిక: 48

1-2-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎస్.జగన్నాథశర్మ



మొదటి పేజి

# కనబడుటలేదు

అతనికి డెబ్బయి ఏళ్లుంటాయి. సన్నగా పొడుగ్గా ఉన్నాడు. బట్టతల. మీసాలు లేవు. కనుబొమలు పండిపోయాయి. కళ్ళు లోతుగా ఉన్నాయి. ముఖం ముడుతలు పడి ఉంది. లాల్చీ, షరాయిమీద ఉన్నాడతను. భుజాన సంచీ వేలాడుతోంది. టీ సెంటర్ దగ్గరగా వచ్చి నిలబడ్డాడు. పది పదిహేనుమంది దాకా ఉన్నారక్కడ. బాగానే ఉంది, మంచి స్పాటే అనుకున్నాడతను. సంచిలో నుంచి చిన్నసైజు పోస్టర్ తీశాడు. గమ్ రాసి, దానిని అక్కడి గోడకి అంటించాడు. తనలోతాను చదువుకున్నాడిలా.

కనబడుటలేదు.

పదహారేళ్ళ వయసుకలిగి, సన్నగా పొడుగ్గా ఉండే సుదర్శన్ అనే పేరుగల ఈ యువకుడు కనబడుటలేదు. ఆచూకీ తెలిసినవారు కింది నంబర్‌కి ఫోన్ చేసి, తగిన బహుమతి స్వీకరించగలరు.

బయల్దేరాడు అక్కణ్ణుంచి. సినిమా హాలు దగ్గరకు చేరుకున్నాడు. అక్కడ కూడా అదే పోస్టర్ అంటించాడు. అక్కణ్ణుంచి గుడికి బయల్దేరాడు. అక్కడా అదే పోస్టర్ అంటించాడు. బస్టాండు, రైల్వేస్టేషన్, పురుషుల మరుగుదొడ్లు...ఎక్కడయితే పదిమందీ గమనించే అవకాశం ఉన్నదో అక్కడల్లా పోస్టర్ అంటించి ఇంటికి చేరుకున్నాడతను. దాహం అనిపించింది. నీళ్లు తాగాడు. అలసిపోయాడేమో! వాలుకుర్చీలో కూర్చుని ఆలోచించసాగాడు. తప్పిపోయిన సుదర్శన్ దొరుకుతాడా? దొరికితే బాగుణ్ణు అనుకున్నాడు. కళ్ళు మూసుకున్నాడు.

అందగాడు సుదర్శన్. ఎంతగా ఎగదువ్వినా జుత్తు నుదుటమీద పడేది. నూనూగు మీసాలతో చూడచక్కగా ఉండేవాడు. కళ్ళల్లో గొప్ప వెలుగుండేది. ఏదైనా సాధించగలనన్న నమ్మకం ఉండేది. ఈర్ష్యాసూయలులేవు. సహాయం చేద్దామనే తలంపు ఉండేది. స్నేహితులంటే ప్రాణం పెట్టేవాడు. సినిమాలంటే సరదా పడేవాడు.

రేవతి అంటే చెప్పలేనంత ప్రేమ. పొట్టిగా ఉండేది రేవతి. కొంచెం లావుగా ఉండేది. అయినా ఆ పిల్ల అంటే అభిమానపడేవాడు. రేవతికోసం వాళ్లింటి పెరటిగోడ ఎన్నిసార్లు దూకాడో! దూకినప్పుడు ఒకసారి మోకాళ్లూ మోచేతులూ చీరుకుపోయాయి. రక్తం రాసాగింది. గాయాలను నీళ్లతో కడిగి, కన్నీరుపెట్టుకుంది రేవతి. పొద్దున కాలేజీలో చూశావుగా! మళ్లీ ఈ రాత్రి నన్ను చూడాలా? ఎందుకు ఈ సాహసాలు? నీకేమైనా అయితే నేనేం కావాలి? అడిగింది. సుదర్శన్ గుండెల్లో తలదాచుకుంది. ఆ తలను నిమురుతూ ఎంతసేపు గడిపాడో! వాళ్ల నాన్నమ్మ కేకకి చెదరిపోయారిద్దరూ. అలాగే ఓ రాత్రివేళ ఫ్రెండ్ రవిని పాము కరిచింది. అయిదుకిలోమీటర్ల దూరంలో ఉన్న ఆసుపత్రికి తీసుకెళ్లాలి వాణ్ణి. రిక్షా కాదుకదా, కనీసం సైకిల్ కూడా అందుబాటులో లేదు. ఏం చెయ్యాలంటే ఏం చెయ్యాలంటూ అంతా తాత్సారం చేస్తోంటే రవిని భుజాన వేసుకుని పరుగుదీశాడు సుదర్శన్. అయిదుకిలోమీటర్లూ అలవోకగా పరుగుదీశాడు. ఆసుపత్రికి చేర్చాడు. బతికించాడు వాణ్ణి. ఏదో సినిమా! పేరు గుర్తులేదు. దానిని చూసేందుకు తండ్రి జేబులోంచి పదిరూపాయలనోటు దొంగిలించాడు సుదర్శన్. పెద్ద సాహసం చేశాననుకున్నాడు. తర్వాత తెలుసుకున్నాడు చేసిన పని తప్పు అని. ఎంత అల్లరి? ఎన్ని గొడవలు? నువ్వు బాగుపడవనేవాడు తండ్రి. తల్లి నెత్తి మొత్తుకునేది. ఏటిగట్టున దొంగతనంగా సిగరెట్లు తాగడం, మామిడితోటలో రేవతిని ముద్దుపెట్టుకోవడం, తిట్టినందుకు తెలుగులెక్చరర్ జడపట్టుకుని లాగడం, వార్షికోత్సవాల్లో ఏకపాత్రాభినయం, వానలో తడవడం, ఎండలో క్రికెట్ ఆడడం, చలిలో వేడివేడిగా సినిమాహాళ్ల దగ్గర టీ తాగుతూ పోకిరీకబుర్లు చెప్పుకోవడం...స్వేచ్ఛకీ, సరదాకీ, స్నేహానికీ పెట్టింది పేరు సుదర్శన్. ఏడి? ఎక్కడ? కళ్ళు తెరచి చూశాడతను. చీకటిగా ఉంది. లేచి లైట్ వేశాడు. ఆకలిగా ఉంది. పొద్దున వండుకున్నదే రెండు ముద్దలు తిన్నాడు. ఎవరూ లేని ఇంట ఒంటరిగా పచార్లు చేయసాగాడు.




ఫోన్ మోగింది. అందుకున్నాడు. హలో అన్నాడు. అటు నుంచి ఎవరో మాట్లాడుతున్నారు. సుదర్శన్ మీకు ఏమవుతాడు సార్? కొడుకా? మనవడా? మేనల్లుడా? బావమరిదా? ఆ కుర్రాడితో మీ బంధుత్వం ఏమిటిసార్? అడుగుతోంటే సమాధానం చెప్పలేకపోయాడతను. ఫోన్ కట్‌చేసి దీనంగా వాలుకుర్చీలో కూర్చున్నాడు స్వేచ్ఛలేని, సరదాలేని స్నేహంలేని, కల్లాకపటాలతో కుళ్లిపోయిన సుదర్శన్ ఉరఫ్ సుదర్శనరావు. చేతుల్లో తలదాచుకుని ఏడవసాగాడు. నవ్య




## డబ్బులు ఎదురిస్తారు!

పొగాకు రాయుళ్ళు సిగరెట్ తాగేసి, ఎక్కడ పడితే అక్కడ ఆ సిగరెట్ పీకలు పారేస్తుంటారు. కానీ అలా విసిరికొట్టిన సిగరెట్ పీక ఏమవుతుంది? అది భూమిలో డీకంపోజ్ కావడానికి ఏడాది నుంచి పదేళ్ళు పడుతుంది. అసలే ప్లాస్టిక్ వ్యర్థాలు ఒకపక్క, సిగరెట్ పీకలు మరోపక్క మెల్లి మెల్లిగా పర్యావరణంపై తమ ప్రభావం చూపిస్తాయి. ప్రపంచవ్యాప్తంగా ప్రతీరోజూ టన్నులకొద్దీ సిగరెట్ పీకలు భూమ్మీద పేరుకుపోతున్నాయి. సిగరెట్ తయారీలో సెల్యులోజ్ ఎసిటేట్ అనే నాన్ బయోడీగ్రేడబుల్ ప్లాస్టిక్ ఫిల్టర్ వాడతారు. అది పర్యావరణానికి అత్యంత ప్రమాదకారి.

ఒక్క ఇండియాలోనే ఏడాదికి తాగి పారేసిన సిగరెట్ పీకల సంఖ్య 100 బిలియన్లు ఉంటుందని అంచనా. బెంగళూరు వంటి నగరంలో రోజుకి కనీసం 31 లక్షల సిగరెట్ పీకలు భూమ్మీద పేరుకుపోతున్నాయి. ఇదే విషయం మీద స్టడీ చేశారు గుర్గావ్‌కు చెందిన విశాల్‌కాంత్, నమన్ గుప్త అనే ఇద్దరు స్నేహితులు. ఒకసారి ఏదో పార్టీకి వెళ్ళిన వారిద్దరూ అక్కడ కొన్ని వందల సిగరెట్ ఫిల్టర్లను గమనించి, ఆశ్చర్యపోయారు. ఒక్క పార్టీలోనే ఇన్ని పీకలుంటే దేశవ్యాప్తంగా, ప్రపంచవ్యాప్తంగా ఇంకెన్ని సిగరెట్ ఫిల్టర్లు ఇలా పేరుకుపోతున్నాయో అని ఆలోచించారు. ఈ వేస్టేజ్ అంతా రీసైకిల్ చేయలేమా అని ఆలోచించి, కోడ్ అనే స్టార్టప్‌ను ప్రారంభించారు. తాగిపారేసిన సిగరెట్ ఫిల్టర్లను రీసైకిల్ చేయడం ఈ స్టార్టప్ మెయిన్ కాన్సెప్ట్.



స్టార్టప్ అయితే ప్రారంభించారు కానీ సిగరెట్ పీకలు సేకరించటమే ఇబ్బందిగా మారింది. దానికీ ఓ పరిష్కారం కనిపెట్టారు. ఎవరైతే తమకు సిగరెట్ పీకలు కలెక్ట్ చేసి ఇస్తారో, వాళ్లకు కిలోల చొప్పున కొంత డబ్బు ఇవ్వాలని డిసైడ్ అయ్యారు. వీ బిన్స్ అనే పేరుతో పాన్‌షాపుల దగ్గర, క్రౌడ్ ఏరియాల్లో డబ్బాలు పెట్టి పీకలు సేకరిస్తున్నారు. షాపుల దగ్గర సిగరెట్ తాగేవాళ్ళు పీకలను ఆ డబ్బాలో పడేలా చేయడం షాప్ అతని బాధ్యత. అలా కిలో పీకలు సేకరిస్తే ఏడువందలు ఇస్తున్నారు. అంత మొత్తంలో కలెక్ట్ కాకపోతే పదిగ్రాములకు వంద రూపాయల చొప్పున ఇస్తారు. ఈ విషయం తెలిసి సిగరెట్ తాగేవాళ్ళు కూడా అడ్డగోలుగా పడేయకుండా ఒకచోట జమచేసి షాపులకు అందచేస్తున్నారు. నిబంధనల ప్రకారం ఏమాత్రం హాని కలగకుండా ఈవేస్టేజీనంతా రీసైకిల్ చేస్తున్నారు. సంస్థను దేశవ్యాప్తంగా విస్తరించాలనేది ఇద్దరి స్నేహితుల ప్లాన్.

# మెయిల్ బాక్స్

### శోభిల్లిన సంక్రాంతి సంచిక

సంక్రాంతి సంచిక సర్వాంగ సుందరం. సంక్రాంతి ప్రత్యేక వ్యాసం, కవితలు బాగున్నాయి. తెలుగు సాహితీ విలువలు కాపాడే పత్రిక నవ్య వీక్లీ. ఈ వారం కథలన్నీ బాగున్నాయి.

సంక్రాంతి ముఖచిత్రం, ఆ పర్వదినాల విశేషాలు కలర్‌ఫుల్‌గా అందించారు. పల్లెల్లో సంక్రాంతి సంబరం అంబరాన్ని అంటేలా చూపించారు. ఉమెన్ క్యాబ్ డ్రైవర్స్ ప్రత్యేక కథనం ప్రస్తుత సమాజానికి ఎంతో అవసరం. సాధ్యమైనన్ని పట్టణాల్లో ఈ క్యాబ్‌లు ఉండాలి. యువత సన్మార్గంలో పయనించేందుకు దిక్సూచి 'టీనేజ్‌ట్యూన్స్'.

*-ఎల్.ప్రఫుల్లచంద్ర, ధర్మవరం*

*-నీలిమ సబ్బిశెట్టి, రాజానగరం. తూర్పుగోదావరిజిల్లా*

### కథలన్నీ బాగున్నాయ్

సంక్రాంతి సంచికలో కథలన్నీ బాగున్నాయి. ప్రత్యేకంగా జయంతి ప్రకాష్‌శర్మగారి కథ 'కోనేరు గట్టు' ఇంకా బాగుంది. ఇకముందు కూడా సంక్రాంతి సంచికలు ఇంత అందంగానూ కథలతో ఇంత నిండుగానే వెలువరించగలరని నవ్య సంపాదకవర్గాన్ని కోరుకుంటున్నాను.

*-మానస (ఉన్నవ వెంకట హరగోపాల్), హైదరాబాద్*

### 'సినీవాలి'లో నగ్నసత్యాలు

ప్రభాకర్‌జైనిగారి సినీవాలి సీరియల్ సినీరంగంలోని నగ్నసత్యాలను నిర్భయంగా తెలియజేస్తోంది. నటీమణుల జీవితాలు నీటిబుడగల్లాంటివి. నిజజీవితంలో అలాంటి నటులు, మోసాలకు గురైనవారు ఎందరో. నటుల బాధలు కళ్ళకుకట్టినట్టు రాస్తున్న రచయితకు అభినందనలు.

ప్రభాకర్‌జైనిగారి సినీవాలి, మహానంది సీరియల్స్ సూపర్‌గా సాగిపోతున్నాయి. మొదటిపేజీ సూపర్బ్.

*-గొట్టాపు దుర్గారావు, ఏలూరు*

*-సుంకర వి.హనుమంతరావు, హైదరాబాద్-73*

### తల్లిపాల బ్యాంక్ అద్భుతం

తల్లిపాలు విరాళంగా ఇచ్చి పసిపిల్లల ప్రాణాలు రక్షించాలన్న ఆలోచన అద్భుతం. ముక్కోటి ఏకాదశి గురించి మంచి విషయాలు చెప్పారు. తండ్రి పేరు చెడిపోకూడదని కాగితం మీద పేరు రాసి కొడుకు ఫ్రిజ్‌లో పెట్టడం భలే సరదాగా ఉంది. ఒక అమ్మపాలు మరో బిడ్డకు ఇస్తే అంతకంటే ఇంకేం కావాలి? అమ్మ ఆదర్శం అంతులేనిది. అమ్మ పాల బ్యాంక్, అమృతమూర్తులు వ్యాసం బాగుంది.

*-ఎ.చైతన్య, వాకలపూడి*

*-వాస్తురామచంద్ర, నెల్లూరు*

### సాఫ్ట్‌వేర్ జీవితావిష్కరణ

సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు సీరియల్ ఇంతవరకు తెలియని ఎన్నో విషయాలు చెబుతోంది. అక్కడి ఉద్యోగాల్లో ఉండే ఒడిదుడుకులు, వారి స్నేహాల గురించి రచయిత్రి బాగా చెబుతున్నారు. ఇప్పటివరకు ఈ రంగం గురించి ఇలా ఎవ్వరూ చెప్పలేదు.

*-మీనా, విజయవాడ*

## జగన్నాథశర్మ-వినోదినిలకు రంగినేని ఎల్లమ్మ పురస్కారం

ప్రముఖ కథారచయిత, నవ్య వీక్లీ సంపాదకులు ఎ.ఎన్.జగన్నాథశర్మ, రచయిత్రి ఎం.ఎం. వినోదినిలకు రంగినేని ఎల్లమ్మ-2016 సాహిత్య పురస్కారం ప్రకటించారు. జాతీయ స్థాయిలో ప్రతి సంవత్సరం రంగినేని ఎల్లమ్మ పేరిట ఇచ్చే సాహిత్య పురస్కారానికి జగన్నాథశర్మగారి 'కథా స్రవంతి', వినోదినిగారి 'బ్లాక్ఇంక్'ను సాహిత్య పురస్కార కమిటీ ఎంపిక చేసింది. ఫిబ్రవరి మూడవ వారంలో తెలంగాణ రాష్ట్రం సిరిసిల్లలో ట్రస్టు నిర్వహించే ప్రత్యేక కార్యక్రమంలో వీరిద్దరికీ పురస్కార ప్రదానం చేస్తారు. రంగినేని సుజాతమోహన్‌రావు ఎడ్యుకేషనల్ అండ్ చారిటబుల్ ట్రస్ట్ అధ్యక్షులు రంగినేని మోహన్‌రావు, పురస్కార కమిటీ కన్వీనర్ మద్దికుంట లక్ష్మణ్ ఈమేరకు ఒక ప్రకటన విడుదల చేశారు.





### 'మొదటిపేజీ'లో వేదాంత రహస్యం

ఒకరి కల...ఒకరి కోరిక మొదటిపేజీ చదువుతున్నంతసేపూ మరోసారి చదివితే బాగుండునని పించింది. ఆ నాలుగు పాత్రల్లో మనమూ ఉన్నామనిపించింది.

కారణం అందులో బాధలు, భయాలు, బెంగలు, కష్టాలు, సుఖాలు, రాగద్వేషాలు అన్నీ ఉండటమే! ఎదుటివారు ఆనందంగా ఉన్నారని ఎవరికివారు అనుకుంటారు. గుప్పెట్లో ఏదో ఉందని అనుకోవడం సహజం. తెరిస్తే శూన్యం! జీవితమూ అంతే. మొదటిపేజీలో జీవన వేదాంత రహస్యం ఆవిష్కరించిన విధానం బాగుంది. చక్కని వేదాంతం తెలిపే కథ ఇది.

*-భమిడి వెంకటేశ్వర్లు, మెహదీపట్నం, హైదరాబాద్*

### కోట కథ ఆసక్తికరం

కోటశ్రీనివాసరావుగారి జీవితకథ ఆసక్తికరంగా ఉంది. ప్రతివారం వీక్లీ ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తూ ఉంటాం. ఆయన అనుభవాలు, ఎంతో కష్టపడి ఉన్నతస్థితికి చేరుకున్న ఆయన జీవిత ఘట్టాలు అభిమానులకు ఆసక్తిదాయకం.

*-కొప్పుల ప్రకాశం, మలక్‌పేట, హైదరాబాద్-36*

# సైనస్ సమస్య మళ్లీ రాదు

**ముక్కు** కళ్ల చుట్టూ నాలుగు గదులుంటాయి. వాటిని సైనస్‌లు అంటారు. ఈ సైనస్‌లలో వైరల్, బాక్టీరియా, ఫంగల్ ఇన్‌ఫెక్షన్ కారణంగా విపరీతమైన నొప్పి పుడితే దాన్ని సైనసైటిస్ అంటారు.

**కారణాలు :** సైనస్ ముఖద్వారం మూసుకుపోతుంది లేదా అక్కడ చాలా మ్యూకస్ పేరుకుపోతుంది. ఫలితంగా అక్కడ బాక్టీరియా, ఇతర క్రిములు సులభంగా పెరిగి సైనసైటిస్ సమస్య మొదలవుతుంది. శ్వాసకోశ మార్గానికి ఇన్‌ఫెక్షన్ రావటం వల్ల సైనస్‌లకు బాక్టీరియా ఇన్‌ఫెక్షన్ వస్తుంది. ఫలితంగా సైనసైటిస్ మొదలవుతుంది.

**గుర్తించటం సులభం :** తరచు జలుబు చేయడం, జలుబుతో ఎక్కువ రోజులు బాధపడటం అనేది సైనస్ వ్యాధి ప్రాథమిక లక్షణం. ఆ తరువాత దశలో జలుబు చేసినపుడు ముక్కులు బిగదీసుకుపోతాయి. తల అంతా బరువుగా ఉంటుంది. ఆ పైన ముక్కు నుంచి పసుపు పచ్చని, ఆకుపచ్చని ద్రవాలు రావడం మొదలవుతుంది. తీవ్రమైన తలనొప్పి, దగ్గు, శ్వాస దుర్గంధంతో కూడి ఉండటం కూడా జరుగుతుంది. ముఖంలో వాపు కనిపిస్తుంది. గొంతు మంటగా, నోరంతా చేదుగా మారుతుంది.

**సర్జరీ అవసరం లేదు :** హోమియోపతి చికిత్స వల్ల సర్జరీ అవసరం లేకుండానే సైనసైటిస్‌ను సమూలంగా తగ్గించుకోవచ్చు. హోమియో మందుల్లో ఎటువంటి దుష్ప్రభావాలు ఉండవు. ఇతర చికిత్సల వల్ల తాత్కాలిక ఉపశమనం కలుగుతుందే తప్ప శాశ్వత పరిష్కారం లభించదు. కానీ హోమియో చికిత్సతో సమస్య సమూలంగా తొలగిపోతుంది.

# హెపటైటిస్, హెర్పిస్‌కు చెక్ సాధ్యమే

**హెపటైటిస్** వైరస్ ఎప్పుడైతే కాలేయంపై దాడి చేస్తుందో అప్పుడు లక్షణాలు బయటపడతాయి. అంతవరకు ఇది సోకిన విషయం తెలియదు. హెపటైటిస్ వైరస్ శరీరంలోకి ప్రవేశించిన వెంటనే లక్షణాలు బయటపడవు. రోగలక్షణాలు కనిపించడానికి చాలా ఏళ్లు పడుతుంది. కొంతమందిలో వైరస్ సోకిన 4 వారాలు లేదా 12 వారాల తరువాత కొన్ని రోగలక్షణాలు బయటపడతాయి. ఆకలి తగ్గిపోవడం, వాంతులు, మూత్రం పచ్చగా రావడం, కళ్లు పసుపుపచ్చగా మారడం, జ్వరం, ఒళ్లు నొప్పులు అధికంగా ఉండటం వంటి లక్షణాలు కనిపిస్తాయి. వ్యాధి నిర్ధారణ కోసం హెపటైటిస్-బి(హెచ్‌బిఎస్ ఏజి) పరీక్ష చేయించాలి. హెపటైటిస్-బి ఉన్న కొందరిలో లివర్ ఫెయిల్యూర్‌కు దారితీస్తుంది. కొన్ని ఏళ్ల నుంచి వైరస్ ఉన్నవారిలో కాలేయం క్రమంగా దెబ్బతింటూ లివర్ సిర్రోసిస్‌కు దారితీయవచ్చు లేక లివర్ క్యాన్సర్‌గా మారవచ్చు.

**హెర్పిస్ సింప్లెక్స్ :** పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలిపుండు పడుతుంది. ఈసమయంలో చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు. స్త్రీలలో కూడా యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి నొప్పిని కలిగిస్తాయి.

**హోమియో చికిత్స**
హెపటైటిస్ బి, సి వ్యాధులను సమర్థవంతంగా అడ్డుకునే చికిత్స హోమియోలో ఉంది. వైరల్‌లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది.

**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych), P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 3:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



# కిడ్నీలో రాళ్లకు ఆపరేషన్ ఎందుకు?

**ఏ** పనైనా సాఫీగా జరుగుతున్నంత సేపు ఏ ఇబ్బంది ఉండదు. ఏదైనా ఆటంకం ఏర్పడినప్పుడే దాని ప్రభావం ఏస్థాయిలో ఉంటుందో అర్థమవుతుంది. మూత్రవిసర్జన విషయంలోనూ అంతే. కిడ్నీలో ఏర్పడిన రాళ్లు మూత్రనాళంలో అడ్డుపడితే ఆ బాధ చెప్పనలవికాదు.

**కారణాలు :** శరీరంలో తయారయ్యే మలిన పదార్థాలన్నీ మూత్రం ద్వారానే బయటకుపోతాయి. మలినాలన్నీ కరిగిన స్థితిలో మూత్రం ద్వారా బయటకు వెళితే ఏ సమస్యా ఉండదు. అలా కాకుండా మూత్రం విసర్జన సాఫీగా జరగకపోతే గాఢత పెరిగిపోయి మలినాలు రాళ్లుగా ఏర్పడతాయి. సాధారణంగా కిడ్నీ స్టోన్స్ రెండు రకాలుగా ఉంటాయి. ఒకటి కాల్షియం ఆక్సలేట్, యూరికాసిడ్. కొంతమందిలో మెటబాలిక్ సమస్య వల్ల కూడా రాళ్లు ఏర్పడతాయి.

**లక్షణాలు :** కిడ్నీలో ఏర్పడిన రాయి ఒక్కోసారి మూత్రనాళంలో అడ్డుపడుతుంది. ఫలితంగా కిడ్నీలో వాపు వస్తుంది. తీవ్రమైన నొప్పి, మూత్రంలో మంట, జ్వరం వంటి లక్షణాలు కనిపిస్తాయి. మూత్రంలో రక్తం కూడా రావచ్చు. మూత్రవిసర్జన సమయంలో తీవ్రమైన నొప్పి వస్తుంటుంది. నొప్పి వెనక నుంచి ముందుకు విస్తరిస్తూ ఉంటుంది.

**హోమియో వైద్యం :** ఆపరేషన్ కోసం పరిగెత్తకుండా హోమియో చికిత్స తీసుకోవడం ద్వారా రాళ్లు సులభంగా తొలగిపోయేలా చూసుకోవచ్చు. మూత్రనాళంలో రాయి అడ్డుపడినట్లయితే హోమియో మందులు మూత్రనాళం వ్యాకోచం చెందేలా చేసి రాయి పడిపోయేలా చేస్తాయి. అంతేకాకుండా హోమియో మందులు శరీరతత్వాన్ని మార్చుతాయి. ఫలితంగా రాళ్లు తయారయ్యే అవకాశం తగ్గిపోతుంది. కిడ్నీలో రాయి ఉంది అనగానే గాభరా పడిపోకుండా అనుభవజ్ఞులైన హోమియో వైద్యున్ని సంప్రదిస్తే సమస్య ఇట్టే తొలగిపోతుంది.

# ఎసిడిటీని ఎన్నాళ్లు భరిస్తారు?

**ఎసిడిటీ, గ్యాస్ట్రైటిస్ :** జీవనశైలిలో మార్పులు అంటే సమయానికి భోజనం చేయకపోవడం, మసాలా, వేపుళ్లు ఎక్కువగా తీసుకోవడం, మాంసాహారం అధికంగా తినడం, మానసిక ఒత్తిడి, నిద్రలేమి వంటివి గ్యాస్ట్రైటిస్ సమస్యకు కారణమవుతాయి.

**లక్షణాలు :** పుల్లటి తేన్పులు, వాంతులు, కడుపులో మంట, కడుపు ఉబ్బరం వంటి లక్షణాలుంటాయి. కొద్దిగా ఆహారం తీసుకున్నప్పటికీ పొట్ట నిండినట్లుగా అనిపించడం, ఆకలి లేకపోవడం, కారణం లేకుండానే బరువు తగ్గిపో తుండటం వంటి లక్షణాలు ఉంటాయి.

**చికిత్స :** రోగి లక్షణాలు, శారీరకపరిస్థితిని పరిశీలించి మందులు ఇవ్వాల్సి ఉంటుంది. చికిత్స తీసుకోవడంతో పాటు జీవనశైలిలో మార్పులు చేసుకున్నట్లయితే మంచి ఫలితం ఉంటుంది. వేళకు భోజనం చేయడం, కారం, ఉప్పు, నూనె తగ్గించడం చేయాలి.

**అల్సర్స్(గ్యాస్ట్రిక్, పెప్టిక్) :** మ్యూకస్ మెంబ్రేన్ యందు పుండులాగా కావడాన్ని అల్సర్ అంటారు. అల్సర్ ఏ భాగంలో అయితే ఆ పేరుతో పిలుస్తారు. ఆహారవాహికలో ఉన్నట్లయితే ఒసియోఫేగల్ అల్సర్, జీర్ణకోశంలో ఉన్నట్లయితే గ్యాస్ట్రిక్ అల్సర్, చిన్న పేగు మొదటి భాగంలో ఉన్నట్లయితే డ్యుయోడినల్ అల్సర్ అని పిలుస్తారు.

**లక్షణాలు :** తినేముందు లేదా తిన్న తరువాత కడుపులో నొప్పి, కడుపు ఉబ్బరంగా ఉండటం, పుల్లటి తేన్పులు, తలతిరగడం, వాంతులు వంటి లక్షణాలు ఉంటాయి. వ్యాధి ముదిరినపుడు రక్తంతో కూడిన వాంతులు, భరించలేని కడుపునొప్పి, బరువు తగ్గిపోవడం జరుగుతుంది.

**చికిత్స :** అల్సర్‌ను సమూలంగా తొలగించే మందులు హోమియోలో ఉన్నాయి. ఆహారపు అలవాట్లు మార్చుకొని క్రమం తప్పకుండా మందులు వాడినట్లయితే సమస్యకు శాశ్వత పరిష్కారం లభిస్తుంది.

# వింతయిన వంతెనలు

**ర హదారులు ఎంత ముఖ్యమో వంతెనలూ అంతే ముఖ్యం. గమ్యం చేరే మార్గంలో నదులు, లోయలు, ఇతర ఆటంకాలు అధిగమించేందుకు మానవుడు నిర్దేశించుకున్నవి వంతెనలే. రవాణా అవసరాల్లో భాగంగా మానవ నిర్మితమైన వంతెనలు కాలానుగుణంగా పెరిగిన శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానంతో ఎంతో ఆకర్షణీయంగా ఉంటున్నాయి. కొన్ని వంతెనలపై ప్రయాణిస్తుంటే విన్యాసాలు చేస్తున్నట్టే ఉంటుంది. అత్యంత దృఢంగా, కనువిందుచేసే డిజైన్లలో సేతువులను నిర్మించే స్థాయికి ఎదిగాడు మనిషి.**







ప్రపంచ వ్యాప్తంగా నిర్మితమైన ఇలాంటి వారధులలో కొన్ని ఎంతో ప్రత్యేకత సంతరించుకున్నాయి. వాటిలో ప్రపంచ ప్రఖ్యాతి చెందిన వారధులున్నాయి. ఎక్కువమంది పర్యాటకులను ఆకర్షించే వంతెనలున్నాయి. కేవలం వాటిని చూడ్డానికే జనాలు రావడం విశేషం. ఆ ప్రత్యేకమైన వంతెనలేంటో మీరు చూడండి!

### రోలర్ కోస్టర్!

దూరం నుంచి చూస్తే దాన్ని రోలర్ కోస్టర్ అనుకుంటాం. కానీ దగ్గరకు వెళితేగానీ తెలియదు, అదో పెద్ద వంతెన అని. ఈ వంతెన పేరు లక్కీనాట్. ఈ వింత వంతెన చూడ్డానికి, అక్కడ సరదాగా పచార్లు కొట్టడానికే ఎక్కువ మంది పర్యాటకులు వస్తున్నారట. చైనాలోని చాంగ్షా నగరంలో ఈ వింతయిన వంతెన ఉంది. ఇంతకీ దీని విశేషమేంటో చెప్పనే లేదు కదూ!

మామూలు వంతెనల్లా కాకుండా ఇది మెలికలు పడిన రిబ్బన్‌లా మెట్లతో భలేగా ఉంటుంది. అందుకే నడిచే రోలర్ కోస్టర్‌లా అనిపిస్తుంది. మూడురకాల దారులతో పైకీ కిందకీ ఉన్న ఆ మలుపుల్లో నడుస్తూ, ఫోటోలు దిగుతూ సందర్శకులు సంబరపడిపోతుంటారు. అంతేకాదు, ఇక్కడి రహదారిని, ఓ ఉద్యానాన్ని, డ్రాగన్ కింగ్ హార్బర్ అనే నదిని కలుపుతూ ఈ మూడింటికి ముడులు వేసినట్టు ఎత్తు పల్లాలుగా ఉంటుందీ వంతెన. ఒకదాంట్లోంచి మరోదాంట్లోకి వెళ్ళేలా గమ్మత్తుగా ఉంటుంది. 600 అడుగులు పొడవు, 78 అడుగుల ఎత్తుతో ఉండే ఈ పాదచారుల వంతెన పైనుంచి చాంగ్షా నగర అందాల్నీ ఇక్కడి మిక్సీ నదినీ ఆ చుట్టూ ప్రదేశాల్నీ తిలకించవచ్చు. అంతం లేకుండా మెలికలు తిరిగే మొబియస్ స్ట్రిప్‌ను ఆదర్శంగా తీసుకుని, చైనా సంస్కృతిలో అదృష్టగుర్తును పోలినట్టు ఈ వంతెన నిర్మించారు. కాబట్టే దీనికి లక్కీనాట్ అని పేరు. సంపదకు, సంతోషానికి చిహ్నంగా భావించే ఎరుపు రంగును దీనికి వేశారు. నెదర్లాండ్స్‌కి చెందిన వాస్తు శిల్పులు రూపొందించిన ఈ వంతెన రంగురంగుల విద్యుద్దీపాలతో ముస్తాబై ప్రారంభమైన కొద్ది రోజుల్లోనే బోలెడు మంది పర్యాటకుల్ని ఆకట్టుకుంది.

### వేలాడే వంతెన

ప్రపంచంలో అతిపొడవైన వేలాడే వంతెన రష్యాలో ఉంది. పలు కొండల్ని కలుపుతూ 650 అడుగుల ఎత్తులో 1800 అడుగుల నిడివితో నిర్మించిన ఈ వంతెన ప్రపంచంలోనే అతి పొడవైన వేలాడే వంతెనగా పేరు పొందింది. రష్యా సోచి నేషనల్ పార్క్‌లో రెండు సంవత్సరాలు శ్రమించి ఈ వేలాడే వంతెన నిర్మించారు. ఎంతో మంది పర్యాటకుల్ని ఆకర్షిస్తోంది ఈ వంతెన. దీనిపై నుంచి కొండలు, కొండ కింద లోయలు, రహదారులు, జంతువులూ.... అన్నింటినీ చూడవచ్చు. ఈవంతెన నిర్మాణానికి 740 టన్నుల ఉక్కు, 2000 క్యూబిక్ మీటర్ల కాంక్రీట్ ఉపయోగించారు. ఈ వంతెనపై ఒకేసారి 3000 మంది నిలబడవచ్చు. తీవ్రభూకంపాన్ని కూడా తట్టుకోగలదీ వంతెన. రిక్టర్ స్కేల్‌పై తొమ్మిది పరిమాణ తీవ్రతగల భూకంపాన్ని సైతం ఈ వంతెన తట్టుకుంటుందట. ఎంత స్ట్రాంగ్ వంతెనో కదా!

### జంక్షన్ రహదారి

ప్రపంచంలోనే అత్యంత క్లిష్టమైన రూపకల్ప నతో నిర్మించబడిన ఇంటర్‌చేంజ్ రహదారిని ఇంగ్లాండ్‌లోని బర్మింగ్‌హాం నగరంలో నిర్మించారు. గ్రావెల్లీహిల్స్ ఇంటర్‌చేంజ్ రహదారిగా దీనికి పేరు. స్పగెట్టి జంక్షన్ అని కూడా పిలుస్తారు. సివిల్ ఇంజనీరింగ్ నిర్మాణంలో దీనినొక అద్భుత కట్టడంగా భావించవచ్చు. ఈ రహదారి గురించి క్లుప్తంగా చెప్పాలంటే సరిగ్గా 44 సంవత్సరాల క్రితం ఈ జంక్షన్ రహదారిని నిర్మించారు. 1972వ సంవత్సరం మే 24వ తేదీన దీన్ని ప్రారంభించారు. ఇప్పటికీ ఈ నిర్మాణం పటిష్టంగా ఉంది. ఇటీవలే కొన్ని చిన్నచిన్న మార్పులు చేశారు. దాదాపు పద్దెనిమిది రకాల దారులను ఇది కలుపుతూ ఉంటుంది. 30 ఎకరాల స్థలంలో రెండు కాలువలు, రెండు నదులు, రెండు రైల్వే లైన్లపై 18 రహదారులు నిర్మించారు. ప్రపంచంలోనే అత్యంత క్లిష్టమైన రహదారుల నెట్‌వర్క్‌గా పేరుపొందిందీ జంక్షన్ రహదారి. ఆరోజుల్లో నిర్మించిన నిర్మాణాల్లో ఇంతపెద్ద రహదారి నిర్మాణం ఇదొక్కటే అని చెబుతారు. ఆక్స్‌ఫర్డ్ ఇంగ్లీషు డిక్షనరీలో ఈ జంక్షన్ పేరు కూడా నమోదైంది. ఈ రహదారి ప్రారంభమైన కొత్తలో రోజుకు 40 వేల వాహనాలు ఈ వంతెనపై ప్రయాణించేవి. ఇప్పుడు దీనిపైన రోజుకు దాదాపు 2,10,000 వాహనాలు తిరుగుతున్నాయి. ఇంకా వంద సంవత్సరాల వరకు ఈ రహదారి చెక్కు చెదరదని పరిశీలకులు చెబుతున్నారు. ఈ జంక్షన్‌కి ప్రత్యేకమైన వాతావరణ పరిశీలన కేంద్రం కూడా ఉంది. 500 కాంక్రీట్ స్తంభాల సహాయంతో ఐదు లెవల్స్‌లో ఉంటుందీ రహదారి. ఈ అద్భుత వంతెన చూసేందుకు విదేశీ పర్యాటకులు వస్తుంటారు.

## 01 ప్రపంచంలోనే ఎత్తైన టవర్

అబ్జర్వేషన్ టవర్ గురించి మనందరికీ తెలుసు. వందలాది అడుగుల ఎత్తులో దీన్ని నిర్మిస్తారు. ఇలాంటిదే ఇంగ్లండ్‌లోని బ్రిటన్‌లో ఈమధ్య ఏర్పాటు చేశారు. దీని ప్రత్యేకత ఏంటంటే ప్రపంచంలోనే అతి సన్నని పొడవైన టవర్ ఇదే. గాజుతో, స్టీలుతో దీన్ని నిర్మించారు. దీనిపేరు ఐ 360. దీన్ని 'నిలువెత్తు స్తంభం' అని కూడా పిలుస్తారు. అమెరికాలోని స్టాట్యూ ఆఫ్ లిబర్టీకి దాదాపు రెండింతలు ఎత్తు, 13 అడుగుల వెడల్పు, 531 అడుగుల ఎత్తులో ఉంటుంది. సముద్ర తీరం పక్కనే ఏర్పాటు చేసిన ఈ టవర్‌పై నుంచి దాదాపు 40 కిలోమీటర్ల దూరం వరకు పరిసర ప్రాంతాలన్నీ దర్శనమిస్తాయి. కనువిందు చేసే ఇక్కడి ప్రాంతాల్ని చూడ్డానికి 150 ఏళ్ళ క్రితమే ఇక్కడో స్తంభం ఏర్పాటు చేశారు. ఇప్పుడు దాని స్థానంలోనే ఈ సరికొత్త టవర్ నిర్మించారు.



### గోల్డెన్ గేట్ బ్రిడ్జ్

ప్రపంచ ప్రఖ్యాతి చెందిన వంతెన గోల్డెన్ గేట్ బ్రిడ్జ్. అమెరికా పశ్చిమతీరంలో పసిఫిక్ మహాసముద్రంపై ఈ వంతెన నిర్మించారు. ఎరుపురంగులో ఉండే ఈ వారధి శాన్‌ఫ్రాన్సిస్కో నగరానికి ప్రధాన ఆకర్షణ. శాన్‌ఫ్రాన్సిస్కో నగరాన్ని మారిన్ కౌంటితో కలిపే ఈ సేతువు 1,280 మీటర్ల పొడవు ఉంది. ఈ బ్రిడ్జను 1937లో ప్రారంభించారు. అంతర్జాతీయంగా గుర్తింపు పొందిన చిహ్నాల్లో ఇదీ ఒకటి.

### చార్లెస్ బ్రిడ్జ్

ప్రపంచ ప్రఖ్యాతి చెందిన వంతెన స్టోన్ బ్రిడ్జ. చెక్ రిపబ్లిక్ రాజధాని ప్రేగ్ నగరంలోని వాల్తావా నదిపై ఈ వారధి నిర్మించారు. 1357లో చెక్‌రిపబ్లిక్ రాజు నాలుగవ చార్లెస్ కాలంలో ప్రారంభమైన ఈ వంతెన నిర్మాణం 15వ శతాబ్దం ప్రథమార్థం నాటికి పూర్తయింది. ఈ సేతువు స్థానంలో ఇంతకు ముందు జుడిత్ బ్రిడ్జి ఉండేది. 1158-1172 మధ్య కాలంలో వచ్చిన వరదల కారణంగా ఆ వంతెన నాశనం అవడంతో చార్లెస్ వంతెన నిర్మాణం చేపట్టారు. ఈ బ్రిడ్జ్ తూర్పు, పశ్చిమ యూరప్‌ల మధ్య వారధిగా పనిచేస్తుంది.

### బ్రూక్లిన్ బ్రిడ్జ్

అమెరికాలోని న్యూయార్క్ నగరంలో ఈస్ట్ నదిపై నిర్మించిన వంతెన బ్రూక్లిన్. 1883లో నిర్మించిన ఈ వంతెన అమెరికాలోని సస్పెన్షన్ బ్రిడ్జ్‌లలో కెల్లా పురాతనమైనది. మన్‌హట్టన్, బ్రూక్లే నగరాలను కలిపే ఈ వారధి పొడవు 486.3 మీటర్లు. అమెరికాలోనే కాకుండా ప్రపంచవ్యాప్తంగా ఎక్కువమంది పర్యాటకులను ఆకర్షించే వంతెనల్లో ఇది ఒకటి.

ఇవే కాక ప్రపంచవ్యాప్తంగా ఫ్రాన్స్‌లోని అగుల్లే డు మిడి బ్రిడ్జ్, మిచిగాన్‌లోని మాకినాక్ బ్రిడ్జ్, పాకిస్థాన్‌లోని హుస్సైని హాంగింగ్ బ్రిడ్జ్, లూసియానాలోని లేక్ పంచార్‌ట్రైన్ కాజ్వే బ్రిడ్జ్ ప్రపంచవ్యాప్తంగా భయంకరమైన బ్రిడ్జ్‌లుగా పేరు పొందాయి.

**- సంతోషలక్ష్మి దహగాం**

## 02 లివింగ్ రూట్ బ్రిడ్జెస్!

మనుషులు పెరుగుతారు, చెట్లు, జంతువులు పెరుగుతాయి కానీ మనుషులు నిర్మించే వంతెనలు ఎలా పెరుగుతాయి? అని ఆశ్చర్యపోతున్నారా! ఈ వంతెనలు మనుషులు నిర్మించినవే అయినా నిర్మించడానికి ఉపయోగించింది మాత్రం పెద్దపెద్ద వృక్షాల వేర్లను. సంవత్సరాల తరబడి కష్టపడి ఈ వింత వంతెనలు నిర్మించారు. ఈ వింత వంతెనలు చిరపుంజి దగ్గర ఉన్నాయి. అక్కడి ప్రజలేమీ చదువుకున్న పెద్ద పెద్ద ఇంజనీర్లు కాదు కానీ ప్రకృతినే తమ అవసరాలకు అనుగుణంగా మలుచుకున్నారు. సాధారణంగా వంతెన కట్టాలంటే ఐరన్, సిమెంట్ లేదా కలప, బలమైన తాళ్ళు లాంటివి కావాలి. కానీ మనదేశంలోనే అత్యధిక వర్షపాతం నమోదయ్యే ప్రాంతం చిరపుంజిలో ఇలాంటి ముడిసరుకులు ఏవీ అవసరం లేకుండానే వంతెనలు నిర్మించేస్తారు అక్కడి ప్రజలు. దట్టమైన ఈ అడవులలో సులభంగా ఒక కొండపై నుంచి మరొక కొండపైకి వెళ్లడానికే కాదు గ్రామాల మధ్య వారధులుగానూ ఈ వంతెనలు ఉపయోగపడుతున్నాయి. చిరపుంజిలోని కొండప్రాంతాల్లో నిర్మించిన కొన్ని వంతెనలు అక్కడి గ్రామీణ కళకు దర్పణం పడతాయి. ఇక్కడ రబ్బరుచెట్లు ఎక్కువగా ఉంటాయి. వాటి వేర్లను బాగా పెంచుతారు. అవి పెరిగే క్రమంలోనే వంతెనగా మారేలా జాగ్రత్తలు తీసుకుంటారు. ఒక వంతెన ఏర్పాటు చేయడానికి కావల్సిన విధంగా చెట్ల వేర్లు పెరగడానికి సుమారు 15 సంవత్సరాలు పడుతుంది. చెట్లు పెరిగేకొద్దీ వాటి వేర్లు బలపడతాయి. జలపాతాల మధ్య, నదులు నడిచేందుకు ఇవి ఎంతో తోడ్పడతాయి. ఈరకమైన వంతెనలు వెస్ట్ జైంతియా హిల్స్ జిల్లా, తూర్పు ఖాసీహిల్స్ జిల్లాల్లో కనిపిస్తాయి. చిరపుంజి అడవులలో జలపాతాలను చూసేందుకే కాదు, ఇక్కడి స్థానిక ప్రజల నైపుణ్యానికి నిదర్శనంగా కనిపించే ఈ వంతెనలు చూసేందుకు కూడా పర్యాటకులు ఎక్కువగా వస్తున్నారు. పెరిగే చెట్ల వేర్లతో నిర్మితమయ్యే ఈ వంతెనలు పెరుగుతూనే ఉంటాయి కాబట్టి వీటిని పెరిగే వంతెనలు అని పిలుస్తారు. ఇవి లివింగ్ రూట్ బ్రిడ్జెస్‌గా ప్రపంచవ్యాప్తంగా పేరుగాంచాయి.





**ఉదయాన, పూజా పునస్కారాలు ముగించుకునేసరికి తొమ్మిదైంది. షాపు తెరవటానికి ఈ మధ్య ఆలస్యమైపోతోంది అనుకుంటూ, బయలుదేరబోయేసరికి అన్నపూర్ణ వచ్చింది.**

**'షాప్‌కి బయలుదేరినట్లున్నారు. మీతో మాట్లాడాలనే వచ్చాను. ఓ పదినిమిషాలు ఆగగలరా' అంది.**

**నువ్వు అంత దూరంనుంచి వచ్చి మాట్లాడాలి అంటే ఓ పది నిమిషాలు ఉండలేరా, ఉంటార్లే' అంది మా ఆవిడ సర్వమంగళ.**

**అన్నపూర్ణ మా తమ్ముడు రామకృష్ణ భార్య. వాళ్ళు శ్రీనగర్ కాలనీలో ఉంటారు. మా ఇంటికి రెండు కిలో మీటర్ల పైమాటే. ఉదయాన్నే పనివేళ వచ్చిందంటే ఏదో ముఖ్యమైన పనే అయి ఉంటుందనుకున్నాను.**

# హేతువేదం

**-గంధం యాజ్ఞవల్క్య శర్మ**

ఆయనటు స్కూలుకు వెళ్ళారు. మీతోనూ, అక్కయ్యతోనూ మాట్లాడాలని నేనిటు వచ్చాను అంది అన్నపూర్ణ.

ఆ... ఏవిటో చెప్పు అన్నాను కుర్చీలో కూర్చుంటూ.

అమ్మాయి భారతికి ఒంగోలునుండి ఓ పెళ్ళి సంబంధం వచ్చింది.

ఒంగోలు నుండా? ఎవరు? వివరాలేంటి?

మన శాఖీయులే. భారతి ఎంసీఏ చదివిన నాగార్జున యూనివర్సిటీలో లెక్చరర్ ఆ అబ్బాయి. భారతి, అతను ఒకరినొకరు ఇష్టపడ్డారు.

'ప్రేమ పెళ్ళన్నమాట' అంది సర్వమంగళ.

'అవునక్కయ్యా, వాళ్ళవైపు నుండి, ఆ అబ్బాయి మేనమామగారట నిన్న సాయంత్రం వచ్చారు. భారతిని గురించి పూర్తిగా ఏదీ దాచకుండా మొత్తం చెప్పాను ఆయనకి.

అదంతా భారతిద్వారా ఆ అబ్బాయికి, అతని ద్వారా వాళ్ళ తల్లిదండ్రులకు తెలిసిందట. వాళ్ళది శ్రోత్రియ కుటుంబమే అయినా, అబ్బాయి పట్టుదలవల్ల ఈ సంబంధానికి ఇష్టపడి, తనను పంపించారని చెప్పారాయన' అంది అన్నపూర్ణ.

'వాళ్ళకు కట్నకానుకలేవీ అక్కర్లేదట. కానీ పెళ్ళిమాత్రం సంప్రదాయబద్ధంగా జరగాలట' అంది అన్నపూర్ణ.

"శుభం. పిల్ల, పిల్లవాడు ఇష్టపడ్డారు. మనకు మాత్రం అభ్యంతరమేముంది" అంది సర్వమంగళ.

అలాగే జరిపిద్దాం అన్నాను నేను.

మీ తమ్ముడుగారి గురించి మీకు తెలియనిదేముంది. ఈ మంత్రతంత్రాలపట్ల, ఈ సంప్రదాయాలపట్ల తనకు నమ్మకంలేదని, తాను హేతువాదినని, తనది నాస్తిక మతమని, తానైతే దండలు మార్చుకునే పెళ్ళైతేనే చేస్తానని కుండ బద్దలుకొట్టినట్లు చెప్పారు మీ తమ్ముడుగారు, వచ్చినాయనతో.

ఇక ఆ వచ్చిన పెద్దాయన "పిల్లవాడి ఒత్తిడి వల్లే మా వాళ్ళు కొంత దిగివచ్చి ఈ సంబంధానికి ఒప్పుకున్నారు. మీరిలా మాట్లాడితే, ఈ పెళ్ళి జరగటం కష్టం" అంటూ తిరిగి వెళ్ళిపోయారు.

'అతన్నితప్ప మరెవ్వరినీ చేసుకోనని భారతి నా దగ్గర ఒకటే గోల. నేను మీ తమ్ముడుగారికి ఎదురు చెప్పలేను. చెప్పటానికి ప్రయత్నించినా ఆయన వినరు. ఏం చేయాలో అర్థంకాక మీ దగ్గర కొచ్చాను. మీరే కల్పించుకుని, ఈ కార్యం గట్టెక్కేలా చూడండి' అంది అన్నపూర్ణ దిగులుగా.

'అన్నపూర్ణా, దిగులుపడకు. ఇదిగో ఈయన గారే, ఒంగోలువెళ్ళి, వాళ్ళతో మాట్లాడి, ఈ కార్యం ఎలాగో అలాగ చక్కబెడతారులే' అంది మా ఆవిడ.

'సరేలే, ప్రయత్నిద్దాం' అన్నాను నేను.

అన్నపూర్ణ లేచి, నాకు నమస్కారం పెట్టి 'మీమీదే నా ఆశ' అంది.

•••

బస్సులో ఒంగోలు వెళుతుండగా పాతికేళ్ళ కిందటి జ్ఞాపకాలు నా కళ్ళముందు మెదిలాయి.

మా నాన్నగారు పరమ నైష్ఠికులు. పౌరోహిత్యం కులవృత్తిగా ఆయన జీవనం సాగింది. నేనా వృత్తి స్వీకరించలేదు. బి.ఏ చదివి టైపు హయ్యర్, షార్ట్ హ్యాండ్ హయ్యర్ పాసయ్యాను. కాని ఎందుకో నాకు గవర్నమెంటు ఉద్యోగం రాలేదు.

టైప్ రైటింగ్, ట్రైనింగ్ ఇనిస్టిట్యూట్ పెట్టుకున్నాను. తీరిక లేనంతగా పని ఉండేది. ఆదాయమూ బాగానే ఉండేది.

మా తమ్ముడు రామకృష్ణ నాకంటే పదేళ్ళు చిన్న. వాడికి విద్యార్థి దశ నుండే, చాలా స్వతంత్ర భావాలుండేవి. వాణ్ణి హేతువాదం ఆకర్షించింది. వాడి స్నేహితులంతా నాస్తికవాదులు. వాళ్ళతో కలిసి సభలు, సమావేశాలు నిర్వహించేవాడు.

మా నాన్నగారు వాణ్ణి నిలువరించాలని చూశారు. కానీ ప్రయోజనం లేకపోయింది.

వాడు వేద విధులు వేటినీ అంగీకరించలేదు. ఉపనయనం చేసుకోనన్నాడు. కులాలు, మతాలు ధ్వంసమవ్వాలి అనేవాడు.

బి.ఎ., బిఈడీ చేసి టీచరయ్యాడు. వాడికి చాలా పెళ్ళి సంబంధాలు వచ్చాయి. సంప్రదాయ వివాహానికి వాడు ఇష్టపడలేదు. వచ్చిన సంబంధాలు వీడి భావాలతో జతపడక తిరిగిపోయాయి. వాడికి పెళ్ళీడు దాటిపోవడం ప్రారంభమైంది. స్నేహితులు వాడికి కులాంతర వివాహ ప్రయత్నం చేశారుగానీ, ఎందుకో వాడికి అలాంటి అవకాశం రాలేదు.

అదిగో, ఆ సమయాన, కృష్ణాజిల్లా పామర్రు గ్రామవాసి బాపేశ్వరిశాస్త్రిగారట మమ్మల్ని వెతుక్కుంటూ వచ్చాడు. మా ఊరు వస్తూనే మా నాన్నగారితో,

'అయ్యా నాకో మనవరాలుంది. అది నా కొడుకు బిడ్డ. పేరు అన్నపూర్ణ. దాని తల్లిదండ్రి చిన్నతనానే పోయారు. దానికి అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు లేరు. మొన్నమొన్నటి వరకు నా భార్య ఉండేది. ఆవిడా దాటిపోయింది ఈ మధ్యనే. మిగిలింది, తనకు నేను, నాకు అదీను. దానిది అంతంతమాత్రం చదువు. పై చదువులు చదివించే స్తోమత లేకపోయింది నాకు.

తిరిగి తిరిగి ఎలాగోలా ఓ సంబంధంచూసి పెళ్ళి చేశాను. సంవత్సరం తిరిగేపాటికి పండంటి బిడ్డను కన్నది.

గత జన్మలో ఏ పాపం చేశానో ఏమో దురదృష్టం నన్ను విడవకుండా వెంటాడింది. చంటి బిడ్డకు రెండు నెలల ప్రాయం రాకముందే, నా

మనవరాలి భర్త ఒక బస్సు ప్రమాదంలో చనిపోయాడు.

దాని అత్తగారి తాలూకు వాళ్ళు దానితో మాకెలాంటి సంబంధం లేదంటూ తెగతెంపులు చేసుకుని పోయారు.

ఇది ఈనాటి, నా దౌర్భాగ్యపు జీవిత చరిత్ర. నాకిప్పుడు ఎనభై సంవత్సరాలు. ఈ జీవిత చరమాంకంలో నేడో, రేపో అన్నట్లుంది నా స్థితి. నా మనవరాలి భవిష్యత్తు తెల్లవారేదెలాగా అనే దిగులుతో కుమిలిపోతున్న ఈ దశలో, మా ఊరిలోని ఓ హేతువాద మహాశయుడొకరు నాకొక ఆశ కల్పించాడు. అతనికి మీ అబ్బాయి రామకృష్ణ తెలుసట. మీ అబ్బాయి ఆదర్శవాది అని, విధవా వివాహం చేసుకోవచ్చని చెప్పి నన్ను ప్రయత్నించమని పంపాడు.

అయ్యా, మీరు శ్రోత్రియులని నాకు తెలిసింది. ఆ మాటకొస్తే నేనూ, ఆ కోవలోవాడినే. నా వృత్తి పౌరోహిత్యమే. కానీ, ఆచార వ్యవహారాలు, శ్రోత్రియతలు జీవితం సవ్యంగా సాగినంతవరకే. బతుకు కుంటుపడి కూలిపోతున్న వేళ, వేరే దిక్కు చూడక తప్పదు అనేది నేను గ్రహించిన జీవిత పాఠం.

అందుకే సాహసించి మీ దగ్గరకు వచ్చాను. ఇక మీ దయ, మా మనవరాలి ప్రాప్తం అన్నాడు చెయ్యెత్తి నమస్కరిస్తూ.

నాన్నగారేదో అనబోయారు. ఆయన్ను ఆపాను. రామకృష్ణను పిలిచి విషయంచెప్పి "నీ ఇష్టం రా" అన్నాను.

వాడిష్ట ప్రకారమే, నాస్తికసంఘ కార్యాలయంలో దండలు మార్చుకుని అన్నపూర్ణ, రామకృష్ణ దంపతులయ్యారు.

అప్పటికి అన్నపూర్ణ కూతురు భారతికి రెండేళ్ళు.

అన్నపూర్ణ తాతగారు తనకున్న ఇంటిని మేము వద్దన్నా వినకుండా అమ్మేసి, లక్ష రూపాయలు ఇవ్వబోయాడు. రామకృష్ణ స్వీకరించలేదు.

నేనే, ఆ లక్ష చంటిపిల్ల భారతి పేరున ఫిక్సడ్ డిపాజిట్ చేయించాను. ఆ మరుసటి సంవత్సరమే అన్నపూర్ణ, రామకృష్ణలకు ఒక మగపిల్లవాడు పుట్టాడు.

అప్పటికి నాన్నగారు పోయారు.

పుట్టిన పిల్లవాడికి మీ నాన్నగారి పేరు పెట్టరా అంది అమ్మ రామకృష్ణతో.

నాకు ముగ్గురూ ఆడపిల్లలే, నా వరకు నాకా అవకాశం లేకపోయింది.

రామకృష్ణ తన కొడుక్కి నాన్నగారి పేరు పెట్టలేదు. చార్వాక్ అని పేరు పెట్టాడు. అదీ ఆ నాస్తిక కార్యాలయంలో జరిగిన ఒక గెట్ టు గెదర్ సమావేశంలో.

అమ్మ బాధపడింది.

ఇందులో బాధపడవలసింది ఏముంది? పేరన్నది ఒక వ్యక్తిని, అనేకమంది నుండి వేరుగా గుర్తించటానికి పెట్టుకునే ఒక గుర్తు మాత్రమే. అది చైనులు గారైతేనేమి చార్వాక్ అయితేనేమి అని అమ్మకు నచ్చచెప్పాలని ప్రయత్నించాను.

ఆమె సమాధానపడినట్లేమీ కనిపించలేదు. ఒకే విషయాన్ని ఒక్కొక్కరు ఒక్కో కోణంలో చూస్తారని నేనే సమాధానపడ్డాను.

కాలచక్రం తనపని తాను చేసుకుపోవటంతో ఇరవై సంవత్సరాల కాలం మరికొంత ముందుకు నెట్టుకుపోయింది.

అన్నపూర్ణ కూతురు భారతి ఇంటర్మీడియట్ ఫస్ట్‌క్లాస్‌లో పాసై ఎంసీఏ చేసింది.

చార్వాక్ ఇంజనీరింగ్‌లో చేరాడు.

•••

ఒంగోలులో పెళ్ళికొడుకు తల్లిదండ్రులతో మాట్లాడాను. తిరిగివచ్చి అన్నపూర్ణ, రామకృష్ణల తోనూ మాట్లాడాను. అందరికీ ఆమోదయోగ్యమైన పద్ధతి మేరకు, నేను, నాభార్య పెళ్ళిపీటలపై కూర్చొని సంప్రదాయరీతిలో భారతి పెళ్ళి జరిపించాను, మా ఇంటిలోనే.

వివాహానంతరం వధూవరులిద్దరూ జంటగా, పెద్దలైన, ఆత్మీయ దంపతుల ఆశీస్సులు కోరుతూ వారి పాదాలకు నమస్కరించే సందర్భంలో అన్నపూర్ణ ఎంత అభిలషించినా రామకృష్ణ సహకరించలేదు. అసలు వివాహం జరుగుతున్నంతసేపు ఆ ప్రదేశంలోనే లేడు వాడు.

సర్వమంగళ వివాహ వేళనే కాదు ఆ తర్వాతి మూడు నిద్రలు, పదహారు రోజుల పండుగ లాంటి అన్ని వేడుకలను మా ఇంటనే జరిపించి వియ్యాల వారు సంతృప్తిపడేలా అంతా తానై నిర్వహించింది.

•••

చార్వాక్, ఇంజనీరింగ్‌లో యూనివర్సిటీ ప్రథముడిగా ఉత్తీర్ణత సాధించాడు. అంతా సంతోషించాం, ముఖ్యంగా సర్వమంగళ.

ఓనాడు రామకృష్ణ మా ఇనిస్టిట్యూట్‌కి వచ్చాడు. సామాన్యంగా ఎప్పుడో కాని రాడు వాడు. వస్తూనే ఇదేంటి అన్నయ్యా, టైపురైటర్లేవి? ఆ బల్లలు, కుర్చీలు ఏమయ్యాయి? అన్నాడు ఆశ్చర్యంగా,

రెండు జిరాక్స్ మిషన్లతోనూ, ఒక డూప్లికేట్ మిషన్‌తోనూ ఉన్న నన్ను చూసి.

మారుతున్న కాలాన్ని, ఎక్కివస్తోన్న సాంకేతిక ప్రగతిని నీవు గమనించటం లేదా? ఇదిప్పుడు కంప్యూటర్ యుగం. పాత టైపురైటర్లు అంతర్ధానమయ్యాయి. వాటి స్థానంలో కంప్యూటర్లు వచ్చిపడ్డాయి.

ఆ కంప్యూటర్ల జ్ఞానాన్ని ఈ నా వయస్సు అందుకోలేకపోయింది. ఇదిగో ఈ జిరాక్స్ మిషన్, కొరియర్ సర్వీస్ బుకింగ్ బ్రాంచ్, టెలిఫోన్ కాయిన్ బాక్స్‌తోనూ నేను మిగిలిపోయాను. ఇంత కంటే బరువెత్తలేనుగా. తృప్తిగానే ఉన్నాను అన్నాను.

'అవునులే' అంటూ అసలు తానెందుకొచ్చిందీ చెప్పాడు.

ఆనాడు చార్వాక్ తనకు చెన్నై ఐఐటిలో వచ్చిన ఎంటెక్ సీటు వదులుకొని నేను వద్దన్నా వినకుండా జర్మనీ వెళ్ళాడు.

ఆనాడు నీవు, వదిన బలపరిచారు వాణ్ణి. సరే ఎంటెక్ అయిపోయింది కదా, ఇప్పుడు తిరిగి రాడట. అక్కడే రీసెర్చి చేయటానికని ఉండిపోతానని రాశాడు. ఆ యూనివర్సిటీలో ప్రొఫెసర్‌కి తనంటే చాలా అభిమానమట. ఆయనగారు వీణ్ణి వేదాలపై పరిశోధన చేయమని, తాను గైడ్‌గా ఉంటానని ప్రోత్సహిస్తున్నారట.

అంతేకాదు తన పేరు చార్వాక్‌ను చక్రపాణిగా మార్చుకుంటూ మన రాష్ట్ర గెజిట్‌లో ప్రకటించుకొని ఆ కాపీ నాకు పంపాడు. కనీసం మాటమాత్రంగానైనా, నేను పెట్టిన పేరు మార్చుకుంటున్నట్లు నాతో చెప్పలేదు. వాడు నా మాట విననంతటి స్వతంత్రుడైపోయాడు. అంటూ రామకృష్ణ తన అసంతృప్తి వెల్లడించాడు.

'పోనీలేరా, రీసెర్చిచేసి జ్ఞానం సంపాదించుకోవాలనుకోవడంలో తప్పు పట్టాల్సిందేముంది? ఇక స్వతంత్రిస్తున్నాడంటావా, వాడు పసిపిల్లవాడేం కాదుగా! నాకన్నా, నీకన్నా ఎక్కువ చదువుకుంటున్నవాడు. ఎక్కువ ప్రపంచాన్ని చూస్తున్నవాడు. మనకంటే ఎక్కువ స్వతంత్ర భావాలు ఉండటంలో ఆశ్చర్యమేముంది? అభ్యంతరం పెట్టవలసినదేముంది? అన్నాను.

అన్నయ్యా, నేను మరో రెండు నెలల్లో రిటైర్ కాబోతున్నాను. మాకు వాడొక్కడే. జర్మనీలో ఉండిపోతే ఎలాగా? మా వద్దనే ఉండి, ఈ పెద్ద వయసులో మమ్మల్ని కనిపెట్టుకొని ఉంటే మాకెంత తృప్తి. అది వాడి బాధ్యత కాదా? అన్నాడు రామకృష్ణ.




వాడి మాటలకు నాకు ఆశ్చర్యం కలగటమే కాదు, నవ్వొచ్చింది కూడా.

ప్రతి సంవత్సరం నేను ఆచరించే నాన్నగారి ఆబ్దిక విధికివచ్చి నా చేతికింద తన చేతినుంచే కార్యక్రమాన్ని తాను ఆచరించకపోతేపోయాడు సరే, కనీసం ఆ రోజు ఆయనగారి ఫోటోకు, ఒక నమస్కారమైనా చేయటానికి ఇచ్చగించని రామకృష్ణేనా వృద్ధాప్యదశలో తన కొడుకు తనతో ఉండాలనే సెంటిమెంట్ వల్లెవేస్తున్నది అనేదే నా ఆశ్చర్యానికి, నవ్వుకు కారణం!

తన కొడుకు పేరు మార్చుకునేముందు తనతో సంప్రదించకపోవటాన్ని తన హేతువాద నమ్మకాలను పరోక్షంగా అవమానపరుస్తున్నట్లుగా భావించిన రామకృష్ణ, తాను హేతువాదిగా మారక ముందు, తన పెద్దలను సంప్రదించాడా?

తన జీవిత విధానాన్ని నిర్ణయించుకునే స్వతంత్రం, హక్కు తనకున్నట్టుగానే తన కొడుక్కి మాత్రం ఆ హక్కు ఉండదా?

తన కొడుకు భావనలలో వాడిదైన, తనకంటే భిన్నమైన హేతువు ఉన్నదేమోనని, రామకృష్ణ ఆలోచించాడా?

నేను రామకృష్ణమీద ఇలాంటి ప్రశ్నలు సంధించలేదు. నాలో నేను అనుకున్నానంతే!

"నీ కొడుకుతో నేను మాట్లాడతాను. వాడి సెల్‌నంబర్ ఇచ్చి వెళ్ళు" అన్నాను.

వాడి నంబరు వదినదగ్గర ఉంటుంది. వాడు మాకంటే ఎక్కువగా మాట్లాడేది వదినతోనేగా అన్నాడు.

నా కొడుకులోని ఈ తిరుగుబాటుకు, మొదటి ముద్దాయి మీ ఆవిడే సుమీ అన్నట్లు ధ్వనించింది వాడిమాట.

నిజమేనేమో వాడికొడుకు ఈ ఊళ్ళో ఉన్నంత కాలం, ఆపై వచ్చినప్పుడూ దొడ్డమ్మా, దొడ్డమ్మా అంటూ సర్వమంగళ చుట్టూ తిరుగుతూ, ఆవిడ గారి ఆధ్యాత్మిక కబుర్లు ఆలకిస్తూ, తక్కువ లేకుండా నాలుగు గంటలు ఆమె సలిపే, నిష్ఠాగరిష్ఠమైన అఖండ పూజా కార్యక్రమం తిలకిస్తూ, తదనంతరం ఆమె అందించే ప్రసాదాలను తింటూ...

దొడ్డమ్మా, ఇందాక ప్రసాదం సరిగ్గా నేను కళ్ళకద్దుకున్నట్లు లేదు. మరోసారి, ఆ చక్రపొంగలి ప్రసాదం పెడితే మళ్ళీ మళ్ళీ కళ్ళకద్దుకుంటానంటూ ఆమెతో జోకులేస్తూ ఎక్కువ సమయం మా ఇంటిలోనే గడిపేవాడు.

మా ఇంటినుండి తిరిగివెళ్ళే ప్రతిసారి వాడు, వంగి మా పాదాలకు నమస్కారం చేయకుండా వెళ్ళేవాడు కాదు.

రామకృష్ణ భావించినట్టు సర్వమంగళ ప్రభావం వాడిపై ఉన్నమాట నిజమేనేమో?

ఇంటికి తిరిగొచ్చాక, మా ఆవిడతో అవును కదూ అన్నాను.

అదే అయితే మీ తమ్ముడుగారు, మీ నాన్నగారి, అమ్మగారి పొత్తిళ్ళలోనేగా పెరిగాడు. వారి ప్రభావం అతనిపైన ఎందుకు లేదట! అని ప్రశ్నించింది.

మా ఆవిడతో వచ్చినచిక్కే ఇది. ప్రశ్నకు సమాధానం ఇవ్వక, ఎదురుప్రశ్న సంధిస్తుంది.

ఆమె దగ్గర జర్మనీలోని వాడి నంబరు తీసుకొని ఫోను చేశాను.

రామకృష్ణ మనసులోని సెంటిమెంటు తాలూకు పితృభావాలన్నీచెప్పి, పోనీ, నీవు ఇండియావచ్చి, ఇక్కడే ఆ పీహెచ్‌డీ చేయరాదా? అన్నాను.

ఆ చార్వాక్.. కాదు చక్రపాణి నాకేం సూటిగా సమాధానం ఇవ్వలేదుగానీ, నమస్కారం పెదనాన్నగారు అంటూ ప్రారంభించి వాడు వాళ్ళ ప్రొఫెసర్ గురించి చెప్పాడు.

మా ప్రొఫెసరు, శ్రీ విశ్వేశ్వరశాస్త్రిగారు. తూర్పు గోదావరి జిల్లా కోనసీమ ప్రాంతంనుండి, ముప్ఫై సంవత్సరాల కిందట అమెరికా వెళ్ళారు. అక్కడ ఖగోళశాస్త్ర పరిశోధనలు చేస్తూ జర్మనీ వచ్చారు. ఇక్కడే వేదాధ్యయనం చేస్తున్న ఒక మెక్సికన్ యువతిని భారతీయ పద్ధతిన పెళ్ళాడారు.

ఇక్కడ మాక్స్ ముల్లర్ యూనివర్సిటీలో మన వేదాలపై శాస్త్రీయ పరిశోధనలు చేసి వాటిలో



నిక్షిప్తమై ఉన్న అనేక అంతరిక్ష రహస్యాలు వెలికి తీసి గ్రంథస్థం చేసి వెలువరించారు.

అదే యూనివర్సిటీలో ప్రొఫెసరుగా నియమితులై ఇక్కడే స్థిరనివాసితులయ్యారు.

నా అదృష్టమో, పూర్వజన్మ సుకృతమో, వారికి నాపట్ల ఎనలేని అభిమానం. నేను అర్థించకుండానే నన్ను తన పరిశోధనా విద్యార్థిగా తీసుకుని 'వేదాస్ అండ్ సైంటిఫిక్ కల్చర్ ఇన్ దెమ్' అనే అంశంపై పరిశోధన జరపమని ప్రోత్సహించారు. ఆయనగారే నాకు ఎంటెక్ చివరి సంవత్సరంలో సంస్కృతం నేర్పారు.

ఆయనగారి ఏకైక పుత్రిక గర్గి నా సహాధ్యాయిని.

ఈ నా అధ్యయనాన్ని, పరిశోధనను, నేనెంతో ఉద్వేగంగా ఆస్వాదిస్తున్నాను. ఈ విషయం దొడ్డమ్మ గారికి చెప్పండి, సంతోషిస్తుంది అన్నాడు.

నీవు తిరిగి ఇండియాకు రాకూడదా? అన్న నా సూచనకు వాడిచ్చిన సమాధానం నాకు మరో మాట మాట్లాడటానికి అవకాశం ఇవ్వలేదు. నేను ఫోన్ పెట్టేశాను.

రామకృష్ణతో నేనేమీ వాడి కొడుకుతో నా ఫోను సంభాషణా సారాన్ని చెప్పలేదు. వాడూ ఈ విషయమై ఏమీ మళ్ళీ ప్రస్తావించలేదు.

ఓపిక తగ్గిందేమో, రామకృష్ణ వెనుకటిలా నాస్తికవాదులతో కలిసి, హేతువాద సభలకు, సమావేశాలకు వెళ్ళడం చాలావరకు తగ్గించేశాడట.

మా ఆవిడ నోచిన నోమువాయనం పుచ్చుకోవటానికి వచ్చిన అన్నపూర్ణ చెప్పింది.

నీవిలా వాయనం తీసుకోవటానికి వస్తున్నట్లు రామకృష్ణకు తెలుసా? అన్న సర్వమంగళ ప్రశ్నకు చెప్పే వచ్చానంది అన్నపూర్ణ.

నా అభిప్రాయాలు నీపై రుద్దను అన్నాడట ఈ మధ్య ఓ సందర్భంలో.

●●●

మరో మూడు సంవత్సరాలు గడిచాయి.

ఓనాడు, జర్మనీనుండి నాకో జాబు వచ్చింది. ఫోనులో మాట్లాడే చక్రపాణి నామధేయుడు జాబెందుకు రాసినట్లో?

పెదనాన్నగారికి,

నమస్కారాలు.

నా వేద పరిశోధనా 'దిదృక్ష'లో నేను వేదాలలో నిక్షిప్తమైన శాస్త్రవిజ్ఞాన అంశాలతోపాటు మహోత్కృష్టమైన మనజాతి సాంస్కృతిక మూలాలను దర్శించగలిగాను. మన వేదాలు మానవ సమాజానికి కాలానుగుణంగా తమను తాము నియంత్రించుకుంటూ ఎలా పయనించాలో నిర్దేశించాయి.

వేదాలు కులాలను, మతాలను సృష్టించలేదు. అవి సర్వమానవ సమానత్వాన్ని, సౌభ్రాతృత్వాన్ని బోధించాయి. మనమే వేదహిత సామాజిక శాస్త్రాన్ని దుర్వ్యాఖ్యలకు గురిచేసి అర్థతార్థతలను, విచక్షతలను సృష్టించుకొని మన సంస్కృతి మూలాలను ధ్వంసం చేసుకున్నాం.

వేదాలు మన జాతి సంపద. వాటిని రక్షించుకోవడం మన బాధ్యత. నా ప్రయాణం ఆ దిశనే సాగుతుంది ఇకపై.

ఈ సందర్భంలో మీకు మరో ముఖ్య విషయం చెప్పాలి. మిమ్మల్ని కలుగజేసుకోమని కాదుగానీ పెద్దలైన మీకు తెలియజేయటం నా విధి కనుక మాత్రమే చెబుతున్నాను.

మీకు తెలుసు, మా ప్రొఫెసరుగారి అమ్మాయి గర్గి నా పరిశోధనలో నా సహాధ్యాయిని. ఈ రీసెర్చి ప్రాజెక్టు మూలంగా మేము చాలా సన్నిహితులమయ్యాం. మేము ఒకరినొకరు ఇష్టపడ్డాం. మా వివాహానికి, మా ప్రొఫెసరుగారు స్థూలంగా అంగీకరించారు. కానీ అది సంప్రదాయ పద్ధతిలో జరగాలని ఆయనగారి నిర్దేశం.

అంటే, అమ్మ నాన్నగార్లు పెళ్ళిపీటలమీద కూర్చుని ఈ వివాహ కార్యక్రమంలో పాలు పంచుకోవాలన్నది ఆయనగారి స్థిర నిర్ణయం.

అందుకు భిన్నమైనదైతే వారు అంగీకరించరనేది సుస్పష్టంగా చెప్పారు.

గర్గికి వాళ్ళ నాన్నగారి మాట సుగ్రీవాజ్ఞ. జవదాటదు.

నాన్నగారిని నేనేం అర్థించదలచుకోలేదు. తన భావాలపట్ల, సిద్ధాంతాలపట్ల నిబద్ధతగల హేతువాదినని నమ్మేవ్యక్తి ఆయనగారు.

హేతువంటే, సాక్ష్యాధారమైన సత్యాన్ని దర్శించటం కదా!

నేనూ నా పరిశోధనల ఆధారంగా అలాంటిదే అయిన మరో హేతువును దర్శించాను.

నాన్నగారి భావాలు, నమ్మకాలు, నా భావాలు, నమ్మకాలు సమాంతరమైన రైలుపట్టాలు లాంటివి. అందుకే నేను నా వివాహ ప్రస్తావనను ఈ జన్మకు ఆవలపెట్టి, నిరంతరంగా పరిశోధనలలోనే మునిగిపోదలిచాను.

ఈ సమీపకాలాన కాదుగానీ, ఏ నాటికో ఒక నాటికి భారతావనికి తప్పక తిరిగి వస్తాను. ఆ పుణ్యభూమిలోనే మిగిలిపోతాను.

నా ఈ నిర్ణయం మీకు అవిహితంగా కనిపిస్తే క్షమించండి.

మీ అందరికీ నమస్కారాలతో....

చక్రపాణి.

వాడి జాబు నన్నొక్క కుదుపు కుదిపేసింది.

ఆ జాబు తీసుకుని రామకృష్ణ ఇంటికివెళ్ళి ఇచ్చి, నాకు ఏ హేతువాదిని, నాస్తికవాదిని కించపరచాలనే తలంపు లేదు కానీ, సమాంతరమైన రైలు పట్టాలు కలవకపోతే పోవచ్చు, వాటిపై నడిచే రైలుబండి గమ్యానికి చేరి ఆత్మీయుల్ని కలుపుతుంది.

హేతువాదానికైనా, హేతు 'వేదానికైనా హృదయ స్పందనలు ఉంటాయి, ఇక నీ ఇష్టం అనేసి తిరిగి వచ్చాను.

●●●

ఎందుకో గర్గి - చక్రపాణిల వివాహం సంప్రదాయబద్ధంగా జరుగుతుందనే ఒక ఆశ నాలో మిణుకుమిణుకు మంటోంది.

సెల్: 98853 20765

## రకూల్ కోరిక తీర్చేవారెవరు?

ఏ హీరోయిన్ అయినా గ్లామర్ పాత్రలు, లేడి ఓరియెంటెడ్ సినిమాలు, సీరియస్ సినిమాలు చేయాలని కోరుకుంటుంది. కానీ రకూల్ ఇందుకు భిన్నమైన కోరిక కోరుతోంది. అదేమిటంటే ఇంటిమేట్ సీన్లు ఫుల్‌గా ఉండే సినిమా చేయాలని ఉందట! ప్రస్తుతం బాలీవుడ్‌లో ఈ రకమైన సినిమాలు బాగానే నడుస్తున్నాయి. ఆ ట్రెండ్‌ను దక్షిణాది వారికి కూడా పరిచయం చేయాలని అనుకుంటోందట! అలాంటి కథతో ఎవరైనా వస్తే వెంటనే ఓకే చెబుతుందట! కానీ రకూల్ ఇక్కడ ఓ విషయం మరిచిపోయింది అంటున్నారు టాలీవుడ్ జనాలు. ఉత్తరాదిన అలాంటి సినిమాలను ఆదరిస్తారేమో కానీ, దక్షిణాదిన వాటిని బీ గ్రేడ్ కన్నా తక్కువగా చూస్తారు. కెరీర్ మంచి పీక్స్‌లో ఉన్నప్పుడే ఇలాంటి సినిమాలమీద కోరిక అసలుకే మోసం తెస్తుందేమో అన్న అనుమానాన్ని ఆమె సన్నిహితులు వ్యక్తం చేస్తున్నారు.



# పండు మిర్చితో దీర్ఘాయుష్షు



మిరపకాయలు లేని వంటను ఊహించుకోవడం కష్టమే! ఆహారపదార్థాల్లో కారం ఎక్కువగా వేసుకునే అలవాటు చాలామందికి ఉంటుంది. ఈ అలవాటే మనిషికి లాంగ్ లైఫ్ ఇస్తుందని అంటున్నారు పరిశోధకులు. గతంలో నిర్వహించిన పరిశోధనల్లో కారం ఎక్కువగా తీసుకోవడం వలన అధికబరువు సమస్య నుంచి కొంత వరకూ తప్పించుకోవచ్చన్న విషయం రుజువైంది. ఇప్పుడు అమెరికాలో నిర్వహించిన పరిశోధనల్లో పండు మిరపకాయలు ప్రతిరోజూ ఆహారంలో తీసుకోవడం వలన పలు ఆరోగ్య సమస్యలు తగ్గించుకోవచ్చు అన్న విషయం స్పష్టమైంది. అమెరికాలో 16వేల మంది మీద సుమారు 23 సంవత్సరాల పాటు అధ్యయనం నిర్వహించారు. ఈ కాలంలో వారి ఆహార అలవాట్లు, వారి ఆరోగ్య స్థితిని గమనించారు. పండుమిరపకాయలు ఎక్కువగా తినే వారిలో తక్కువ ఆరోగ్య సమస్యలు కనిపించగా, తక్కువ తీసుకునే వారిలో గుండెపోటు వంటి సమస్యలను గుర్తించారు. కారం ఎక్కువ తినడం వలనే దీర్ఘాయుష్షు సాధ్యమన్న విషయాన్ని వీరు స్పష్టం చేయకపోయినా, కొన్నిరకాల ఆరోగ్య సమస్యలకు దూరంగా ఉండవచ్చునని మాత్రం వీరు స్పష్టం చేస్తున్నారు.




# మార్నింగ్ సిక్‌నెస్ మంచిదే!



గర్భవతులు ఎదుర్కొనే ఈ సమస్య వారికి చాలా మంచి చేస్తుందని పరిశోధకులు అంటున్నారు. మార్నింగ్ సిక్‌నెస్ ఎదుర్కొనే గర్భవతుల్లో గర్భవిచ్ఛిత్తి (అబార్షన్) అయ్యే అవకాశాలు 75శాతం తగ్గుతాయని చెబుతున్నారు. ఇందుకోసం సుమారు 800 మంది గర్భవతుల మీద అధ్యయనం నిర్వహించారు. వీరిలో 75 శాతం మంది మార్నింగ్ సిక్‌నెస్‌తో బాధపడుతున్న వారే. రెండో నెల నుంచి ఆరో నెల వరకూ మార్నింగ్ సిక్‌నెస్‌తో వీరు పడిన ఆరోగ్య సమస్యల గురించిన వివరాలు సేకరించారు. ఆశ్చర్యకరంగా మార్నింగ్ సిక్‌నెస్‌తో బాధపడే గర్భవతుల్లో గర్భవిచ్ఛిత్తి అయ్యే అవకాశాలు పది శాతం కూడా కనిపించలేదు. అదే మార్నింగ్ సిక్‌నెస్‌తో బాధపడని వారిలో అబార్షన్ అయ్యే అవకాశాలు ఎక్కువగా కనిపించాయి. అయితే అబార్షన్ జరగకుండా ఉండడానికీ, మార్నింగ్ సిక్‌నెస్‌కీ సంబంధం ఉందా? అన్న విషయాన్ని మాత్రం వీరు స్పష్టం చేయలేదు. దీని మీద ఇంకా పరిశోధనలు నిర్వహించాల్సిన అవసరం ఉందని వారు చెబుతున్నారు.

# మెడిటేరియన్ డైటే మంచిది

బరువు తగ్గాలన్నా, చక్కెరవ్యాధి అదుపులో ఉండాలన్నా, రక్తపోటు రాకుండా ఉండాలన్నా మెడిటేరియన్ డైట్ తీసుకోమంటున్నారు నిపుణులు. మెడిటేరియన్ ఆహారంలో ఉండే ఆలివ్ ఆయిల్, పాలిష్ పట్టని తృణధాన్యాలు, పళ్లు, చేపలు వంటివి సంపూర్ణ ఆరోగ్యాన్ని ఇస్తాయన్న విషయం పలు పరిశోధనల్లో వెల్లడైంది. మెడిటేరియన్ డైట్ కారణంగా చక్కెరవ్యాధి అదుపులో ఉండడమే కాకుండా కేన్సర్ వచ్చే అవకాశాలు ఆరు శాతం తగ్గుతాయని నిపుణులు చెబుతున్నారు. ఈ డైట్ తీసుకునే వారి మెదడు వృద్ధాప్యంలో కూడా చాలా బాగా పనిచేస్తుందని, ఆ వయస్సులో కనిపించే మతిమరుపు మచ్చుకు కూడా కనపడదన్న విషయం ఇటీవల నిర్వహించిన పరిశోధనల్లో స్పష్టమైంది.



# చదువుతోనే ఆరోగ్యం

చదువుకీ, వ్యక్తి ఆరోగ్యానికీ ఉన్న సంబంధం గురించి ఆస్ట్రేలియా పరిశోధకులు సుదీర్ఘకాలంపాటు అధ్యయనం నిర్వహించారు. సుమారు మూడులక్షల మంది మీద వీరు అధ్యయనం చేశారు. వీరందరూ 45 సంవత్సరాల నుంచి 65 సంవత్సరాల వయస్సు లోపు వారే! డిగ్రీ చదువుకున్న వారి కన్నా ఇంటర్‌తో ఆపేసిన వారే గుండెపోటుతో మరణించే అవకాశం 70 శాతం ఉందన్న విషయం వీరి అధ్యయనంలో వెల్లడైంది. దీనికి కారణం చదువుకున్న వారు మంచి ఉద్యోగం సంపాదించి జీవితంలో స్థిరపడితే ఇంటర్‌తో ఆపేసిన వారిలో అభద్రతా భావం ఎక్కువగా ఉండడం, అనవసర విషయాలకి కూడా ఒత్తిడికి లోనుకావడం వంటివి పరిశోధకుల దృష్టికి వచ్చింది. దీనికి కారణం తక్కువ చదువూ, తక్కువ సంపాదనా, జీవితంలో అభద్రతా భావం కారణం కావచ్చని పరిశోధకులు చెబుతున్నారు. జీవితానికి భద్రత, మంచి సంపాదన కావాలంటే చదువు తప్పనిసరి అని వారు స్పష్టం చేస్తున్నారు. చదువుకోని వారందరూ మృత్యువుకి దగ్గర కావడం లేదు కదా అన్న ప్రశ్నకు వారు సరైన సమాధానం ఇవ్వలేకపోయారు. దీనిమీద ఇంకా విస్తృతంగా పరిశోధనలు చేస్తున్నారు.

-అవినాష్



## సరదాగా....

### ఆదాయం బాగుంది

ఒకాయన తన మిత్రుడితో పందెం కాశాడు. ఒక రోజు ఉదయం నుంచి సాయంత్రం వరకు చార్మినార్ దగ్గర అడుక్కుంటే రెండు వేల రూపాయలిస్తానని.

పందేనికి ఒప్పుకున్న మిత్రుడు ఒప్పందం ప్రకారం భిక్షగాడిలా వేషం వేసుకుని ఉదయం నుంచి సాయంత్రం వరకు అడుక్కున్నాడు.

పందెం ఓడిపోయిన మిత్రుడు అలాగే రెండువేల రూపాయలిచ్చేశాడు.

మరుసటి రోజు చార్మినార్ పక్కనే వెళుతుండగా అతనికి తన మిత్రుడు మళ్లీ భిక్షగాడి రూపంలో అడుక్కుంటూ ఉండడం కనిపించింది

నెమ్మదిగా అతని దగ్గరకు వెళ్లి 'ఒరే! నీకిదేం పొయ్యే కాలం. నిన్నైతే నాతో పందెం వేసుకున్నావ్. ఈరోజు కూడా ఎందుకు అడుక్కుంటున్నావ్?' అని అడిగాడు

'ష్...గట్టిగా అరవకు' ఇన్‌కమ్ బాగుంది గురూ.... అందుకనే కంటిన్యూ అయిపోతున్నా.

### ఒక ప్రశ్న?

అదొక ఫేమస్ స్కూల్! ఎనిమిదో తరగతి చదువుతున్న విద్యార్థులని ఎడ్యుకేషనల్ టూర్‌కి బెంగళూరు తీసుకెళ్ళారు. మొత్తం మూడురోజుల ట్రిప్. మొదటిరోజంతా మొక్కలతో కుస్తీపట్టారు. హెర్బేరియం తయారుచేయడానికి కొంతమంది తమకు కావలసిన మొక్కలను సేకరించారు. రెండవరోజు జూకి వెళ్ళారు. అక్కడి అరుదైన జంతుజాతులను విచిత్రంగా చూశారు విద్యార్థులు. వాటి సైంటిఫిక్ పేర్లు తెలుసుకున్నారు, నోట్ చేసుకున్నారు. ఎందుకంటే టీచర్లు ముందుగానే చెప్పారు, టూర్ విశేషాలతో ప్రాజెక్ట్ రిపోర్టు తయారుచేసి సబ్మిట్ చేయాలని, రిపోర్టుకి మార్కులుంటాయని! దాంతో ఎవరికి వారు తాము చూసిన, తమకు అర్థమైన రీతిలో పాయింట్లు రాసుకుంటున్నారు. మొదటిరోజంతా గార్డెన్ విశేషాలు, జూ వివరాలు అన్నీ రాసుకున్నారు. ఇక మూడోరోజు జాలీడే! సరదాగా ఆ రోజంతా ఎంజాయ్ చేసి తిరిగి వచ్చారు. తరువాతి రోజు స్కూలుకి అందరూ వెళ్లి తామెలా ఎంజాయ్‌చేసిందీ మిగతావాళ్లకి చెప్పి తెగ సంతోషపడిపోయారు. సైన్స్ టీచర్ క్లాసులోకి వచ్చి అందరినీ రిపోర్టులు ఇమ్మంది. తాము రాసిన రిపోర్టులను ఎవరికివారు నీట్‌గా డిజైన్ చేసి సబ్మిట్ చేశారు. టీచర్ అందరి రిపోర్టులు చూసింది. చరణ్ అనే విద్యార్థి రాసిన రిపోర్టు సైన్స్ టీచర్‌ని ఆకర్షించింది. అందులో రాసిన ప్రత్యేకమైన అంశం ఒకటి ఆమె దృష్టిని ఆకర్షించింది. చరణ్‌వైపు చూసి నవ్వి, పిల్లలూ మీకో ప్రశ్న? సమాధానం అందరికీ తెలిసిందే! కానీ చెప్పగలరో లేదో చూద్దాం అంది. సరేనన్నారు పిల్లలు.

**ప్రశ్న:** మీరు సైన్స్‌లో జంతుశాస్త్రంలో దాని గురించి చదివారు కూడా! ఆర్థ్రోపొడా వర్గానికి చెందినది అది. దాన్ని చంపాలంటే కచ్చితంగా మీరక్తాన్ని కాస్త చిందించాల్సిందే! అప్పుడే దాన్ని చంపగలం. అదే మిటో చెప్పగలరా?

పిల్లలైతే ఆలోచించి దానికి సమాధానం చెప్పారు. మరి మీరూ ప్రయత్నించండి.

పెళ్ళిచూపులప్పుడు అబ్బాయి బాంకులో పని చేస్తారంటే పగలేమో అనుకుని మోసపోయాం పిన్నీ!!

ఓ సంవత్సర కాలం లాంగు లీవుపెట్టి ప్రమోషన్ కోసం తపస్సు చేశాను.. మరేమో తీరిగ్గా యిప్పుడొచ్చారు.. నేనెప్పుడో రిటైరైపోయుంటాను!!

ఆయన మిలటరీలో పని చేసి రిటైరయ్యారుగా పిన్నీ!! ఇంట్లో ఎవరూ చిటుక్కుమనడానికి కూడా వీల్లేదు!!

**డాక్టర్ దగ్గరికి పోవటం అనే మాట చెవులపడిన వెంటనే పెదవులు ముడిచి, పూత్కారం చేస్తూ గంగవెర్రులు ఎత్తినట్టు చిందులు తొక్కేది ఆమె, అంతకుముందు. మీది మీదికి వచ్చి వట్టి చేతులతోనే గొంతు పిసికేసేటంత కోపాన్ని వెలిబుచ్చేది.**

**అటువంటి మనిషి అంత ప్రశాంతంగా, నవ్వుతూ అందుకు అంగీకరించటం?**

చటుక్కున తలతిప్పి ప్రత్యూషవైపు చూసింది ప్రణవి. అంతే, మరొక్క క్షణం కూడా ఆలస్యం చేయకుండా తన ఫోన్ తీసి చకచకా నంబర్లు టచ్ చేసింది ఆమె.

పగలంతా పేషంట్లతో గడిపి, అలసట అధికం అయిపోవడం వల్ల, ఒళ్ళు తెలియనంత గాఢనిద్రలో ఉన్నాడు కాబోలు మొదటి ప్రయత్నం వృథా అయిపోయింది. రెండవ ప్రయత్నం చిట్టచివర్లో చాలా మత్తుగా వినవచ్చింది కంఠం.

'హల్లో... ఈ టైములో ఎవరూ? ఏమిటీ డిస్టర్బెన్సు?' అంటూ.

'సారీ డాక్టరు గారూ! నేను ప్రత్యూషని మాట్లాడుతున్నాను. మా ప్రణవి మీకు రింగ్ ఇవ్వమంది' తడుముకోకుండా చెప్పింది ప్రత్యూష.

ప్రణవి పేరు చెవులపడిన మరుక్షణం ఎలర్ట్ అయిపోయినట్లున్నాడు, 'సారీ అమ్మ, వేరే ఎవరో అనుకున్నాను. శివారెడ్డి సారు ఓకేనే కదా!' అన్నాడు.

'ఇటివ్వవే... నేనే మాట్లాడతాను. ఇటు ఇచ్చేయ్' అంటూ చేతిని జాచి ఫోన్ తను తీసుకుంది పిచ్చమ్మి.



"డాక్టరు గారూ..." అంటూ మాట మొదలు పెట్టిన వెంటనే కంఠాన్ని గుర్తు పట్టాడు.

'తల్లీ.. మీరా? ఏమిటి విషయం! చెప్పండి తల్లీ' వినయంగా ఎంక్వయిరీ చేశాడు.

'ఎమర్జెన్సీ ఏమీకాదు. మీరు హడావుడి పడవలసిన అవసరం ఎంత మాత్రం లేదు. మా వాళ్లు నా గురించి అదేపనిగా ఎగ్జయిట్ అవుతున్నారు. వాళ్ల తృప్తి కోసం నేనే మీకు చేయమన్నాను' నవ్వుతూ చెప్పింది ఆమె.

'చెప్పండి తల్లీ... విషయం ఏమిటో చెప్పండి' మళ్ళీ రిపీట్ చేశాడు డాక్టరు.

'నాకు పిచ్చి నయమయ్యే సూచనలు కనిపిస్తున్నాయని మా రమణయ్యపంతులుగారు అభిప్రాయపడుతున్నారు. మీరు ఒకసారి ఆ స్పెషలిస్టు... అతని పేరు...' అంటూ మాట ఆపింది ఆమె.

'సైకియాట్రిస్ట్ అంటారు తల్లీ.. సైకియాట్రిస్ట్...' వెంటనే అందించాడు డాక్టర్.

'అవును. అతన్ని వెంటబెట్టుకుని రావటానికి వీలు ఉంటుందా?' మృదువుగా అడిగింది ఆమె.

'తప్పకుండా! నేను ఇప్పుడే అతనికి ఫోన్‌చేసి వెంటనే బయలుదేరమని చెపుతాను. నేను కూడా రెడీ అవుతాను. కొంచెం టైము పడుతుందమ్మా' అప్పటికప్పుడు బయలుదేరలేకపోవడంతో చాలా బాధపడుతున్నట్టు చిన్నగా చెప్పాడు అతను.

'ఫరవాలేదు డాక్టరుగారు... అసలు ఇప్పటికిప్పుడు రావాల్సిన అవసరం లేదు. తెల్లవారిన తర్వాత వచ్చినా ఇబ్బంది ఏమీ లేదు. నా కండీషన్ వట్టి మెంటల్ డిజార్డర్ మాత్రమే! హార్ట్‌కి సంబంధించిన ఎమర్జెన్సీ వ్యవహారం కాదు గదా.. యూ టేక్ యువర్ టైమ్' చెప్పింది పిచ్చమ్మి.

రమణయ్యపంతులు మాదిరిగానే, వెంటనే ఆమెలో వచ్చిన మార్పు తనకు కూడా అర్థం అయినట్టు... "అమ్మా దేవుడున్నాడు తల్లీ! హీ ఈజ్‌దేర్! అండ్ హీ డెఫినెట్లీ ఈజ్ లుకింగ్ అపాన్ యూ అండ్ యువర్ ఫ్యామిలీ! నాకు చాలా సంతోషంగా ఉందమ్మా. రేపు తెల్లవారగానే వచ్చేస్తాను" అన్నాడు డాక్టరు.

'ఓకే. గుడ్‌నైట్ డాక్టరుగారూ' అంటూ ఫోన్ డిస్కనెక్ట్ చేసి, నోళ్ళు తెరుచుకు చూస్తున్న అందరి వంకా చిరునవ్వుతో చూసింది పిచ్చమ్మి.

ఇంకోసారి ఆమె మెడ చుట్టూ చేతులు చుట్టి గుండెలమీద తల పెట్టుకుంది ప్రణవి.

'పెద్దమ్మకి చెప్పనా?' తన ఫోన్‌ని తీసుకుంటూ అడిగింది ప్రత్యూష.

'చెప్పనా అని అంత నెమ్మదిగా అడుగుతావేమిటి? అసలు చెప్పాల్సింది అమ్మగారికే. చెయ్యి' స్పీడ్‌గా అన్నది శివారెడ్డి భార్య.

'వద్దు..' వెంటనే అడ్డుకున్నది పిచ్చమ్మి.

'అలసిపోయి పడుకుని ఉంటుంది. ఇప్పుడు బలవంతంగా నిద్ర లేపితే, తిరిగి నిద్రపోదు. అలాగే నిట్టనిలువుగా కూర్చుంటుంది. రేపు డాక్టర్లు వచ్చి వెళ్లిన తర్వాత...' అంటూ, ఉన్నట్లుండి తలను పైకెత్తి సీలింగ్ వైపు చూసింది.

'తల్లీ.. తల్లీ.. మళ్ళీ మనసు కల్లోలపడుతున్నదా?' ఆమె ముఖం మీదినుంచి చూపులు తిప్పకుండా అలాగే చూస్తున్న పంతులుగారు వెంటనే అడిగాడు.

"వందనాలు తల్లీ.. నీకు మా వందనాలు" తడుముకోలేదు శంకరయ్య గబుక్కున రిపీట్ చేశాడు అంతకు ముందు మాటల్ని.

కిందికి దిగిపోయాయి పిచ్చమ్మి చూపులు. "నిజమే పంతులుగారూ.. తలనొప్పి వచ్చినట్టు ఒకటే అలజడి. ఇప్పుడు లేదు" అన్నది కనుల్ని అరచేతులతో అద్దుకుంటూ.

నవ్వు ముఖంతో, ఆ గదిలో ఒక గోడకు బిగించి ఉన్న కదిరిస్వామి ఫొటోవైపు తిరిగి నమస్కారం చేశాడు రమణయ్యపంతులు.

●●●

రాయుడిపల్లి రవీంద్రన్న ఇంటికి మూడు ఫర్లాంగుల దూరంలో ఉన్న ఒక పెద్ద ఎర్రరాయి గుట్ట దగ్గర కూర్చుని ఉన్నారు వెట్టి, అతనితో పాటుగా బండోడు, అతన్ని పిలిపించిన యువకుడు.

'అవునన్నా... బాజిరెడ్డికి, మా అయ్యకు చాలా పెద్ద స్నేహమే ఉండేది, ఆ రోజుల్లో. మనకు కావల్సిన ప్రతి వస్తువూ తెల్లవారేసరికి ఇంటి ముందుకు వచ్చేసేది. చిటికెవేస్తే చాలు చేతులు కట్టుకుని నిలబడే వాళ్ళు అతని జనం' తన తండ్రికి, ఆ బాజిరెడ్డికి మధ్య ఉన్న అనుబంధాన్ని వివరిస్తూ చెపుతున్నాడు బండోడు.

'స్నేహం ఉండటం వరకూ ఓకే. అంతగట్టిగా దృఢంగా ఉన్నది కాస్తా ఎప్పుడు బెడిసికొట్టింది? ఎడమొఖం పెడమొఖం ఎప్పుడు మొదలైంది?' వెట్టి తరపున తనే అడిగాడు యువకుడు.

'తారీఖులు, సంవత్సరాలు అడిగితే చెప్పటం కష్టం. మనం ఒకటో తరగతిలోనో, రెండో తరగతిలోనో ఉన్నప్పుడు జరిగింది. బాజిరెడ్డి పేరు ఎత్తితే చాలు గంయ్‌మనటం మొదలుపెట్టాడు మా అయ్య. పొరపాటున కూడా మందు జోలికి పోని మనిషి కాస్తా ఇరవై నాలుగు గంటలూ అదే పని పెట్టుకోవడం మొదలు పెట్టాడు' చెప్పాడు బండోడు.

'తారీఖులు, సంవత్సరాలు అవసరం లేదు. అసలు వాళ్లిద్దరికీ ఎందుకు చెడిందో అది కావాలి' వెంటనే మాట్లాడాడు వెట్టి.

# వెట్టి

## (ది వారియర్)

-మధుబాబు




'ఆ వివరాలు ఏమీ నాకు తెలియవు. మా అయ్యను అడగాల్సిందే' అన్నాడు బండోడు.

'అడిగితే చెపుతాడా?' అడిగాడు యువకుడు.

'చెప్పకపోవటానికి ఇందులో కొంపలు అంటుకుపోయేది ఏముంది?' ఆశ్చర్యంగా అడిగాడు బండోడు.

తన పక్కనే ఉన్న యువకుడితో తనకున్న స్నేహం కారణంగా అడిగిన ప్రతి మాటకు చకచకా సమాధానాలు ఇచ్చేస్తున్న ఆ అమాయకుణ్ణి మబ్బుచేసి తనకు కావాల్సిన రహస్యాల్ని రాబట్టుకోవాలన్న దురాలోచన వెట్టికి లేదు.

'నువ్వు అనుకుంటున్నట్టు ఇది ఆషామాషీ వ్యవహారం కాదు. కోపం వస్తే పడగ విప్పి పైపైకి దూసుకు వచ్చే చౌడేశ్వరికి చెందిన విషయం. అసలు ఈ సబ్జెక్టు మీద మాట్లాడటానికి మీ నాన్నగారు ఒప్పుకోకపోవచ్చు. గుమ్మంలో ఉండగానే నన్ను దూరంగా వెళ్లిపొమ్మని రంకెలు పెట్టవచ్చు' మృదువుగా అన్నాడు.

'ఏది మాట్లాడినా సూదిమొనంత తప్పుకూడా లేకుండా మాట్లాడటం ఈ అన్న స్పెషాలిటీరా! బాజిరెడ్డితో చాలా పెద్ద పగ ఉంది. ఇంకో రెండు మూడు గంటల్లో ఆడి జనం ఈడకి వచ్చేస్తారు, ఈ అన్నని ఏసేయటానికి. ఆ జనాన్ని ఎవరో కాదు మన గుర్రపోడే తీసుకు వస్తాడు. ఆళ్ళు వచ్చే లోపల అన్న జంపైపోవాలి. ముందు ఈ బాజిరెడ్డి మతలబేంటో తెలుసుకోవాలి' తను కూడా అన్నాడు యువకుడు.

'బాజిరెడ్డి జనమా? వస్తున్నారా? మన దగ్గర ఉన్న ఈ అన్నయ్య మీదికా? గుండెలా వాళ్ళవి గుంటలా?? తిన్నగా వెనక్కి వెళ్ళిపోగలరా?' పెదవులు ముడిచి, కోరగా చూస్తూ అడిగాడు బండోడు.

.ఓరినీ... నిన్ను పిలిచింది తగాదాల్లో తోడుకోసం కాదురా నాయనా! మీ నాయన్ని అడిగి ఆ విశేషం ఏమిటో వివరంగా తెలుసుకోవటానికి వీలు ఉంటుందో ఉండదో, ముందు అది చెప్పు' విసుగ్గా అడిగాడు యువకుడు.

'ఇప్పటివరకూ నేను ఇట్టాంటివి అడిగింది లేదు' అంటూ లేచి నిలుచున్నాడు బండోడు. 'అడిగి చూద్దాం పదండి. చెప్పకూడని రహస్యం అంటూ ఏదైనా ఉంటే, ఎందుకు చెప్పకూడదో తెలుసుకుందాం...' అంటూ వారి సమాధానం కోసం ఎదురు చూడకుండా తమ ఇంటివైపు నడక మొదలుపెట్టాడు.

'ఈడి మనసులో ఏదైనా మాటని మనం మొలవ బెట్టామంటే అటో ఇటో తేలేవరకూ వదిలిపెట్టడు. అందుకే అందరూ బండోడు అంటారు వాణ్ణి. అసలు పేరు ముద్దుకృష్ణ...' నవ్వుతూ చెప్పి, వెట్టి చేయి పట్టుకుని అతని వెనుకే నడిచాడు యువకుడు.

•••

నాలుగు అడుగుల ఎత్తున్న పందిరి మంచం వంటి పట్టెమంచం మీద పడుకున్నాడు బాజిరెడ్డి. పది అంగుళాల దూరంలో కూర్చుని కునికిపాట్లు

### జరిగిన కథ

వెట్టి అసలు పేరు విఠల్‌రెడ్డి. కారణాంతరాలవల్ల వెట్టిగా మారతాడు. తన పెత్తనాన్ని సవాలు చేసిన వెట్టిని అంతమొందించాలనుకుంటాడు బాజిరెడ్డి. వెట్టిని చౌడేశ్వరి ఆలయానికి వెళ్ళి రమ్మంటాడు శివారెడ్డి. ఆలయంలో పఠాన్‌తో పాటు బసవప్పను చూస్తాడు వెట్టి. సమయం చూసుకుని అందరినీ చావమోదుతాడు. పఠాన్ తప్పించుకుంటాడు. ఆలయంలో పిచ్చిపూజారి ద్వారా కొన్ని విషయాలు తెలుసుకుంటాడు. పఠాన్‌కి ప్రణవినిచ్చి పెళ్ళి చేయడానికి పిచ్చమ్మి ఒప్పుకుంటుంది. తాంబూలాలు పుచ్చుకుంటారు. గుడి దగ్గర తారసపడిన వ్యక్తిని రాయుడిపల్లిలో దించి, వారి ఇంట ఆతిథ్యం స్వీకరిస్తాడు వెట్టి. ఆ ఇంటి ఇల్లాలి తమ్ముడి ద్వారా ఒకప్పుడు బాజిరెడ్డికి సన్నిహితుడైన వ్యక్తిని కలుసుకుంటాడు. ఈలోపు బాజిరెడ్డికి వెట్టి రాయుడిపల్లిలోనే ఉన్న విషయం తెలిసి మనుషులను పంపిస్తాడు. పిచ్చమ్మికి పిచ్చి నయమయ్యే సూచనలు కనిపిస్తుండటంతో, అందరూ ఆశ్చర్యానికి గురవుతారు. తానే స్వయంగా డాక్టర్‌ను పిలిపించమని చెబుతుంది పిచ్చమ్మి.

ఆ తర్వాత...

# మరో ముప్పై ఏళ్ళు ఉంటుందట!

'గౌతమి పుత్ర శాతకర్ణి' ద్వారా మిగతా వాళ్ళు ఎంత లాభపడ్డారో తెలియదు కానీ, శ్రియాకి మాత్రం తెగ కలిసొచ్చేసింది. ఈ సినిమా విడుదలకిముందు దర్శక నిర్మాతలు శ్రియా గురించి పెద్దగా ఆలోచించేవారు కాదు, కానీ ఇప్పుడు ఆమె డేట్లకోసం ఇంటి ముందు పడిగాపులు పడుతున్నారట! కుర్ర హీరోయిన్లతో సమానంగా గ్లామరు, కళ్లతోనే భావాలు పలికించగల శ్రియ ప్రతిభ సినీజనాలకు బాగా తెలిసి వచ్చాయి. దాంతో అటు గ్లామర్, ఇటు నటనకు అవకాశం ఉన్న పాత్రలు శ్రియాను వెతుక్కుంటూ వస్తున్నాయట!

ప్రస్తుతం తనకు 34 సంవత్సరాలనీ, 65 సంవత్సరాల వరకూ నటిస్తానని చెబుతోంది. అంటే మరో మూడు దశాబ్దాల పాటు తెర మీద కనిపిస్తూనే ఉంటానని స్పష్టం చేస్తోంది. ప్రస్తుతానికి శ్రియాకు మంచి మంచి ఆఫర్లు వస్తున్నాయట! ఇదంతా క్రిష్, బాలకృష్ణ సార్‌ల చలవే అంటూ మురిసిపోతోంది శ్రియ.



పడుతున్నారు ఇద్దరు అనుచరులు. పడకగది గుమ్మం దగ్గర ఇంకో ఇద్దరున్నారు.

కిటికీలు లేని గది అది. ధాన్యాన్ని నిలువచేసే ధాన్యం కొట్టు మాదిరిగా ఉంది. ఫుల్లుగా మందు కొట్టినందువల్ల, తిరిగి తెల్లవారేవరకూ మెలకువ రాకూడదు లెక్కప్రకారం. అరగంటకి గంటకి ఒక సారి ఎవరో చెయ్యి పెట్టి భుజం తట్టినట్టు లేస్తాడు బాజిరెడ్డి. 'ఏరా?' అంటూ గదిలోపల ఉన్న అనుచరుల్ని పిలుస్తాడు.

'ఏమీ లేదు సారూ.... అంతా ప్రశాంతం' అంటారు వాళ్ళు.

వెంటనే కనులు మూసుకుని గురక మొదలు పెడతాడు అతను. ఆ రోజు మాత్రం మెల్లగా పిలవటంతో ఆగలేదు... 'వచ్చిందిరోయ్... వచ్చేసింది.. వచ్చేసింది... వచ్చేసింది' అంటూ మంచం మీదినుంచి దొర్లి దబ్బున కింద పడ్డాడు.

పక్కనే పెట్టుకున్న కర్రల్ని పట్టుకుని బర్రున పైకి లేచి, మంచం చుట్టూ మూడు రౌండ్లు కొట్టారు అనుచరులు. గుమ్మం దగ్గర ఉన్న వాళ్ళు కూడా ఎలర్ట్‌గా నిలుచున్నారు.

నడుములు విరిగిపోయేటంత దెబ్బ తగిలింది కాబోలు, చేతులతో నొక్కుకుంటూ లేచి నిలబడ్డాడు బాజిరెడ్డి. రెండు క్షణాలు అటూ ఇటూ చూసి 'కల వచ్చిందిరా. పడగవిప్పి గుండెలమీదికి ఎక్కినట్టు అనిపించింది' అంటూ తిరిగి మంచం మీద నడుము వాల్చాడు.

'నిబ్బరంగా నిద్రపోండి సారు. మేము కాపలా కాస్తూనే ఉన్నాం' తన చేతిలోని కర్రను కిందపెట్టి తను కూడా చతికిలపడుతూ చెప్పాడు ఒక అనుచరుడు. మంచానికి రెండో పక్కకు పోయి బైఠాయించాడు రెండవ అనుచరుడు.

●●●

'వద్దురా... ఆ మాటల్ని మీరు వినాలని అనుకోవద్దు. బోలెడంత భవిష్యత్తు ఉంది మీకు. చౌడేశ్వరి దృష్టిలో పడితే భయంకరంగా తయారైపోతుంది జీవితం. వద్దురా బిడ్డ. నన్ను బలవంతం చేయద్దు' ఫుల్లుగా మందు కొట్టాడు బండోడి తండ్రి. ముద్ద ముద్ద మాటలతో తన బిడ్డడి గడ్డం పట్టుకుని బ్రతిమిలాడాడు.

'నా కోసం కాదే నాయనా... ఈ అన్నయ్యకోసం! ఆ బాజిరెడ్డికి, ఈ అన్నయ్యకి పెద్ద విరోధం. నువ్వు ఏదో ఒకటి చెపితే తనకు ఉపయోగంగా ఉంటుంది అన్నాడు. తీసుకువచ్చాను' తండ్రి ముఖం మీద ప్రత్యక్షం అవుతున్న చెమట బిందువుల్ని తన తుండుగుడ్డతో అద్దుతూ మృదువుగా అన్నాడు బండోడు.

'చౌడేశ్వరి ప్రసాదం నల్లబడి పోవటాన్ని నువ్వు చూశావు. ఆ తల్లి శక్తి ఎటువంటిదో ఈపాటికి నీకు అర్థమై ఉండాలి' ఈసారి సరాసరి వెట్టికే చెప్పాడు ఆ వృద్ధుడు.

'ఆ తల్లి ఎటువంటిదో నాకు బాగా తెలుసు. ఆమె నన్నేదో చేసేస్తుందన్న భయం మీకు వద్దు. జరిగింది ఏమిటో మీరు చెప్పండి' అన్నాడు వెట్టి.

'అరేయ్..' అంటూ తన బిడ్డడి వైపు తిరిగాడు వృద్ధుడు. "నీ జతగాడిని తీసుకుని బయటికిపో. నేను పిలిచేంతవరకూ లోపలికి రాకు" అంటూ ఆదేశించాడు.

ఆశ్చర్యంగా చూస్తున్న యువకుణ్ణి చేయి పట్టుకుని పైకి లేపాడు బండోడు. 'నాయన చెప్పిన మాటకు తిరుగుండదు. పదరా' అంటూ బయటికి తీసుకుపోయాడు.

'ఆ తల్లి నీకు ఎన్నిసార్లు కనపడింది?' తన బిడ్డడు తమ మాటలు వినబడనంత దూరంగా వెళ్లిపోయాడని నిశ్చయం అవగానే, పక్కనే ఉన్న కుండలో నుంచి చిన్న మట్టిపాత్రతో నీటిని తీసుకుంటూ అడిగాడు వెట్టిని వృద్ధుడు.

'గుర్తులేదు కాని, చాలాసార్లు కనిపించింది. ఇపుడు కూడా ఈ చుట్టుపట్ల ఎక్కడో ఉండే ఉంటుందని నా నమ్మకం..' నిజాయితీగా చెప్పాడు వెట్టి.

రెండో పక్కన ఉన్న ఒక చెక్కపెట్టెలో నుంచి ఏదో చిన్న గుడ్డమూటను తీసి, అందులో ఉన్న భస్మాన్ని ముంతలో వేశాడు వృద్ధుడు. రెండు గుక్కల్లో నీటినంతా తాగి, ముంతను పక్కన పెట్టాడు.

'నేను చెప్పేమాటల్లో తనకు నచ్చనివి ఏవైనా ఉంటే, బాణం మాదిరి దూసుకువచ్చి నా అంతు చూడకుండా ముందు జాగ్రత్త కోసం-' నిశితంగా చూస్తున్న వెట్టికి చెప్పి, గొంతు సవరించుకున్నాడు.

'ఇపుడున్న పూజారి కంటే ముందు ఇంకో పెద్దయ్య ఉండేవాడు' అంటూ మొదలు పెట్టాడు.

'పిచ్చిపూజారి. గుడి వెనకాల ఇల్లు' అందించాడు వెట్టి.

తల ఊపాడు వృద్ధుడు. 'ఒక్కతే కూతురు. అందంలో అప్సరస. ఆ బిడ్డ మీద పడింది శివారెడ్డి తండ్రిగారి చూపు. పూజలు చేయించటానికి వచ్చి, ఆ పూజారికి తెలియకుండా ఆ బిడ్డకు ఎన్నెన్నో మాయ మాటలు చెప్పి తన వశం చేసుకున్నాడు. పూజారి ఆలయంలో నుంచి బయటికి రాకుండా గోపురం వెలుపల బాజిరెడ్డిని నిలబెట్టి తను ఆ బిడ్డతో సరసాలు ఆడేవాడు. ఆ బిడ్డకు నెల తప్పింది'.

'గుట్టురట్టు అవకుండా ఉండటం కోసం బాజిరెడ్డి మీ దగ్గరికి వచ్చి ఏదైనా మూలికను తీసుకుపోయి ఇచ్చాడా?' వెంటనే అడిగాడు వెట్టి.

ముఖం మీది నుంచి కళ్లల్లోకి జారుతున్న చెమటను అరిచేతులతో అద్దుకుంటూ తల ఊపాడు వృద్ధుడు. 'నా వైద్యం వికటించింది. గర్భంతో పాటు ఆ బిడ్డను కూడా బలి తీసుకుంది నేను ఇచ్చిన మూలిక' జీరపడిన కంఠంతో చెప్పాడు.

శ్రద్ధగా వింటున్న వెట్టికి విషయం అయితే తెలిసింది గాని, ఎందుకనో తృప్తి మాత్రం కలగలేదు.

'డబ్బు మదంతో అక్రమ సంబంధాలను పెట్టుకోవటం, పరిస్థితి విషమంగా మారినప్పుడు ఎవిడెన్సుల్ని తుడిచేయటం... ఇవన్నీ ఎక్కడో ఒకచోట ఎప్పుడూ జరుగుతూ ఉండే విషయాలే. పిచ్చిపూజారికి తెలియకుండా అతని కూతుర్ని వశపరచుకోవటం శివారెడ్డి తండ్రిగారు చేసిన తప్పే అయినా, ఆ మాటను అందరికీ చెప్పి అల్లరి చేయటానికి అంత గొప్పనేరం కాదు' తనలో తను అనుకున్నాడు అతను.

తన మానాన తను చెప్పుకుంటూ పోతున్నాడు వృద్ధుడు. 'కూతురు చనిపోవటంతో పూజారయ్యకి కొంచెం మతిస్థిమితం తప్పింది. తనబిడ్డ మరణానికి కారకుణ్ణి వట్టిగా వదిలేసిందన్న కోపంతో గుడిలోని తల్లిని ఉద్దేశించి దుర్భాషలాడాడు. అది తెలిసి గుడి

**శబ్దాన్ని సృష్టించాలంటే ఒక్క చెయ్యి చాలదు. రెండు చేతులు కలిసి తీరాలి. అలాగే తప్పు శివారెడ్డి తండ్రిగారిది మాత్రమే కాదు. కారణం ఇంకేదో ఉంది. చౌడేశ్వరికి ఇంకేదో పెద్ద అపచారమే జరిగింది. ఏమిటది? అని అడుగుతున్న వెట్టిని నోరు తెరుచుకుని చూస్తుండిపోయాడు ఆ వృద్ధుడు. ఆశ్చర్యపోయాడు. మరి ఆ కారణమేంటో వెట్టికి తెలియజేశాడా? చౌడేశ్వరికి జరిగిన అపచారమేమిటో వెట్టికి తెలిసిందా?**

ధర్మకర్తలు అతన్ని ఉద్యోగంలో నుంచి తీసేశారు. ఆ రాత్రే శివారెడ్డి తండ్రి పాము కాటుకు గురై ప్రాణాలు వదిలేశాడు.

'మీరు ఊరికే నిలబడి చోద్యం చూస్తున్నారా? మీరు వైద్యం చేయలేదా?' అడిగాడు వెట్టి.

"బాజిరెడ్డి గనుక వెంటనే నాకు కబురు పంపి ఉన్నట్లయితే, తప్పకుండా బతికించి ఉండేవాడిని. కాటుపడిన తర్వాత ఐదారు గంటలు గడిచినా కూడా విషపు ప్రభావాన్ని విరిచిపారేసే మూలికలు నా దగ్గర ఉన్నాయి. కాని బాజిరెడ్డి నాకు ఆ సంఘటన గురించి తెలియనీయలేదు. నేను తెలుసుకునే సమయానికి ఆ పెద్దమనిషికి అంత్యక్రియలు కూడా జరిగిపోయాయి".

'మీ ఇద్దరి మధ్య ఉన్న స్నేహసంబంధాలు చెడిపోవటానికి కారణం అదేనా?' అడిగాడు వెట్టి.

తల అడ్డం తిప్పాడు వృద్ధుడు.

'శివారెడ్డి తండ్రిగారు తనకు ప్రియాతిప్రియమైన పూజారి కూతుర్ని చెడగొట్టి ఆమె మరణానికి కారకుడు అయినందుకు శిక్షగా కాటువేసి చంపి ఉంటుందని నేను అనుకోవటం లేదు ఆ తల్లి' అన్నాడు వెట్టి.

నిర్వికారంగా చూస్తున్న వృద్ధుడి కనుల్లో వెంటనే ప్రత్యక్షం అయింది విపరీతమైన ఆశ్చర్యం. 'నువ్వు చాలా విచిత్రంగా మాట్లాడుతున్నావు. నీ అభిప్రాయం ఏమిటి?' అని అడిగాడు.

'చప్పట్లు కొట్టి శబ్దాన్ని సృష్టించాలంటే ఒక్క చెయ్యి చాలదు. రెండు చేతులు కలిసి తీరాలి. తప్పు శివారెడ్డి తండ్రిగారిది మాత్రమే కాదు. పవిత్రమైన వృత్తిలో ఉన్న తన తండ్రికి తెలియకుండా ఆయనతో జతకట్టిన ఆ బిడ్డది కూడా! కాబట్టి కేవలం తన పూజారి తనని దుర్భాషలాడాడన్న మాటను పట్టుకుని చౌడేశ్వరి, శివారెడ్డి తండ్రిగారిని కాటువేసి ఉండదు. కారణం ఇంకేదో ఉండే ఉంటుంది' అన్నాడు వెట్టి.

ఇంకా ఇంకా అధికం అయిపోయింది వృద్ధుడి ఆశ్చర్యం. చెమటలు పట్టటం కూడా అధికం అయిపోయింది.

'శివారెడ్డి తండ్రిగారు చేసిన పాడు పనులకు వంతపాడి వత్తాసుగా నిలిచి, ఆయన ఆస్తిపాస్తుల్ని దోచుకు తినటానికి బాగా అలవాటుపడ్డాడు బాజిరెడ్డి. శివారెడ్డి, తండ్రి చనిపోయిన తర్వాత ఎస్టేటు వ్యవహారాల్ని తన చేతిలోకి తీసుకున్నాడు. తను మారుటి తల్లి పెంపకంలో పెరగటం వల్ల, ముక్కుసూటితనం అబ్బింది శివారెడ్డికి. బాజిరెడ్డి ఆటలు కట్టుబడిపోయి ఉండాల్సింది. కాని అలా జరగలేదు. శివారెడ్డి అతనికి బానిసలాగా తయారైపోయాడు' అంటూ అడిగాడు వెట్టి.

'చెప్పు... చెప్పు అబ్బయ్య... ఇట్టాంటి మాటల్ని ఇంతవరకూ వినలేదు నేను' కుతూహలంగా ముందుకు వంగుతూ అన్నాడు వృద్ధుడు.

'పూజారి కూతురి వ్యవహారం మాత్రమే కాదు. చౌడేశ్వరికి ఇంకేదో అపచారం ఖచ్చితంగా జరిగింది. అదేమిటో బయటికి వస్తే శివారెడ్డి కుటుంబం నవ్వుల పాలై పోవటమే కాదు, నాశనం కూడా అయిపోతుంది. ఆ మాట అడ్డం పెట్టుకుని శివారెడ్డిని తన చెప్పుచేతల్లోకి తెచ్చుకున్నాడు బాజిరెడ్డి' అన్నాడు.

చలి జ్వరం వచ్చినట్టు వణకటం మొదలు పెట్టాయి వృద్ధుడి చేతులు. ఎంతో ప్రయత్నం మీద రెంటినీ కలిపి నమస్కారం చేయబోయాడు వెట్టికి.

'అయ్యయ్యో! నేను మీకు మీ బండోడి లాంటి వాడిని. ఆశీర్వదించాలి నన్ను. ఆయుఃక్షీణం జరిగే పనులు చేయకూడదు' చటుక్కున చేయి అడ్డం పెడుతూ అన్నాడు వెట్టి.

'జరిగింది ఏమిటో తెలుసుకుని, జరిగిన తప్పును ఎవరైనా సరిచేస్తారేమోనన్న ఆశ అడుగంటిపోతున్న సమయంలో నిన్ను ఆ చౌడేశ్వరే స్వయంగా ఇక్కడికి పంపి ఉంటుంది. ఆ తల్లి అదేపనిగా నీకు కనిపించటానికి కారణం నిన్ను సరైన దారిలో నడిపించటానికే' అన్నాడు వృద్ధుడు.

మొట్టమొదట పిచ్చమ్మ తనకు పరిచయం అయిన గ్రామంలో పాముల ప్రసక్తి వచ్చినప్పటి నుంచీ ఈ గ్రామంలో స్వయంగా కనిపించిన క్షణం వరకూ జరిగిన విశేషాలు గిర్రున తిరిగాయి సినిమారీళ్ళ మాదిరి వెట్టి కనుల ముందు.

అయితే వాటన్నిటినీ ఏకరువుపెట్టి అతని అభిప్రాయాలను అడిగే వ్యవధి తనకు లేదని తెలిసి ఉండటం వల్ల ఆ మాటల్ని పొడిగించలేదు. 'అవతల బాజిరెడ్డి జనం నా కోసం మూడొంతుల దూరం వచ్చేసి ఉంటారు. జరిగింది ఏమిటో తెలిస్తే నేను క్షేమంగా సైడైపోవచ్చు' అన్నాడు.

'చౌడేశ్వరి గుడికి సంబంధించి ఆ పూజారికి, పూజారి ద్వారా అతని కూతురికి తప్ప ధర్మకర్తలకు కూడా తెలియని విశేషం ఒకటి ఉంది. పూజారి కూతురితో సంబంధం పెట్టుకోవడం వల్ల శివారెడ్డి తండ్రిగారికి తెలిసింది అది. ఆయన ద్వారా బాజిరెడ్డికి, అతని మూలకంగా నాకు తెలిసింది' చెప్పటం మొదలుపెట్టాడు వృద్ధుడు.

●●●

'తొక్కరా... ఇంకా తొక్కు... ఎడ్లబండి మీద వెళ్లినట్టుంది. ఆడు అక్కడినించి మాయం అయిపోయాడంటే బాజిరెడ్డిసారు మన పీకలు కోసి నెత్తురు తాగుతాడు' డ్రైవర్ పక్కనే కూర్చుని గట్టిగా చెప్పాడు బాజిరెడ్డి కారును నడిపే డ్రైవర్.

'అన్నా, ఇది బెంజికారు కాదు. ఇవ్వాళో రేపో షెడ్డుకు పోవాల్సిన లారీ. ఇంతకు మించి నడవదు. నడపాలని చూస్తే ఇంజను ఊడి రోడ్డుమీద పడిపోతుంది' అన్నాడు నడుపుతున్న మనిషి.

'నువ్వు ఒక చేతకాని సన్నాసివి. పక్కకు తప్పుకో. నడపటం అంటే ఏమిటో నేను చూపిస్తా' అంటూ నేర్పుగా అతన్ని లాగి తను స్టీరింగ్ ముందుకు చేరుకున్నాడు డ్రైవర్.

వెంటనే పెరిగింది స్పీడు. రోడ్డుమీది గోతుల్లో ఎగిరెగిరిపడుతూ రాకెట్ మాదిరి నడవటం మొదలు పెట్టింది ఆ లారీ.

'అన్నా.. గుడి దగ్గరికి వస్తున్నాం' ఉన్నట్లుండి లారీ బాడీలో నిలబడి ఉన్న ఒక మనిషి ముందుకు వంగి విండోలో నుంచి బిగ్గరగా అరిచాడు.

'నాకు కళ్ళున్నాయిరా. కనిపిస్తూనే ఉంది. మనం

## ఒక్కో ట్వీటుకు ఆరు లక్షలు

**సంపా**దనలో కొద్దిగా తెలివిగా వ్యవహరిస్తే డబ్బు వరదలా వచ్చిపడుతుంది అనడానికి ప్రియాంకా చోప్రానే ప్రత్యక్ష నిదర్శనం అంటున్నారు బాలీవుడ్ జనాలు. ప్రియాంక హాలీవుడ్‌కి వెళ్ళిన తరువాత ట్విట్టర్లో ఆమె ఫాలోయర్ల సంఖ్య నాలుగు కోట్లకు చేరుకుంది. ట్విట్టర్‌లో వచ్చిన ఈ పాపులారిటీని క్యాష్ చేసుకుంటోందట! ప్రియాంక ఒక్క ట్వీట్ చేయాలంటే అక్షరాలా ఆరు లక్షలు ఆమెకు సమర్పించుకోవాల్సిందేట! ఆ సమాచారం కచ్చితంగా నాలుగు కోట్లు అంతకు పైగా చూస్తారు కనుక తమకు కచ్చితంగా లాభం ఉంటుందని కొందరు భావిస్తున్నారట! దాంతో ప్రియాంక అడిగిన ఆరు లక్షలు ఆనందంగా సమర్పించుకుంటున్నారట! కాకపోతే మిగతా హీరోయిన్లు కూడా ట్వీటుకు ఇంత అని తీసుకుంటున్నా, ప్రియాంకే బాగా కాస్లీ అంటున్నారు.



వస్తున్నది ఇక్కడికి కాదు' అంటూ యాక్సిలేటర్‌ని ఇంకాస్త గట్టిగా అదమబోయి, అదిరిపడ్డాడు డ్రైవర్.

హెడ్‌లైట్ల వెలుగులో అతి స్పష్టంగా కనిపిస్తున్నాడు పిచ్చిపూజారి, రోడ్డు మధ్యలో కొండరాయిలా నిలబడి.

'గుద్దించేయ్. పీడ విరగడైపోతుంది. అడిగేవాడు ఎవడూ లేడు' కచ్చగా అన్నాడు డ్రైవర్ పక్కనే ఉన్న మనిషి.

అదే పని చేయటానికి నిశ్చయించుకుని పళ్లు బిగపట్టి, స్టీరింగ్ ఇంకాస్త గట్టిగా పట్టుకున్నాడు డ్రైవర్.

దగ్గరికి... ఇంకా దగ్గరికి దూసుకు వచ్చేస్తున్న ఆ వెహికల్‌ని చూసి, కొంచెంగా కూడా బెదరలేదు పిచ్చిపూజారి. ఉన్నట్లుండి కిందికి వంగాడు.

అతని పాదాల దగ్గరే ఉన్నది పెద్ద కొండరాయి. రెండు చేతులతోను దాన్ని పట్టుకుని పైపైకి ఎత్తాడు.

'ఈ స్పీడుతో వాణ్ణి డీకొడితే ఎగిరి అవతలపడి గుటుక్కుమంటాడు. ఆ రాయి వచ్చి మనకి తగిలితే మనం కూడా పోయి రోడ్డుపక్కన పడతాం' వెంటనే అన్నాడు డ్రైవర్ పక్కన ఉన్న మనిషి. 'అది నీకే వచ్చి తగులుతుంది గారెంట్రీ..' అని కూడా అన్నాడు.

నోటికి వచ్చిన తిట్లన్నిటినీ తిడుతూ యాక్సిలేటర్ మీంచి పాదాన్ని బ్రేకుల మీద వేసేశాడు డ్రైవర్.

కీచుధ్వనులు చేస్తూపోయి, పూజారికి పది అడుగుల దూరంలో ఆగింది లారీ. 'దిగండిరా.. మెడ పట్టుకుని పక్కకి నెట్టండి' కరకరమంటున్న కంఠంతో అరిచాడు డ్రైవర్.

బాడీలో నిలబడి ఉన్న జనంలో నుంచి పదిమంది గబుక్కున కిందికి దూకారు. 'రాకండి.. దగ్గరికి రాకండి.. వచ్చారంటే శిరస్సులు పగిలిపోతాయ్' పైకెత్తిన రాయిని ముందుకీ వెనక్కీ ఊపుతూ హెచ్చరించాడు పిచ్చిపూజారి.

'అయ్యా.. అర్ధరాత్రి... రోడ్డుకి అడ్డంగా ఏమిటి ఈ గోల? తప్పుకదా... వెళ్ళిపోండయ్యా. మీకు నమస్కారం' అరిచి కేకలుపెడితే రాయి వచ్చి గుండెల మీద పడుతుందన్న అనుమానంతో మర్యాదగా అన్నాడు ఒక మనిషి.

'బాజిరెడ్డి వట్టి చప్పిమొఖం వాడు.. సన్నాసి.. చేతకాని చవట... నమ్మకద్రోహి... వాడికి రోజులు మూడినయ్' అన్నాడు పిచ్చిపూజారి.

'అయ్యా... మేము వేరు. మాకు, మీరు చెబుతున్న బాజిరెడ్డి సారుకు ఎటువంటి సంబంధం లేదు. మా దారిన మమ్మల్ని పోనీయండి' మరోసారి మర్యాదగా అన్నాడు ఆ మనిషి.

'నాకు తెలుసు. ఎవరు ఎవరో ఎటువంటివాళ్ళో అన్నీ తెలుసు. తెలుసు కాబట్టే చెప్పటం కోసం వచ్చాను. మీ బాజిరెడ్డికి నూకలు చెల్లిపోయినయ్..' అన్నాడు పూజారి.

'అలాగేనయ్యా... మీరు చెప్పినట్టు మేము ఆ సారుకు చెపుతాం. ముందు మీరు పక్కకు జరిగి దారి ఇవ్వండి' అన్నాడు ఆ మనిషి.

'ఏంటిరా ఆ బతిమాలుడు? ఏసేయ్ మెడమీద.. లాగేయ్ పక్కకి' అని బిగ్గరగా అరవబోతున్న డ్రైవర్ భుజం మీద చెయ్యివేసి బలంగా అదిమాడు పక్కనే ఉన్న మనిషి.

'నీ గోల ఏంటిరా?' అతని కేసి తిరిగి గంయ్‌మని అరిచాడు డ్రైవర్.

'చూడన్నా... గుడి వైపు చూడు' హెచ్చరించాడు ఆ మనిషి.

అటుకేసి తల తిప్పిన డ్రైవర్‌కి, పెద్దపెద్ద అడుగులు వేస్తూ వస్తున్న పదిమంది కొత్త మనుషులు కనిపించారు.

'అన్నా, ఈళ్ళెవరో మనకి తెలిసినవాళ్ళు కాదు. మొఖాలు కొత్తగా ఉన్నాయ్..' చిన్నగా అన్నాడు పక్కన ఉన్న మనిషి.

పెద్దపెద్ద అడుగులు వేస్తూ వస్తున్న ఆ మనుషుల్ని చూడగానే తను ఎత్తి పట్టుకుని ఉన్న కొండ రాయిని అవతలకు విసిరేశాడు పిచ్చిపూజారి.

'నా తల్లి నాకు చెప్పిందిరా.. ఇక్కడినించీ మీకు భజన కార్యక్రమం మొదలు' పెద్దగా నవ్వాడు.




'స్వామీ... బాజిరెడ్డి మనుషులేనా వాళ్ళు' అదో రకమైన యాసతో అడిగాడు గుడి దగ్గర్నించి వచ్చిన వాళ్ళల్లో ఒకతను.

'అవును. అందరూ ఆ చవట సన్నాసి జనమే!' అన్నాడు పూజారి.

'ఈ చిమ్మచీకటిలో ఎలా తెలిసింది మీకు?' ఆశ్చర్యంగా అడిగాడు అతను.

'పొద్దుటి నుంచీ ఇదే పనిమీద ఉన్నాను. ఎవరో ఒకరు వస్తారని తెలుసు. వచ్చారు. మీ పని మీరు చూసుకోండి' అంటూ ఉన్నట్లుండి గుడి దగ్గరికి తీసుకుపోయే కంకర రోడ్డు మీదికి పరుగు తీశాడు పిచ్చిపూజారి.

లారీని గేర్లు మార్చబోయాడు డ్రైవర్. వెంటనే అంతవరకూ పూజారి నిలబడి ఉన్న స్థానంలో తను నిలుచున్నాడు, కొత్తగా వచ్చిన వాళ్ళల్లో మనిషి.

'మా బసవప్పని ఏదో పనిమీద పిలిపించారు. తను ఏమైపోయాడో తెలియటం లేదు. ఎక్కడ ఉన్నాడు?' లారీ విండో దగ్గరికివచ్చి డ్రైవర్‌ని అడిగాడు ఇంకో మనిషి.

లావుపాటి గులకరాయి ఏదో గొంతుకు అడ్డం పడినట్లు అయింది డ్రైవర్‌కి. 'మేము అర్జంటు పని మీద పోతున్నాం. పని పూర్తి అయిన తర్వాత మళ్ళీ ఇటుగానే వస్తాం. అప్పుడు మాట్లాడుకుందాము' అంటూ మరోసారి గేరు మార్చబోయాడు.

కంటికి కనిపించనంత వేగంతో కదిలింది ఆ మనిషిచేయి. ఛట్‌మని తెరుచుకుంది డోరు... ముళ్ళ కంప మాదిరి రోడ్డు మీద పడిపోయాడు డ్రైవర్.

అది చూసేసరికి ఆవేశం హద్దులు దాటిపోయింది రోడ్డు మీద ఉన్న బాజిరెడ్డి జనానికి. 'కొట్టండి... కొట్టండి' అని కేకలు పెడుతూ తమ మనిషిని కిందికి లాగిన శాల్తీ మీదికి ఎగబడ్డారు.

లారీ బాడీలో నిలబడి చూస్తున్న వాళ్ళకి కూడా అంటుకుంది ఆ ఆవేశం. తోడేళ్ళ మాదిరి ఒకేసారి కిందికి దూకారు అందరూ.

ఒక్కక్షణం ముందువరకూ ఎంతో ప్రశాంతంగా ఉన్న అక్కడి వాతావరణం ఒక్కసారిగా అరుపులతో, కేకలతో మార్మోగిపోవటం మొదలయింది.

నలభై మందికి పైగా ఉన్నారు బాజిరెడ్డి జనం. పదంటే పదిమంది మాత్రమే ఉన్నారు కొత్తగా వచ్చిన వాళ్ళు. పదే పది క్షణాల్లో తలలు పగిలి, కాళ్ళు చేతులు విరిగి కిందపడి గిలగిలా కొట్టుకుంటూ ఉండాలి- ఒంటికి అంటుకున్న దుమ్ము దులుపుకుంటూ పైకిలేచిన డ్రైవర్ లెక్క ప్రకారం.

తలకిందులు అయిపోయింది అతని అంచనా. లారీలో నుంచి దూకిన జనాన్ని చూడగానే తమ దుస్తుల్లో నుంచి నిగనిగలాడుతున్న రివాల్వర్లు తీసి గాలిలోకి పేల్చారు నలుగురు కొత్తవాళ్ళు.

గుండెలు జలదరించిపోయాయి బాజిరెడ్డి జనానికి. ధైర్యం దిగజారి పోయింది. ఎవరికి వారుగా గిరుక్కున పక్కకు తిరిగి, రోడ్డు పక్కన ఉన్న చెట్లలోకి, పొదల్లోకి పారిపోయారు.

అందరితోపాటు తను కూడా అదే పని చేయబోయిన డ్రైవర్‌కి మాత్రం లభించలేదు, ఆ అవకాశం. అతని షర్టును బిగించి పట్టుకుని లారీ బోనెట్ కేసి నెట్టాడు ఒక మనిషి.

'మా బసవప్ప ఎక్కడ ఉన్నాడు?' అడిగాడు.

వణుకుతున్న కంఠాన్ని ఎంతో ప్రయత్నం మీద అదుపులోకి తెచ్చుకుని, హాస్పిటల్ పేరు చెప్పాడు డ్రైవర్. బసవప్ప అందులోకి చేర్చబడిన కారణాన్ని కూడా చాలా కలర్‌ఫుల్‌గా వర్ణించి చెప్పేవాడే... కానీ,

'లారీని వెనక్కి తిప్పి నడిపించు.. మేము ఫాలో అవుతాం' అంటూ కంకరరోడ్డు మీదికిపోయి, దూరంగా రోడ్డు మీదికి కనిపించకుండా నిలబెట్టి ఉంచిన తమ జీప్ కారును తీసుకువచ్చాడు ఒకతను.

'బసవప్పకి అటువంటి గతి పట్టించిన వాడి అంతు చూడటానికే మేము బయలుదేరాం. ముందు ఆ పని పూర్తిచేసి...' అంటూ వారి అటెన్షన్‌ని తమ పని మీదికి డైవర్ట్ చేయటానికి ప్రయత్నించాడు డ్రైవర్.

'ముందు మా బసవప్ప.. తర్వాత నీ పని.. తిప్పు లారీని' అంటూ అతన్ని స్టీరింగ్ ముందుకు నెట్టి, తాము కూడా క్యాబిన్‌లో సెటిల్ అయ్యారు ఇద్దరు.

'ఫోను.... ఒక్క ఫోను చేసుకుని..' అంటూ తన ఫోన్‌ని బయటికి తీశాడు డ్రైవర్. ఉన్నట్లుండి విచిత్రంగా మారిపోయిన సిచ్యుయేషన్ గురించి బాజిరెడ్డి సారుకు రిపోర్ట్ చేసి హెచ్చరించాలని అతని ఉద్దేశం.

మరోసారి కంటికి కనిపించనంత వేగంగా కదిలింది అంతకుముందు అతన్ని కిందికి లాగిన మనిషి చేయి.

గింగిరాలు తిరుగుతూ పోయి రోడ్డు మీద పడి ముక్కలు ముక్కలై ఎందుకూ పనికి రాకుండా పోయింది ఫోను.

రెండోమాట లేకుండా లారీ వెనక్కితిప్పి వచ్చిన దారినే సిటీవైపు నడిపించాడు డ్రైవర్.

**(ఇంకావుంది)**




## డా॥ జి. సతీష్ రెడ్డి
MS. M.Ch. (Ortho) (UK)
Orthopedics & Joint Replacement Specialist
ప్రైమ్ హాస్పిటల్స్, హైదరాబాద్
ఫోన్. 84999 91829 / 040-4959 4959


# అవగాహనతోనే ఆస్టియోపొరోసిస్ దూరం
## చిన్నప్పటి నుంచే జాగ్రత్తలు అవసరం

మన శరీరానికి ఆకృతి ఇచ్చేవి ఎముకలు. ఎముకల సముదాయంతో అస్థిపంజరం మనకో రూపాన్ని ఇస్తుంది. ఆరోగ్యవంతమైన ఎముకలను కాపాడుకోవడం చాలా అవసరం. లేదంటే ఆస్టియోపొరోసిస్ బారిన పడే అవకాశం ఉంటుంది. ఎముకల ఆరోగ్యంపై అవగాహన పెంపొందించుకుని సమతులాహారంతో కూడిన ఆహారపు అలవాట్లతోపాటు క్రమం తప్పకుండా వ్యాయామాలు చేస్తూ చిన్నప్పటి నుంచే జాగ్రత్తలు పాటిస్తే ఈ వ్యాధి బారినపడకుండా జాగ్రత్తపడొచ్చు.

### ఆస్టియోపొరోసిస్ అంటే :

ఆస్టియోపొరోసిస్ అనేది ఎముకలకు సంబంధించిన సమస్య. ఈ సమస్యవల్ల ఎముక కణజాలానికి నష్టం జరగడం వల్ల ఎముకలు గుళ్ళబారి పెళుసుగా తయారై సులభంగా విరిగిపోతుంటాయి. ముఖ్యంగా ఈ వ్యాధి వయసు పెరిగిన వారిలో ఎక్కువగా వస్తుంటుంది. ఇది సైలెంట్ కిల్లర్ వంటిది. ఎందుకంటే ఎముకలు విరిగేంతవరకు ఈ సమస్య ఉన్నట్లు తెలియదు.

### ఎలా వస్తుంది...?

ఎముకలలో కాల్షియం తగ్గితే అవి బలహీనపడి పెళుసుగా మారతాయి. ప్రతి ఒక్కరికి 45 ఏళ్ల వయసు వచ్చే వరకు ఎముకలు ఒక బ్యాంకులాగా అవసరమైన కాల్షియం సమకూర్చుకుంటాయి. ఈ వయసు తర్వాత శరీరంలో కొన్ని హార్మోన్ల ఉత్పత్తి నిలిచిపోయి, కాల్షియం తీసుకోవడం తగ్గిపోతుంది. దాంతోపాటు ఆ వయసు పైబడిన తర్వాత శరీరం కొద్ది కొద్దిగా ఎముకల నుంచి కాల్షియంను తీసివేస్తూ ఉంటుంది. పురుషులలో అయితే యుక్త వయస్సు దాటిన తరువాత ఏడాదికి ఒక శాతం కాల్షియం

OSTEOPOROSIS







పోతుంది. అదే మహిళలో అయితే మోనోపాజ్ తరువాత 2-3 ఏళ్ల వరకు 4-5 శాతం, ఆ తర్వాత 2-3 శాతం కాల్షియం పోతుంది. కాబట్టి 45 ఏళ్ల వయసు వచ్చే వరకు కాల్షియం అధికంగా ఉండే ఆహారం తీసుకోవడం ద్వారా ఎముకల పటుత్వానికి అవసరమైన కాల్షియం సమకూర్చుకోవడం చాలా అవసరం. శరీరంలోకి కాల్షియంను గ్రహించడానికి విటమిన్ డి అవసరమవుతుంది. శరీరానికి అవసరమైన విటమిన్ డి లభించడం వల్ల కాల్షియం పెరుగుతుంది.







### కారణాలు :

- వయసు పైబడడం
- రుమటాయిడ్ ఆర్థరైటిస్
- మెనోపాజ్ దశకు చేరుకోవడం
- ధూమపానం
- సరైన ఆహారం తీసుకోకపోవడం
- జన్యుపరమైన కారణాలు

### వీరు మరింత జాగ్రత్తగా ఉండాలి :

- జీర్ణకోశ వ్యాధులతో బాధపడేవారు
- ఎక్కువగా స్టెరాయిడ్స్ వాడేవారు
- స్త్రీలలో రుతుస్రావం సమస్యలు ఉన్నవారు
- సరైన వ్యాయామం లేకుండా కుర్చీలకే పరిమితమయ్యేవారు

### జాగ్రత్తలు తప్పనిసరి :

మనం ఆరోగ్యంగా ఉండేందుకు శరీరానికి పోషకాహారం ఎలా అవసరమో... అలాగే ఎముకల ఆరోగ్యానికి కాల్షియం అవసరం. 9-18 ఏళ్ళ వయసు గల వారికి రోజుకు 1000 మిల్లీగ్రామ్ కాల్షియం కావాలి. సమతులాహారం తీసుకోకపోతే అవసరమైన కాల్షియం లభించదు. కాబట్టి చిన్నప్పటి నుంచే సమతులాహారం తీసుకుంటూ క్రమం తప్పకుండా వ్యాయామం చేయడం, ఆటలు ఆడడం వల్ల చాలా వరకు ఆస్టియోపొరోసిస్ బారిన పడకుండా జాగ్రత్త పడొచ్చు. ఎముకల ఆరోగ్యానికి కాల్షియం, విటమిన్ డి చాలా అవసరం. కాబట్టి కాల్షియం అధికంగా ఉండే ఆహారాన్ని ఎక్కువగా తీసుకోవాలి. పిల్లలకు విటమిన్ డి లభించే ఫోర్టిఫైడ్ పాలు ఇవ్వాలి. దాంతో పాటు బాస్కెట్ బాల్, వాలీబాల్, స్కిప్పింగ్ వంటి ఆటలతో పాటు జాగింగ్, సైక్లింగ్ వంటి వ్యాయామాలు ఎముకల ఆరోగ్యానికి దోహదపడతాయి.




**బృహదశ్వుడు తపోవనానికి తరలిపోనున్న సమయంలో అతన్ని సమీపించాడు ఉదంకుడు. దానవుడు ధుంధువు గురించి చెప్పాడతనికి. వాణ్ణి సంహరించమని వేడుకున్నాడు. ధుంధువుని వధించేందుకు ప్రయత్నించినవారికి తన తేజశ్శక్తులను ప్రసాదించగలనని నారాయణదేవుడు చెప్పాడనీ, అలాగే బృహదశ్వుడు తప్ప వేరెవరూ ఆ రాక్షసుణ్ణి సంహరించలేరనీ నొక్కి మరీ చెప్పాడు ఉదంకుడు. ఆ మాటలకు ఆలోచనలో పడ్డాడు బృహదశ్వుడు. కళ్ళు మూసుకున్నాడు. కాసేపటికి కళ్ళు తెరచి చెప్పాడిలా.**

మహర్షీ! శస్త్రసన్యాసం చేసి, తపస్సు ఆచరించాలని నిశ్చయించుకున్నాను. తిరిగి శస్త్రాలను పట్టలేను. మీరు అంగీకరిస్తే ఆ దానవుణ్ణి వధించేందుకు గట్టి ఏర్పాటైతే చేయగలను అన్నాడు బృహదశ్వుడు.

ధన్యుణ్ణి అన్నాడు ఉదంకుడు. ధుంధువుని సంహరించమని కుమారులసహా కువలయాశ్వునికి ఆజ్ఞాపించి, తపోవనానికి వెళ్ళిపోయాడు బృహదశ్వుడు. ఉదంకుడు, కుమారులుసహా కువలయాశ్వుడు ధుంధువుగల ప్రదేశానికి చేరుకున్నాడు. అతన్ని చూసి దేవతలు ఆశీర్వదించారిలా.

ధుంధువును సంహరించి, 'ధుంధుమారుడు' అన్న పేరిట నీవు ప్రఖ్యాతి చెందుదువుగాక!

పుష్పవృష్టి కురిసిందప్పుడు. అది చూసి మునీంద్రులంతా ఆనందించారు. అన్నట్టుగానే తన తేజోరాశిని కువలయాశ్వునిలోనికి ప్రవేశింపజేశాడు నారాయణదేవుడు. దాంతో అతనిలో ధైర్యోత్సాహాలు పెచ్చరిల్లాయి. అప్పుడు కుమారులను ఆదేశించాడిలా.

ఆ ఇసుక తిన్నెను లోతుగా తవ్వండి! బిలంలో నిద్రిస్తున్న ధుంధువు భయపడాలి.

అలాగే తవ్వారు కుమారులు. ధుంధువుకి అలజడినీ, ఆందోళననూ కలిగించారు. దాంతో ధుంధువు ముక్కునుండీ, కళ్ళనుండీ, నోటి నుండీ భీకరాగ్ని జ్వాలలు వెలువడ్డాయి. ఆ జ్వాలలకు ముగ్గురు మినహా మిగిలిన కువలయాశ్వుని కుమారులంతా మాడి మసి అయినారు. అగ్నిజ్వాలలు కువలయాశ్వుణ్ణి కూడా చుట్టుముట్టాయి. అందుకు ఆందోళన చెందలేదతను. యోగశక్తితో జలరాశిని సృష్టించి, ఆ జ్వాలలను చల్లార్చాడు. వెంటనే బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. తిరుగులేని ఆ అస్త్రం ధుంధువుణ్ణి సంహరించింది. అది చూసి ఉదంకుడు ఊపిరి పీల్చుకున్నాడు. రాజును అభినందించాడు. ఆశీర్వదించాడిలా.

ఇక మీదట నీ సామ్రాజ్యం ఇంతకింతా విస్తరిస్తుంది. నిన్ను గెలవడం అసాధ్యమవుతుంది. పుణ్యకార్యాలు చేస్తావు. ఫలితంగా స్వర్గలోకప్రాప్తి కలుగుతుంది.

అంతటితో ఊరుకోలేదు ఉదంకుడు. మరణించిన కువలయాశ్వుని కుమారులందరికీ శాశ్వత స్వర్గసౌఖ్యాన్ని ప్రసాదించాడు.

తర్వాతికాలంలో మిగిలిన కువలయాశ్వుని ముగ్గురు కుమారులలో పెద్దవాడు రాజయ్యాడు. అతనికి హర్యశ్వుడు, ఆ హర్యశ్వునికి కుంభుడు, ఆ కుంభునికి సంహితాశ్వుడు జన్మించారు. సంహితాశ్వునికి అకృతాశ్వుడు, కృతాశ్వుడు అని ఇద్దరు కుమారులు జన్మించారు. అకృతాశ్వునికి ప్రసేనజిత్తు, అతనికి యువనాశ్వుడు, ఆ యువనాశ్వునికి మాంధాత జన్మించారు.

## త్రిశంకుడు: సగరుడు

**కువలయాశ్వుని వంశజుడే సత్యవ్రతుడు. వసిష్ఠమహర్షి శాపంవల్ల త్రిశంకుడయ్యాడు. త్రిశంకునికి సశరీర స్వర్గలోకప్రాప్తి కలిగించాడు విశ్వామిత్రుడు. త్రిశంకుని కుమారుడే హరిశ్చంద్రుడు. అతని ముని ముని మనుమడే సగర చక్రవర్తి. ఈతడికి మహావీరులైన అరవైవేలమంది కుమారులు జన్మించారు. వారి అండదండలతో సగర చక్రవర్తి ఎలాంటి గొప్పకార్యం తలపెట్టాడు? మహావీరులైన సగరకుమారులు ఏం చేశారు?**

శశిబిందువు అన్న రాజుకి పదికోట్లమంది కొడుకులు పుట్టారు. వారందరికన్నా ముందు బిందుమతి పుట్టింది. ఈ బిందుమతే మాంధాతచక్రవర్తి పట్టపురాణి అయింది. మాంధాత మహాపరాక్రమశాలి. మహాతేజశ్శాలి. అఖండధరణీ సామ్రాజ్యాన్ని పాలించిన పరాక్రమఖని. అతనికి పురుకుత్సుడు, ముచికుందుడు అని ఇద్దరు కుమారులు. పురుకుత్సుడు నర్మదానదిని వివాహం చేసుకున్నాడు. వారికి త్రిశదశ్వుడు జన్మించాడు. అతనికి సంభూతుడు పుట్టాడు. ఈ సంభూతుని కొడుకే సుధన్వుడు. అతనికి సూర్యారుణుడు జన్మించాడు. ఉత్తరకోసలాలకు రాజై ఈ సూర్యారుణుడే జగజ్జేగీమాన కీర్తి సాధించాడు.

సూర్యారుణునికి సత్యవ్రతుడు పుట్టాడు. అతను వివాహితుడైనా, రాజ్యంలోని ఓ పౌరుని భార్యను బలాత్కారంగా సొంతం చేసుకున్నాడు. ఈ సంగతి తెలిసి సూర్యారుణుడు ఆగ్రహావేశాలు చెందాడు. సత్యవ్రతుణ్ణి వెంటనే నగరం వదలిపోవాల్సిందిగా ఆజ్ఞాపించాడు.

ఎక్కడికి పోను తండ్రీ? ఎవరు నాకు దిక్కు? అడిగాడు సత్యవ్రతుడు.

నువ్వెంత దీనంగా వేడుకున్నా నువ్వు నా కొడుకువి అన్న ప్రేమ నాకేమాత్రం కలగడం లేదు. పో ఇక్కణ్ణుంచి. కొడుకుల్ని చంపి తినే వాళ్ళలో కలిసిపో అని ఆజ్ఞాపించాడు సూర్యారుణుడు. దాంతో సత్యవ్రతుడు నగరం విడిచిపెట్టి వెళ్ళిపోయాడు. కొడుకును బహిష్కరించి బతకలేకపోయాడు సూర్యారుణుడు. ఆ బాధతో రాజ్యాన్ని విడిచిపెట్టి, అడవిని ఆశ్రయించాడతను. అక్కడే జీవించసాగాడు. రాజు లేకపోవడంతో రాజ్యం అస్తవ్యస్తమయింది. అధర్మం ప్రబలింది. కరువు తాండవించింది. పన్నెండేళ్లపాటు అదే స్థితి కొనసాగింది. అయినా అటు అంతఃపురానికిగానీ, ఇటు జనానీకానికిగానీ ఎలాంటి ఇబ్బందులూ లేకుండా వసిష్ఠుడు అందరినీ కాపాడుతూ వచ్చాడు. రాజ్యపాలన చేశాడు.

ఇది ఇలా జరగడానికి ముందు తన కుటుంబాన్ని సూర్యారుణరాజ్యంలో ఓ అరణ్యంలో విడచిపెట్టి, విశ్వామిత్రుడు సాగరతీరంలో తీవ్ర తపస్సు ఆచరించసాగాడు. ముగ్గురు పుత్రులసహా కుటుంబాన్ని పోషించుకోలేని అతని పత్ని తప్పనిసరి పరిస్థితుల్లో తన ముగ్గురు కుమారులలో నడిమివాడి మెడను తాటితో బంధించి అమ్మజూపింది.

పెద్దలారా! మీలో ఎవరైనా ఈ పసివాణ్ణి నూరు గోవులు ఇచ్చి కొనుక్కోండి అన్నది.

సత్యవ్రతుడు ఆ తల్లి దీనాలాపనకు తల్లడిల్లిపోయాడు. ఆమెను సమీపించి అన్నాడిలా.

తల్లీ! నీ కుటుంబానికి ఇక మీదట ఎలాంటి కొదవా రానివ్వను. నిన్నూ, నీ కుటుంబాన్నీ నేను పోషిస్తాను. దయచేసి ఈ అమ్మకాన్ని ఆపుజెయ్యి.

సత్యవ్రతుని మాట మీద పిల్లాడి మెడలోని తాడు తొలగించిందామె. నాటి నుండే ఆ పిల్లాడు 'గాలవుడు'గా ప్రసిద్ధుడయ్యాడు. ఇచ్చిన మాట ప్రకారం పన్నెండు సంవత్సరాలపాటు సత్యవ్రతుడు విశ్వామిత్రుని కుంటుంబాన్ని పోషిస్తూ వచ్చాడు. అడవిలో దొరికిన అడవిపందులూ, లేళ్లూ మొదలైన వాటిని సంహరించి తెచ్చి ఇచ్చి మరీ వారి ఆకలి తీర్చాడు.

తండ్రి తనను నగరం నుంచి బహిష్కరించినప్పుడు అతన్ని వారించలేదని వసిష్ఠునిపై విపరీతంగా కోపం పెంచుకున్నాడు సత్యవ్రతుడు. అది ఎప్పటికప్పుడు ప్రజ్వరిల్లుతూనే ఉన్నది. ఒకరోజు అడవిలో ఆహారాన్వేషణ సాగిస్తున్నప్పుడు సత్యవ్రతునికి పిట్టా పురుగూ ఏదీ కనిపించలేదు. ఆకలి దహించి వేస్తున్నది. ఏం చెయ్యాలో పాలుపోనిస్థితి. అప్పుడు అతనికి కొద్దిదూరంలో వసిష్ఠుని హోమధేనువు కనిపించింది. కనిపించడమే ఆలస్యం దానిని సంహరించి ఆహారంగా స్వీక

రించాడు.

కాసేపటికి ఆ సంగతి వసిష్ఠునికి తెలిసింది. అతను ఆగ్రహోదగ్రుడయ్యాడు. సత్యవ్రతుణ్ణి శపించాడిలా.

దుర్మార్గుడా! నీ ప్రవర్తనతో నీ తండ్రిని నొప్పించావు. అది చాలదన్నట్టుగా గురువు గోవుని సంహరించావు. సంహరించి, దాని రక్తమాంసాలను కిరాతకునిలా పచ్చిగా భక్షించావు. ఇలా మూడు మహాదోషాలకు పాల్పడ్డావు. కాబట్టి నేటి నుండి నిన్ను అంతా 'త్రిశంకుడు' అని వ్యవహరిస్తారు. నీకు ఇంతకంటే గొప్పశిక్ష లేదు. పో! నా నుంచి దూరంగా పో!

అలా వసిష్ఠుని శాపం కారణంగా సత్యవ్రతుడు త్రిశంకుడయ్యాడు.

కొన్నాళ్లు గడిచాయి.

కరువు లేకుండాపోయింది ఆ రాజ్యంలో. ఆనాటికి తపస్సు ముగించి భార్యాబిడ్డలను కలిశాడు విశ్వామిత్రుడు. తన కుటుంబానికి సత్యవ్రతుడు చేసిన సేవలను గురించి తెలుసుకున్నాడు. ఆనందించాడు. అతన్ని ఆహ్వానించాడు.

ఏదేని వరం కోరుకో! నెరవేరుస్తాను అన్నాడు.

తన చేత యజ్ఞం చేయించమన్నాడు త్రిశంకుడు. సరేనన్నాడు విశ్వామిత్రుడు. సమస్తదేవతల సమక్షంలో యజ్ఞాన్ని నిర్వహించి, త్రిశంకునికి సశరీరస్వర్గలోక ప్రాప్తి కలిగించాడు.

త్రిశంకునికి కేకేయ రాకుమార్తె సత్యవ్రతవల్ల హరిశ్చంద్రుడు జన్మించాడు. ఆ హరిశ్చంద్రునికి లోహితుడు జన్మించాడు. అతనికి వృకుడు జన్మించాడు. వృకునికి బాహువు జన్మించాడు. ఈ బాహువు ఎప్పుడూ కామక్రీడాలోలుడై రాజ్యపాలన నిర్లక్ష్యం చేశాడు. అదే అదనుగా హైహయాధీశ్వరులు, శకులు, యవనులు, పారదులు, పహ్లవులు బాహువుపై దండెత్తారు. అతని రాజ్యాన్ని స్వాధీనం చేసుకున్నారు. రాజ్యాన్ని కోల్పోయిన బాహువు, తన ఇద్దరు భార్యలసహా ఓ అడవిలో తలదాచుకున్నాడు. కొన్నాళ్లకు మరణించాడు. ఆనాటికి అతని ఇద్దరు భార్యలలో ఒకామె గర్భవతి. ఆమె సహగమనం చేయాలనుకున్నది. భర్తమృతదేహంసహా అగ్ని ప్రవేశం చేయాలనుకున్నది. ఆ సమయంలో భార్గవకుల శ్రేష్ఠుడు ఔర్వుడు ఆమెను అనునయించి, అతని ఆశ్రమానికి తీసుకువెళ్లాడు. కన్నతండ్రిలా సంరక్షించాడు. ఆమె గర్భం దాల్చడాన్ని భరించలేని సవతి, ఆమెకు విషాహారాన్ని తినిపించింది. అయినా కడుపుపోలేదామెకు. విషం విషంలాగానే కడుపులో ఉండిపోయింది. కొన్నాళ్లకు ఆమె ఓ కుమారుణ్ణి ప్రసవించింది. జరిగిందంతా దివ్యదృష్టితో గ్రహించిన ఔర్వముని, ఆ పిల్లాడికి 'సగరుడు' అని నామకరణం చేశాడు. పెరిగి పెద్దవాడయిన సగరునికి సమస్త వేదాలనూ, శాస్త్రాలనూ బోధించి, శత్రుమూకను ఒక్క క్షణంలో నిర్మూలించగల ఆగ్నేయాస్త్రాన్ని సమంత్రకంగా అనుగ్రహించాడు.

ఆ దివ్యాస్త్రప్రభావంతో హైహయులను ఓడించి, తమ రాజ్యాన్ని స్వాధీనం చేసుకున్నాడు సగరుడు. తర్వాత యవన, కాంభోజ, పారద, పహ్లవులపై విజృంభించి వారందరినీ అంతమొందించాడు. మిగిలినవారు సగరునికి భయపడి, ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని, వసిష్ఠుణ్ణి ఆశ్రయించారు. సగరుని



గురువు వసిష్ఠుడు. అతన్ని ఆశ్రయిస్తే ప్రమాదం ఉండదని భావించారు. అలాగే జరిగింది. వారికి అభయం ప్రసాదించాడు వసిష్ఠుడు. శకయవనాదులను సంరక్షించవలసినదని సగరునికి ఆదేశించాడు. అంగీకరించాడు సగరుడు. అయితే శకులకు ముండనం చేయించాడు. ముఖరోమాలను వదిలేయమన్నాడు. యవన కాంభోజులకు పూర్తిగా క్షురకర్మ చేయించాడు. పారదులు ఎల్లప్పుడూ జుత్తు విరబోసుకుని ఉండాలని ఆజ్ఞాపించాడు. మిగిలిన పహ్లవులను ఎల్లప్పుడూ గడ్డాలతోనూ, మీసాలతోనూ ఉండాల్సిందిగా హెచ్చరించాడు. వారి బంధువులైన కోరిసర్పులు, మాహిషకులు, చోళులు, కేరళులు కూడా పహ్లవులనే అనుసరించమని చెప్పాడు. వారందరికీ వేదకర్మలను దూరం చేశాడు. దాంతో వారంతా మ్లేచ్ఛజాతులలో కలసిపోయారు.

ఇప్పుడు సగరచక్రవర్తి వంశక్రమం వివరిస్తున్నాను, జాగ్రత్తగా విను అన్నాడు వైశంపాయనుడు. శ్రద్ధగా వినేందుకు చేతులు జోడించాడు జనమేజయుడు. చెప్పసాగాడిలా వైశంపాయనుడు.

సగరచక్రవర్తి భార్యలలో ఒకరికి ఔర్వుని వరం వల్ల సొరకాయలోంచి అరవైవేలమంది కుమారులు మహావీరులుగా జన్మించారు. వేరొకపత్నికి 'పంచజనుడు' అని ఆత్మభవుడు (తనకు తానుగా పుట్టినవాడు) జన్మించాడు. పంచజనుని పుట్టుకతో సగరుని వీరవిహారానికి హద్దులు లేకుండాపోయింది. ఓటమి అన్నదే తెలియరాలేదు. దాంతో ధర్మవిజేత అనిపించుకున్నాడతను. అప్పుడు అశ్వమేధయాగ దీక్ష స్వీకరించాడు సగరుడు. అశ్వాన్ని రక్షించాల్సిందిగా కుమారులందరికీ పేరుపేరునా పిలిచి చెప్పాడు. తండ్రి మాటను అనుసరించి కుమారులంతా సైన్యసహితులై అశ్వాన్ని రక్షిస్తూ వచ్చారు. అలా ఆగ్నేయదిశలో సముద్రతీరానికి ప్రవేశించారంతా. అక్కడ ఇంద్రుడు ఆ అశ్వాన్ని అపహరించాడు. పాతాళలోకానికి తీసుకుపోయాడు. తీసుకుపోయి పాతాళంలో తీవ్ర తపస్సు ఆచరిస్తున్న కపిలముని ఆశ్రమంలో దాచిపెట్టాడు. అదృశ్యమయ్యాడు. అశ్వం కానరాకపోవడంతో వెదకి వెదకి అలసిసొలసి తండ్రిని సమీపించారు సగరపుత్రులు. జరిగింది వివరించారతనికి. అశ్వం దొరికి తీరాలి. ఎక్కడ ఉన్నా వెదకి దానిని తీసుకు రావాల్సిందే! తప్పదు అన్నాడు సగరుడు. పుత్రులను తిరిగి పంపించాడు. సగరపుత్రులు అప్పుడు అశ్వం కోసం నేలను తవ్వారు. పాతాళంలోనికి ప్రవేశించారు. పాతాళంలో అగ్నిజ్వాలలా వెలుగుతున్న కపిలముని ఆశ్రమాన్ని చూశారు. ఆ ఆశ్రమంలో ఉన్న అశ్వాన్ని గమనించారు. తమ అశ్వాన్ని కపిలమునే దొంగిలించాడని భావించారు. క్రోధావేశపరులయ్యారు.

వెంటనే ఈ పాపిని ఖండఖండాలు చెయ్యండి! కత్తికి ఓ కండగా నరకండి! అన్నారు. ఒకరినొకరు ప్రోత్సహించుకున్నారు. పెద్దపెద్ద కేకలు వేసుకుంటూ కపిలమునిపై దాడి చేశారంతా.

**-అరణి**

# భామనే సత్యభామనే!

-సింహప్రసాద్

**శో**భనం గదిలో పెళ్లికూతురుకోసం ఉత్కంఠతో ఎదురుచూస్తున్నాడు సుబ్బురావు. (స్పెల్లింగ్ కరెక్టే. అతడి నానమ్మపేరు సుబ్బులు).

ఆ సమయంలో ఉండే ఉత్కంఠ కాదది. తన గురించి తన గ్రేట్‌నెస్ గురించి భార్యకిచెప్పి ఇంప్రెస్ చెయ్యాలన్న తపన, ఆరాటం అతన్ని నిజంగా నిలువనీయటం లేదు.

అసహనంగా పచార్లు చేస్తోంటే ఎట్టకేలకు ఆడంగుల నవ్వుల మధ్యలోంచొచ్చింది సీతాసంతోషి.

తెల్లచీర కట్టుకుని పాలగ్లాసు పట్టుకుని సన్నగా కంపిస్తూ బెదురుచూపులు చూస్తూ... పీజీ చేసినా ఈ సీన్లో ఈ అవస్థ తప్పదేమో అనుకుంటూ....!

"కమాన్ డియర్"

"పాలు.."

"పాలు మురిపాలు తర్వాత. ముందు మనం ఒకరి గురించొకరం బాగా తెలుసుకోవాలి"

"ఇదివరకు మాట్లాడుకున్నాం కదండీ..."

"అంతకంటే లోతైన పర్సనల్ విషయాలు ఉన్నాయి. మన మధ్య దాపరికాలుండకూడదు. ఒకరిగురించొకరం ఎంతబాగా తెలుసుకుంటే అంత గట్టిగా ఫిక్సవుతాం.."

"మీకు... లవ్‌స్టోరీ ఉందా?" సంశయిస్తూనే అడిగింది.

"నో టైం ఫర్ సచ్ నాన్సెన్స్. కాలేజీలోనే నా డ్రీమ్‌కు పునాది పడింది. ఫైనాన్షియల్లీ సౌండ్ పొజిషన్‌కి చేరి హ్యాపీగా ఉండాలి. బంధుమిత్రులంతా జెలసీ ఫీలయ్యేస్థాయిలో ఉండాలి. అది నెరవేరిందని గర్వంగా చెప్పగలను".

"మీరు గ్రేట్!"

"థాంక్యూ. అలా దూరంగా నిలబడ్డావేం. కమాన్.. కమ్‌హియర్. నీకో అద్భుతలోకం చూపిస్తానురా.." ల్యాప్‌టాప్ ఒళ్లోకి తీసుకుంటూ అన్నాడు.

"ఇప్పుడెందుకండీ.."

"ఇప్పుడే కావాలి. దీని ఇంపార్టెన్స్ చూశాక నీకే తెలుస్తుంది".

"ఆ బొమ్మలా? బాగోదేమోనండీ..." బిడియపడింది.

"బొమ్మలు కాదు ఫొటోలు. చూడగానే గుమ్మైపోతావ్. వీడియోలూ ఉన్నాయి".

కంగారూ భయమూ ముంచుకొచ్చాయి "మొదటి రాత్రే ఇలాంటి వెందుకండీ.. ఎవరైనా చూస్తే...!"

"ఇది భార్యాభర్తల విషయం. ఇతరులకు అనవసరం. కమాన్. కూర్చో, ఫీల్ ఫ్రీ.."

అతన్ని తాకుతూ కూర్చుంది. తనని సందిట్లోకి తీసుకుంటాడేమో, తొలిముద్దు రుచి చూపిస్తాడేమోనని ఆశగా చూసింది. కానతడి దృష్టంతా ల్యాప్‌టాప్ మీదే ఉంది.

స్క్రీన్‌మీద ఒక చక్కని బిల్డింగ్ ప్రత్యక్షమైంది.

"ఇదే మా ఆఫీస్. బ్యూటీ ప్లస్ డిగ్నిఫైడ్‌గా ఉంది కదూ. టర్నోవరూ ప్రాఫిట్సూ కోట్లలో ఉంటుంది. ఇలాంటి కంపెనీలో నేను టీం లీడ్‌ని అవడం రియల్లీగ్రేట్. ఆన్‌సైట్‌కి యుఎస్ పంపిస్తామన్నారు. పెళ్ళయ్యాక నీతో కలిసి వెళ్తానన్నాను. సో, మన హనీమూన్ అమెరికాలో! కంపెనీ ఖర్చుతో ఎంజాయ్ చేయబోతున్నామన్న మాట."

"మీరు చాలా తెలివైనవారని పెళ్ళి చూపుల్లోనే గ్రహించాను".

"నీకు ఐక్యూ ఎక్కువే. గుడ్. ఇదిగో ఇదే నా సీటు. నా కంప్యూటర్ ఫోన్... ఈ పక్క క్యాబిన్‌లోని వాళ్ళంతా నా టీం మెంబర్స్. నా సీటు అదిరింది కదూ?"

తలాడించింది.

'నా శాలరీ గురించి మీ పేరెంట్స్ చెప్పారో లేదో. నైన్‌లాక్స్ ప్యాకేజ్. అంటే నెలకు సెవెంటీ ఫైవ్ థౌజండ్ అన్నమాట. నువ్వు జాబ్ చెయ్యాల్సిన అగత్యం లేదు. నన్నూ, ఇంటినీ చూసుకుంటూ లైఫంతా డబుల్ హ్యాపీగా స్పెండ్ చెయ్యొచ్చు"

ఆమెలో ఆసక్తి సన్నగిల్లింది. చిన్నగా ఆవులించింది. అతడు పట్టించుకోలేదు. అచ్చం తన టీం మెంబర్స్‌కి వివరిస్తున్నట్టుగా చెప్పసాగాడు.

"ఇదిగో ఈ సర్ప్రైజ్ చూడు. ఇదే మన డీలక్స్ ఫ్లాట్. మన స్వంతం. గేటెడ్ కమ్యూనిటీ విత్‌ఆల్ ఫెసిలిటీస్. యూనో. ఫార్టీ ఫైవ్ లాక్స్ అయ్యింది. ఫర్నీచర్ ఎంత పోష్‌గా ఉందో చూడు. నువ్వు కలల్లో నీ డ్రీమ్‌హౌస్‌లో ఏమేం ఉండాలనుకుని ఉంటావో అవన్నీ అరేంజ్ చేసేశాను. టీవీ నుంచి మైక్రోఓవెన్ దాకా ఎవ్రీథింగ్ రెడీ. మన బెడ్‌రూం చూడు. సినిమా సెట్టింగ్‌లా ఉంది కదూ?"

అతడి భుజం మీద తలపెట్టుకుని ల్యాప్‌టాప్‌లోని దృశ్యాలు చూస్తూ తలాడించింది.

"బైక్ ఉన్నా సరే నీకెలాంటి ఇబ్బందీ కలక్కూడదని మొన్ననే కారు కొన్నాను. ఇదే మన కారు. ఎలా ఉంది."

"మీకు ముందు చూపెక్కువ..."

"థాంక్యూ ఫర్ ద కాంప్లిమెంట్..." మంచం దిగి పచార్లు చేస్తూ అన్నాడు "నేను అందరిలాంటి



వాణ్ణి కాదు. యూనిక్. చాలా ప్రత్యేకమైన వాణ్ణి. లైఫ్‌లో ప్రతి అంశాన్నీ అందంగా చెక్కే అద్భుత శిల్పిని. ఒక్కమాటలో చెప్పాలంటే గ్రేట్ ఫెలోని.." పెంపుడు పిల్లి వీపు నిమిరినట్టు మీసం సవ రిస్తూ గర్వంగా నవ్వేడు సుబ్బురావు.

గెడ్డంకింద చేయి ఆన్చుకుని వింటోందల్లా నల్లజెర్రి మీద పడినట్టు అదిరిపడింది.

అతడి మీసం నల్లగా వెడల్పుగా దుబ్బుగా ఉంది. దాన్ని సవరిస్తూ నవ్వుతోంటే చూడటానికి ఎంతో ఇబ్బందిగా కొంచెం న్యూనతగా కించిత్తు జుగుప్సగానూ ఉంది. రోజా అలా చూస్తూ మౌన శ్రోతలా ఉండడం అసాధ్యమన్పించింది.

ఆమె మోములో కళ్ళల్లో కదిలిన కదుల్తోన్న భావాలనేం పట్టించుకునే మూడ్‌లో లేడతడు. 'నీ కోసం అది తెస్తాను, ఇది చేస్తాను' అంటూ చెప్పుకుపోతోంటే అతడి మీసాన్నే చూస్తూ దాని గురించే ఆలోచిస్తోంది సీతాసంతోషి.

మాటల మధ్యలో ఆమెని సంబోధించబోయి ఆగాడు. "నిన్నెలా పిలవను డియర్? సీతా అంటే ఓల్డ్ ఓల్డర్. సంతోషి అంటే సంతోషిమాత గుర్తొస్తుంది. ఐడియా... రెండు పదాల మొదటి అక్షరాలు కలిపి సీసం అని పిలుస్తాను. వెరైటీగా గొప్పగా ఉంది కదూ?"

ఆమె గతుక్కుమంది. అయినా పొడిగా నవ్వి "మీ ఇష్టం" అంది.

అతడికి సీసం మెటల్ గుర్తొచ్చింది. ఇబ్బందిగా ఫీలయ్యాడు. అలా అని నాలిక్కరుచుకోవడం అవమానంగా అన్పించింది.

"థాంక్యూ సీసం. నాకు తెలుసు. నువ్వు నా ప్రతివర్డ్‌నీ, ప్రతి స్టెప్‌నీ గౌరవిస్తావ్. నేన్నీకలల రాకుమారుణ్ణి కదా. నీ కోసం తెల్లకారు మీద వచ్చిన మగధీరుణ్ణి. నీకో వరం ఇస్తాను కోరుకో.."

"రేపు మాట్లాడుకుందామండీ" అతడి చేయి పట్టుకులాగుతూ అంది.

"ప్రామిస్ ప్రామిస్సే. నీకేం కావాలో కోరుకో. ఎంతఖరీదైనదైనా సరే. ఎంత కష్టమైనదైనా సరే. నీ కోసం సిర్ఫ్ నీకోసం తెచ్చిస్తా" దుబ్బు మీసాన్ని గర్వంగా దువ్వుతూ అన్నాడు సుబ్బు.

ఆమె ఒళ్ళు జలదరించింది. "తర్వాత అడుగుతాన్లెండి" అదోలా చూస్తూ అంది.

"నో నో. సుబ్బు ది గ్రేట్ గురించి నీకు పూర్తిగా తెలీదు. నీ కోరికని అవలీలగా తీర్చేశాక నేనేంటో నా గొప్పతనమేంటో నీకు పూర్తిగా అర్థమవుతుంది. కమాన్. అడుగు. ఏదైనాసరే ఎలాంటిదైనా సరే. నో చెప్పనని మన తొలిరాత్రి మీద ప్రమాణం చేసి చెబుతున్నాను"

"ఇప్పుడే అడిగితే బాగోదేమోనండీ" సంకోచిస్తూ అంది.

"నువ్వడిగితేనే నాకు బాగుంటుంది. నో హెజిటేషన్. నో ఫియర్. ఏదైనాసరే అడిగేసెయ్. కమాన్ సీసం కమాన్‌యార్" తొందరపెట్టాడు.

"మీరు. మీరు..."

"ఎస్ నేను. నేనేం కొనాలి?"

"కొనక్కర్లేదు. చేస్తే చాలు"

**అతడో పెద్ద సాఫ్ట్‌వేర్ కంపెనీలో టీమ్‌లీడర్. సంవత్సరానికి తొమ్మిది లక్షలు ప్యాకేజీ. నేను అందరికంటే చాలా గ్రేట్ అనుకుని విర్రవీగే స్వభావం. పెళ్ళయింది. శోభనంరాత్రి భార్య గదిలోకి ఎంటర్‌కాగానే అసలు విషయం పక్కన పెట్టి ఆమెను అదరగొట్టేశాడు. ల్యాప్‌టాప్ చూపిస్తూ తన గొప్పతనం, ముందు జాగ్రత్తలు, ఆమెకు సమకూర్చిన సౌకర్యాల గురించి దండకం వల్లించాడు. అతడికి పురుష అహంకారం ఎక్కువే! గ్రహించింది భార్య. మరి అప్పుడేం చేసింది ఆమె?**

"షిట్. చేసేదైతే ఇప్పుడే ఈ క్షణమే చేసేస్తా" రెచ్చిపోతూ అన్నాడు.

"ఇప్పుడక్కర్లేదు. రేపు చేసినా చాలు"

"ఓకే డన్. చెప్పు సీసం.." స్టైలుగా మీసం సవరిస్తూ ఫోజు కొట్టాడు.

"మీరు మీసం తీసెయ్యాలి!"

"వ్వాట్!" అరిచాడు. ఎంతగట్టిగా అరిచాడంటే తలుపులు, కిటికీ సందుల్లోంచి తొంగి చూస్తోన్న ఆడంగులు కకావికలుగా చెదరిపోయారు. (వారిలో నలుగురికి కర్ణభేరి బద్ధలయ్యిందని తర్వాత డాక్టర్లు నిర్ధారించారు).

"ఏంటి... ఏంటి నువ్వు కోరింది? నా మీ...?" మీసాన్ని గట్టిగా పట్టుకుని అపనమ్మకంతో ప్రశ్నించాడు.

"మీసం లేకపోతే హిందీ హీరోలా ముద్దొస్తారండీ" గోముగా అంది.

"అయ్యో! ఇప్పుడేం చెయ్యాలి?!" తల పట్టుకుని మంచం మీద కూలబడ్డాడు.

"ఇలాగ..." అందామె అతడి బుగ్గలమీద గాఢంగా చుంబించి వాటేసుకుంటూ.

మర్నాడంతా తనలో తను మథన పడుతూ గొణుక్కుంటూ అన్యమనస్కంగా గడిపాడు సుబ్బు.

"రాత్రి అలా అరిచావేంటి అల్లుడూ.... అమ్మాయిలు అరవటం విన్నాంగానీ ఇలాంటి విడ్డూరం ఎప్పుడూ విన్లేదు చూళ్ళేదు!" భోజనం వడ్డించి చెంపలు నొక్కుకుంటూ అంది పిన్నత్తగారు.

"నేనెప్పుడరిచానూ!"

"నాకేం తెలుస్తుందీ! అమ్మాయి నడుగు" ముసిముసి నవ్వులు కుమ్మరిస్తూ వెళ్ళిపోయింది.

బుర్రగోక్కుంటోంటే పిల్లిలా వచ్చింది సీతా సంతోషి. "అతిగా ఆలోచించకండి జుట్టు ఊడిపోతుంది"

"అహహ అదికాదు సీసం.."

"పోనీలెండి. నేనేమీ అడగలేదనుకోండి. నా మొదటికోరిక తీర్చలేదని నేనేమీ అనుకోన్లెండి.."

"పోనీ ఇంకేదైనా సొల్యూషన్ ఉంటే...!"

"ప్లీజ్ వదిలెయ్యండా ఊసు. అవునూ, అమెరికాలోని మగాళ్ళు గెడ్డలూ మీసాలూ లేకుండా నున్నగా షేవ్‌చేసుకుంటార్టగా. మనమెలాగూ అక్కడికెళ్తాం గనుక అప్పుడు చూసుకోవచ్చులెండి. కానీ... మొదటిరాత్రి... మొదటి ప్రామిస్సు...!" అంటూనే ఆపైది మింగి మెల్లగా జారుకుంది.



ముద్ద దిగలేదు సుబ్బుకి.

రెండోరాత్రి గదిలోకెళ్ళే ముందు బాత్‌రూంలోకి దూరాడు. తనకెంతో ఇష్టమైన మీసాన్ని - సుబ్బు ది గ్రేట్ అన్పించే ప్రెస్టీజియస్ మీసాన్ని తనివి తీరా చూసుకున్నాడు. రకరకాలుగా నిమిరాడు. పిమ్మట కళ్ళనుండి బొటబొట కన్నీటి బొట్లు రాలిపోతోంటే రేజర్ అందుకుని కళ్ళు మూసుకుని కోడిపిల్లని ఖూనీ చేస్తున్నట్టుగా మీసాన్ని..!

గదిలోకి అడుగు పెడుతూనే గమనించింది. పరుగునవెళ్ళి సుబ్బు మోముని ముద్దుల్తో ముంచెత్తింది సీసం.

“మచ్చలేని చందమామలా, అచ్చమైన మన్మథుడిలా ఉన్నారు”.

అతడు పొంగిపోయిన మాట నిజమేగాని కళ్ళెత్తి ఆమెని చూడలేక తలదించుకున్నాడు.

“నా హబ్బీ రియల్లీ గ్రేట్. నాకోసం ప్రాణప్రదమైన మీసాన్ని బలిచ్చిన గ్రేటెస్ట్ హీరో” అంటూ పొగడ్తలతో ముంచెత్తింది.

ఉబ్బిపోయాడు సుబ్బు. ‘యస్. నేను గ్రేట్!’ అనుకుంటూ మీసం సవరించుకోబోయిన వాడల్లా, అక్కడి చర్మం నున్నగా తగిలేసరికి బావురుమన్నాడు.

“ఛా ఛా ఊరుకోండి. ఎవరైనా వింటే శోభనం గదిలో ఏడ్చిన మొట్టమొదటి మగాడు మీరేనని చరిత్రలో నమోదుచేస్తారు”.

చటుక్కున పిన్నత్తగారి మాటలు గుర్తొచ్చాయి. తలుపువంకా, కిటికీ వంకా భయంగా అనుమానంగా చూస్తూ ఏడుపు మింగేశాడు.

మర్నాడు శనివారం. కంపెనీకి హాలిడే గనుక పెళ్ళికి రాని కొలీగ్స్ రెండు సుమోల్లో జంట సునామీల్లా వచ్చారు.

మూతిదగ్గర కర్చీఫ్ అడ్డం పెట్టుకుని ఆహ్వానించాడు సుబ్బురావు.

ఫలహారాలూ పెళ్ళి జోక్సూ అయ్యాక “మీలో ఏదో తేడా కన్పిస్తోంది సుబ్బుగారూ” అన్నాడో పెద్దాయన.

“పెళ్ళయ్యింది కదా!” అని నవ్వి “మగాడి స్వేచ్ఛా పౌరుషాలు పోతాయి మరి” అంటూ పళ్ళికిలించాడో భార్యాబాధితుడు.

“మన సుబ్బు ఆర్డినరీ ఫెలోకాదు. సుబ్బు ఆల్వేస్ గ్రేట్. అసలతడి మీసాల్లోనే రాజసం ఉంది తెలుసా?” అంటూ ఆగి “నీ ట్రేడ్ మార్క్ మీసాన్ని దాచుకోకు సుబ్బూ. వాటిని కనపడనీ! ఫోజు కొట్టనీ!” అన్నాడు హెచ్చార్.

సుబ్బు కంగారు పడిపోయాడు. “మీకు టైం అయినట్టుంది. త్రీ అవర్స్ జర్నీ కదా..”

“భలేవాడి వోయ్. నీ వైఫ్‌ని పరిచయం చెయ్యవూ! నీ టేస్టూ ఇంటరెస్టూ మాకు తెలియొద్దూ!” అందో గడుగ్గాయి.

బామ్మర్దిని పిలిచి చెబుతూ మూతిమీంచి కర్చీఫ్ తీశాడు సుబ్బురావు. అతడి పేడిమొఖాన్ని చూసి మొఖామొఖాలు చూసుకున్నారంతా.

“నీ మీసం ఏవయ్యింది?” మొఖాన్నే అడిగేశారొకరు.

“పొరబాటున కట్ అయ్యిందేమో” అన్నారు ఇంకొకరు జాలిగా చూస్తూ.

“అదేంకాదు. వాళ్ళావిడ తీసెయ్యమనుంటుంది. కదండీ సుబ్బుగారూ” ఇంకో అమ్మాయి గడుసుగా అడిగింది.

“యూ టూ...!” అంటూ అదోలా చూశాడు ఇందాకటి భార్యాబాధితుడు.

తడబడ్డాడు. తబ్బిబ్బుపడ్డాడు. “అహహ. అది కాదు. మరేంటంటే పెళ్ళిలో మీసాలు తీసెయ్యడం మా ఆచారం. అంతే. దట్సాల్. ఇంకేం కాదు..” అద్భుతమైన ఐడియా వచ్చినందుకు పొంగిపోతూ అన్నాడు.

“అబద్ధం! పెళ్ళి ఫొటోల్లో మీ మీసం నల్లపిల్లి తోకలా ఉంది” అందో ఆడకొలీగ్.

అమాంతం మీదపడి ఆమె పీక పిసికేయాలన్నంత కోపమూ ఆవేశమూ గత్రాగత్రా వచ్చాయి సుబ్బుకి. వాటికి బిరడా వేసేసి వెర్రిగా నవ్వాడు.

“మీసం మీద సీసం అంటూ ఓ పాతసినిమాలో రేలంగి మావగారి మీసం మీద సీసపద్యం అద్భుతంగా చెబుతాడు” అన్నారొకరు ‘సీసం’ వస్తోంటే.

“సీసం మీసం ఏంలేవు. అంతా ట్రాష్. తన పేరు సీతాసంతోషి. ఎంబిఎ” పరిచయం చేశాడు సుబ్బు.

ఆకుకు అందని పోకకు పొందని అతడి మాటలకు అయోమయంగా చూశారు. పిమ్మట ఏదో ఉందనుకుంటూ భుజాలు ఎగరేశారు.

పెళ్ళికాని ఆడకొలీగ్స్ సీతాసంతోషి మీద ప్రశ్నల్తో దాడి చేశారు. (తమలో అతడికి కన్పించనిది ఆమెలో ఏముందో తేల్చుకోవాలన్నది వారి పంతం. తద్వారా అతన్ని కించపరచొచ్చని వారి పథకం).

సీతాసంతోషి చాలా పొదుపుగా, గడుసుగా మాట్లాడింది.

మగ కొలీగ్స్ సంతుష్టులై, ఆడ కొలీగ్స్ అసంతృప్తజీవులై మరోసారి వివాహ శుభాకాంక్షలు చెప్పి వెళ్ళిపోయారు.

“చావు తప్పి కన్ను లొట్టపోయినట్టుగా ఉంది” అన్నాడు సుబ్బు పై పెదవి పైభాగాన్ని తడుముకుంటూ విచారంగా.

“అదేం మాట. కొత్త లక్స్ సబ్బులా మెరిసిపోతుంటేనూ!” అందామె నవ్వు అణచుకుంటూ.

ఇంతలో ఆమె ఫ్రెండ్స్ మిడతల దండులా వచ్చేసరికి గబగబా లోపలికెళ్ళిపోబోయాడు సుబ్బు.

(పెళ్ళిలో అతన్ని ఆటపట్టించాలని వెళ్ళి దెబ్బంమొహాలు వేసుకొచ్చిన వాళ్ళే వీళ్ళంతా)

“నీ హబ్బీ సాఫ్ట్‌వేర్ కాదు హార్డ్‌వేర్!” “ఈ భూ ప్రపంచం మీద తనంత గ్రేట్ పర్సన్ లేడని అతగాడి గాఢాభిప్రాయమే! అతనికి నిలువెల్లా పురుష అహంకారం ఉందే బాబూ! అది లేకపోతే మంచోడే పాపం! శ్రీ మహావిష్ణువు దూర్వాస మహర్షి అరికాల్లో కంటిని చిదిమినట్టు నువ్వే ఏదో మంత్రం వెయ్యాలి. లేకపోతే చిడతలు పట్టుకుని నువ్వు అతగాడి భజనచేయాల్సిందే” అంటూ సీరియల్ డైలాగ్స్ సీరియస్‌గా ఆమెకి చెప్పెళ్ళిపోయారప్పుడు!

“హాయ్ బావగారూ” అంటూ ఒకరు సుబ్బు కాళ్ళకి బంధం వేసేసరికి లోపలికి పారిపోవాలనే ప్రయత్నం విరమించి మళ్ళీ కర్చీఫ్‌కి పని చెప్పాడు.

“నోరు కాలిందా బావగారూ” అడిగింది ఇంకో అమ్మాయి.

“అహహ అదికాదు.. ఊరికే..” నసుగుతూ కర్చీఫ్ తీశాడు.

అతడి మొఖాన్ని - ముఖ్యంగా నున్నగా గొరిగిన మీసభాగాన్ని చూసి మూర్ఛపోబోయి నిలదొక్కుకుని స్నేహితురాలి వంక యమాశ్చర్యంగా చూశారు.

(ఆ చూపుల్లో రెండు రాత్రులకే పెంపుడు జంతువుగా మార్చేశావన్న భావం లేకపోలేదు!)

ఆమె పెదాల మీద విజయహాసం నర్తించింది.

“నేను సీతనీ సంతోషినీ సీసంనీ కాదు - సత్యని!” అని ఆమె చెప్పలేదు. ఆమె దరహాసం - అధరహాసం చెప్పింది!

*సెల్: 98490 61668*

## ఆ ఇంట్రస్ట్ తగ్గలేదట!



*అపార్థం చేసుకోకండి. ఈ మాటలు అన్నది నందితా రాజ్! ‘ప్రేమకథాచిత్రమ్’తో ఒక్కసారిగా వెలుగులోకి వచ్చిన నందిత ఇటీవలి కాలంలో సినిమాల్లో కనిపించడం లేదు. దానికి కారణం ఆమె సినిమాలు ఫ్లాప్ కావడమే! ఫ్లాప్ హీరోయిన్లు కూడా అవకాశాల మీద అవకాశాలు అందిపుచ్చుకుంటుంటే మంచి నటన, ప్రతిభ ఉన్న నందిత తెరమరుగు కావడానికి ఆమెకు సినిమాలంటే ఇంట్రస్ట్ లేకపోవడమే అన్న పుకార్లు బయలుదేరాయి. వీటి మీద నందిత సీరియస్‌గానే స్పందించింది. తనకు సినిమాలన్నా, నటన అన్నా ఇంట్రస్ట్ తగ్గలేదనీ, సరైన కథతో వస్తే హిట్ కొట్టొచ్చు అన్న ఉద్దేశంతోనే తొందరపడి సినిమాలు చేయడం లేదని వివరణ ఇచ్చుకుంది.*

# డిస్క్ సమస్యలకు సర్జరీ దాకా ఎందుకు?

**శరీరానికి** వెన్నెముక మూలస్తంభంలాగా పనిచేస్తుంది. వెన్నెముకకు తోడుగా కండరాలు, లిగమెంట్లు, డిస్క్‌లుంటాయి. వెన్నెముక సులభంగా వంగడానికి డిస్క్‌లు, లింగమెంట్లు తోడ్పడతాయి. ఈ వెన్నుపూసల మధ్య రబ్బరు కుదురులాంటి ఒకపదార్థం ఉంటుంది. దీనిని డిస్క్ అంటారు. వెన్నుపాము పొడవునా ఎన్నో నరాలు వెళుతుంటాయి. మెడభాగం నుంచి వెళ్లే నరాలు చేతుల్లోకి, నడుము నుంచి వెళ్లే నరాలు కాళ్లలోకి వెళతాయి. వీటిలో కొన్ని నరాలు మూత్రకోశం, మలవిసర్జన భాగంతో పాటు లైంగిక భాగాల్లోకి వెళతాయి. అందుకే డిస్క్ సమస్యలు కలిగి ఉన్న వారిలో అంగస్తంభన, శీఘ్రస్ఖలనం వంటి లైంగికపరమైన సమస్యలు కనిపిస్తాయి. డిస్క్‌లు వెన్నెముక కదులుతున్నప్పుడు షాక్ అబ్జార్బర్‌లా పనిచేస్తాయి. సాధారణంగా డిస్క్‌లలో రెండు రకాల సమస్యలు ఉత్పన్నమవుతుంటాయి. ఒకటి డిస్క్‌ప్రొలాప్స్, రెండవది డిస్క్ డిజనరేటివ్ డిసీజ్. డిస్క్ బయట ఉన్న పొర బలహీనపడటం వల్ల డిస్క్ వెనక్కు జరిగి కాళ్లలోకి వచ్చే నరాలపై ఒత్తిడి తెస్తాయి. ఏ ప్రాంతంలో నరాలపై ఒత్తిడి పడితే ఆ ప్రాంతంలో తిమ్మిర్లు, మొద్దుబారడం, మంటగా అనిపించడం జరుగుతుంది. దీనినే స్లిప్ డిస్క్ అంటారు. ఒక్కొక్కసారి యాన్యులస్ అనే పొర చిట్లి, జెల్లీలాంటి డిస్క్ మెటీరియల్ బయటకు వస్తుంది. దీన్ని డిస్క్ ప్రొలాప్స్ అంటారు. దీనివల్ల కాళ్లలో నొప్పి, నడుము నొప్పి వస్తుంది. కాలును వంచకుండా తిన్నగా ఉంచి పైకి ఎత్తినపుడు కాలులో నొప్పి పెరిగితే డిస్క్ ప్రొలాప్స్‌గా చెప్పవచ్చు.

## సెర్వికల్ స్పాండిలోసిస్

మెడభాగంలో ఉండే పూసలను సెర్వికల్ వర్టిబ్రా అంటారు. ఈ వర్టిబ్రాల మధ్య ఉన్న డిస్క్ అరిగి కొంచెం పక్కకు జరిగి అక్కడ ఉన్న నాడులను ఒత్తిడికి గురిచేస్తుంది. దీనివల్ల మెడనొప్పి వస్తుంది. మెడనొప్పి రావడానికి గల కారణాలను పరిశీలిస్తే మెడ కండరాలు ఒత్తిడికి లోనుకావడం, సెర్వికల్ స్పాండిలోసిస్, సెర్వికల్ డిస్క్ ప్రొలాప్స్, సెర్వికల్ ఫ్రాక్చర్స్, టీబీ వల్ల ఎముకల్లో మార్పులు, సరియైన భంగిమలో కూర్చోకపోవడం, ఎక్కువ బరువులు ఎత్తడం వంటి కారణాల వల్ల ఈ సమస్య రావడానికి ఆస్కారం ఉంటుంది. దీనివల్ల సీ1, సీ2, సీ3, సీ4, సీ5, సీ6, సీ7 వర్టిబ్రాలలో సమస్యలు వస్తాయి. ఈ డిస్క్‌లలో సమస్యల వల్ల తలనొప్పి, మెడనొప్పి, మెడబిగుసుకుపోవడం, చేతుల్లో కాళ్లలో తిమ్మిర్లు, స్పర్శ తగ్గడం, మల, మూత్రవిసర్జనపై నియంత్రణ తప్పడం, మెడ కండరాలు బలహీనపడటం వంటి లక్షణాలు కనిపిస్తాయి.

## కారణాలు

డిస్క్ సమస్యలు రావడానికి అధిక బరువు, జీవనవిధానంలో మార్పులు వయసు పైబడటం వల్ల వచ్చే మార్పులు, శక్తికి మించి బరువులు ఎత్తడం, ఎక్కువ దూరం రన్నింగ్ చేయడం, రోజంతా వంగి పనిచేయడం, వెన్నెముకకు దెబ్బలు తగలడం, వాహనంపై వెళుతున్నప్పుడు గోతుల్లో పడి డిస్క్‌లపై ఒత్తిడి పెరగడం కారణాలుగా ఉంటాయి.

## సయాటికా

సయాటికా అనేది శరీరంలో అతి పొడవైన నరం. ఇది తొడల నుంచి మోకాళ్లు, కాలివేళ్ల దాకా వ్యాపించి ఉంటుంది. దైనందిన జీవితంలోని లోపాల వల్ల ఈ నరం ఒత్తిడికి గురవుతుంది. దీనివల్ల నడుం భాగంలో కండరాలు పట్టినట్టుగా ఉంటుంది. పొడిచినట్లు నొప్పి ఉండటం వల్ల వంగడం కష్టమవుతుంది. మొద్దుబారినట్టు ఉండటం, కాలుపైకి ఎత్తలేకపోవడం, నడుం కిందిభాగంలో బలహీనత, కాళ్లలో తిమ్మిర్లు రావడం, నడవడం కష్టంగా ఉంటుంది. సయాటికా సమస్య ఉన్న వారికి అంగస్తంభన లోపాలు, లైంగిక సమస్యలతో బాధపడే వారు కూడా ఉన్నారు.


డా. మధు వారణాశి, ఎం.డి
ప్రముఖ హోమియో వైద్యులు
ప్లాట్‌నెం 188, వివేకానందనగర్ కాలనీ,
కూకట్‌పల్లి, హైదరాబాద్
ఫోన్ : 8897331110
8886 509 509




## ఎలా వస్తుందంటే...

రోజంతా కూర్చుని, నిలబడి ఉద్యోగాలు చేసే వాళ్లు, అధిక బరువు, ప్రమాదాలకు గురైన వారికి ఈ సయాటికా సమస్య వచ్చే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి. వెన్నెముక సులభంగా వంగడానికి డిస్క్‌లు, లిగమెంట్లు తోడ్పడతాయి. మెడభాగం నుంచి వెళ్లే నరాలు చేతుల్లోకి, నడుము నుంచి వెళ్లే నరాలు కాళ్లలోకి వెళతాయి. సెర్వికల్, లుంబార్ రీజియన్లలో డిస్క్‌లు దెబ్బతింటాయి. ఉన్న స్థానం నుంచి పక్కకు తొలగుతాయి. దాని ప్రభావం నెర్వస్‌పైన పడి నొప్పి రావడం మొదలవుతుంది. డిస్క్ దెబ్బతినడం వల్ల మెడభాగంలో సెర్వికల్ స్పాండిలైసిస్ సమస్య మొదలవుతుంది.

**డిస్క్ సమస్యలు మనిషిని నిర్జీవం చేస్తాయి. చాలా మంది వెన్నునొప్పి వేధిస్తున్నా పెయిన్ కిల్లర్స్ వేసుకుని కాలం గడిపేస్తూ ఉంటారు. కానీ డిస్క్ సమస్యలను నిర్లక్ష్యం చేస్తే ఇతర సమస్యలకు దారితీసే అవకాశం ఉంది. అయితే హోమియో చికిత్స ద్వారా డిస్క్ సమస్యలకు శాశ్వత పరిష్కారం లభిస్తుందని అంటున్నారు ప్రముఖ హోమియో వైద్యనిపుణులు, ఉత్తమ డాక్టర్ అవార్డు గ్రహీత డాక్టర్ మధువారణాశి.**

## లక్షణాలు

మెడ నుంచి నొప్పి చేతి వేళ్ల వరకు పాకుతుంది. తల తిరగడం, కండరాలు బిగుసుకుపోవడం, చేతి వేళ్లు తిమ్మిరి ఎక్కడం, పడిపోతున్నట్లుగా ఉండటం, తలనొప్పిగా ఉండటం జరుగుతుంది. లంబార్ స్పాండిలోసిస్‌లో నడుంనొప్పి కిందకు పాకుతున్నట్లు నొప్పి, కాలివేళ్లలో తిమ్మిరిగా ఉంటుంది. వ్యాధి గురించి అవగాహన, మెడిసిన్, పాథాలజీ, అనాటమీల విజ్ఞానం వ్యాధి నిర్ధారణకు ఉపయోగపడుతుంది. ప్రకృతి ఎప్పుడూ సహజంగా ఉంటుంది. అలాంటి ప్రకృతి నియమాలపై హోమియోపతి ఆధారపడింది. హోమియోవైద్యం నానో టెక్నాలజీ సూత్రాల ద్వారా సత్ఫలితాలు ఇస్తుందని తేలింది. చాలా మంది రోగులు వైద్యులను తరచూ మారుస్తుంటారు. హోమియో వైద్యంలో ఇలాంటి మార్పులు చాలా ఇబ్బందులకు గురిచేస్తాయి. సహజత్వం, సత్యం, మానవత అనే మూడు లక్షణాలున్న అనుభవజ్ఞుడైన హోమియో నిపుణుడు దొరికినపుడు అతనిపై ఆధారపడినపుడు మీ అనారోగ్య సమస్యలు చాలా వరకు తగ్గుతాయి. మంచి హోమియో వైద్యుడు రోగి ముఖం చూసిన వెంటనే తన మనసులో మందులు గుర్తుకువస్తాయి. దాన్నే స్పాట్ డయాగ్నసిస్ అంటారు. అది వ్యాధి నిర్ధారణకు తిరుగులేని రామబాణం లాంటిది.

## వ్యాధి నిర్ధారణ

ఎక్స్‌రే, సీటీస్కాన్, ఎమ్ఆర్ఐ స్కాన్, సీబీపీ, సీఎస్ఎఫ్ పరీక్షలు చేయించుకోవడం ద్వారా వ్యాధి నిర్ధారణ చేసుకోవచ్చు.

## హోమియో చికిత్స

హోమియో వైద్య విధానం శాస్త్రీయతతో కూడినది. శస్త్ర చికిత్స అవసరం లేకుండా నయం చేయడానికి ఆస్కారం ఉంటుంది. సర్జరీ అనేది కొన్ని రకాల వ్యాధులకు ఉపయోగించే టెక్నిక్. సర్జరీతో ఆటంకం కలిగించే పదార్థాన్ని నిర్మూలించడానికి ఆస్కారం ఉంటుంది. కానీ వ్యాధి కారకాలను తీసివేయుటకు వీలుకాదు. మిగతా వైద్యవిధానాలలో మందుల ద్వారా నయం కాని వ్యాధులన్నింటికి సర్జరీ పైన ఆధారపడతారు. కాని హోమియో వైద్యంతో 60 శాతం కేసులు సర్జరీ లేకుండా తగ్గించవచ్చు.

# సురభి

## కొండచిలువల సాక్షిగా పెళ్ళి!

గౌనులో పెళ్ళికూతురు, సూటులో పెళ్ళికొడుకు సిద్ధంగా ఉన్నారు. పెళ్ళిపెద్ద కూడా వచ్చేశారు. ఇక పెళ్ళితంతు షురూ కావడమే తరువాయి. ఉంగరాలు మార్చుకోవాలి. వధూవరులు ఎప్పుడు ఉంగరాలు మార్చుకుంటారా అని అందరూ ఎదురుచూస్తుంటే, ఉన్నట్టుండి రెండు పెద్ద కొండచిలువల్ని వేదికపైకి తీసుకొచ్చారు. వధూవరులు ఉంగరాలకు బదులుగా కొండచిలువలను ఒకరి మెడలో ఒకరు వేసుకుని పెళ్ళి చేసుకున్నారు. దాంతో ఆహూతులంతా ఆశ్చర్య పోయారు. విడ్డూరంగానూ, కాస్తంత భయంగా కూడా ఉన్న ఈ రకమైన పెళ్ళి చైనాలో జరిగింది. వు జియాన్ ఫెంగ్ జంతుప్రేమికుడు. తన పెళ్ళి వినూత్నంగా ఉండాలనుకున్నాడు. ఆ తరహాలోనే ప్లాన్ చేసుకున్నాడు. అమ్మాయి జియాంగ్ స్యూ కూడా అందుకు ఓకే చెప్పడంతో ఇద్దరూ కొండచిలువల సాక్షిగా ఒకటయ్యారు. వేలికి ఉంగరాల బదులు కొండచిలువలే మెడలో దండలుగామారి జియాన్ ఫెంగ్, జియాన్ స్యూలను దంపతుల్ని చేశాయి.



## విడదీయరాని బంధం!

ఏ జాతి జంతువులు ఆ జాతితోనే స్నేహం చేస్తాయి. వాటితోనే కలిసి తిరుగుతాయి. కానీ ఇంకో జాతి జంతువులతో కలిసి తిరగడం, కలిసి ఉండటం అరుదుగా జరిగే సంఘటన. అలాంటి సంఘటనే అమెరికాలో జరిగింది. ఒక ఒంటె గుర్రంతో స్నేహం చేసి, దాన్నే అంటిపెట్టుకుని ఉంటోంది.



అమెరికాలోని మైనెకి చెందిన క్యాండిస్ విల్లెక్స్ 'పోనీ ఎక్స్‌ప్రెస్ జూ' సంచార జంతు ప్రదర్శనశాలను నిర్వహిస్తుంటుంది. అందులో ఉండే గుర్రం పేరు డాలీ. ఇటీవల దానికి చూపు పోయింది. డాలీకి మరో గుర్రాన్ని తోడుగా తీసుకు రావాలనుకున్నారు నిర్వాహకులు.

అంతలోనే ఏడాది వయసున్న కైసర్ అనే ఒంటె జూలోకి వచ్చి చేరింది. ఓ రోజు కైసర్ బోను గేటు తెరిచి ఉండటం చూసి నిర్వాహకులు కంగుతిన్నారు. బోనులో కైసర్ లేదు. అంతా గాలిస్తే డాలీ దగ్గర కనిపించింది కైసర్. ఒంటెలు ఉన్న చోటుకి తీసుకువెళ్లడానికి ప్రయత్నించినా డాలీని వదిలి పోవట్లేదట కైసర్. ఈ రెండూ కలిసి తినడం, తిరగడం, ఆడుకోవడమే కాదు, డాలీ పడుకుంటే ఈగలు, దోమలు వాలకుండా కైసర్ కాపలా కాస్తోంది. షికారుకి తోడుగా వెళుతోంది. దీంతో కైసర్‌ను డాలీ వద్దే ఉండనిచ్చారు. డాలీకి చూపు లేకపోయినా కైసర్ తోడుగా ఉంటూ దాని అవసరాలు తీరుస్తోంది.

## అందమైన పొదరిల్లు

మేడంటే మేడా కాదూ... గూడంటే గూడూ కాదూ.... అనే అందమైన పాటలాగా పదిలంగా అల్లుకున్న పొదరిల్లులా ఎరుపు రంగులో ముచ్చటగొలుపుతున్నాయి కదూ ఈ ఇళ్ళు! ఈ ఇళ్ళ సముదాయం ఉన్న ప్రాంతం లారంగ్ ఘర్ బౌద్ధ అకాడమీ.

ప్రపంచంలోనే అతి పెద్దదైన ఈ బౌద్ధారామం వాయువ్య చైనా పర్వత ప్రాంతంలో ఉంది. పదివేలమందికిపైగా బౌద్ధ సన్యాసులు, సాధువులు ఇక్కడ నివసిస్తుంటారు. ఇరుకుగా, ఎరుపు రంగులో కనిపించే ఈ ఇళ్ళన్నీ అక్కడి బౌద్ధ అకాడమీకి చెందినవారివే! అక్కడికొచ్చి సెటిలైనవాళ్ళవే! అన్నీ చెక్క నిర్మాణాలు. 1980 నుంచి బౌద్ధ భిక్షువులు ఈ ప్రాంతంలో నివాసముంటున్నారు. భూమికి 12,500 అడుగుల ఎత్తులో రఫ్ వాతావరణంలో నిర్మానుష్య ప్రాంతంలో బౌద్ధ భిక్షువులు ఏర్పరచుకున్న నివాసాలివి. ఈ ఇళ్ళన్నీ ఎరుపురంగులో ఉండి కొండ మీద రెడ్‌సీ చూస్తున్న అనుభూతి కలుగుతుందట చూపరులకి. ప్రపంచంలోనే అతి పెద్ద బౌద్ధ నివాస ప్రాంతమైన ఈ బౌద్ధారామం ఫొటోలపై మీరూ ఓ లుక్కేయండి.



## బామ్మగారి ప్రపంచయాత్ర

కొత్తకొత్త ప్రదేశాలు చూడాలని, దేశాలు తిరగాలని ఎవరికిమాత్రం ఉండదు చెప్పండి. ఎంతోమంది ప్రపంచ పర్యటన చేస్తూ ఎంజాయ్ చేస్తుంటారు. అక్కడి విశేషాలతో మైమరచిపోతారు. కానీ ఓ బామ్మగారు ఒంటరిగా ప్రపంచ పర్యటన చేయడం అన్నిటికంటే పెద్దవిశేషం.

రష్యాకు చెందిన బాబా లీనా 1970 లోనే దేశదేశాలు తిరగాలనుకుంది. అనుకున్నదే తడవుగా పోలాండ్, జర్మనీల్లో పర్యటించింది. డబ్బు, సమయం రెండూ లేకపోవడంవల్ల ఆమె యాత్ర ఆగిపోయింది. తన కల నెరవేర్చుకునేందుకు ఆరేళ్లక్రితం మళ్ళీ ప్రపంచయాత్రకు బయలుదేరింది. అలా బాబాలీనా వియత్నాం చేరుకున్నప్పుడు మరో రష్యా పర్యాటకురాలు ఎకటెరినా పసినాను ఆమెను కలుసుకుంది. పండుటాకు లాంటి బాబాలీనా యాత్రా విశేషాల గురించి ఎకటెరినా పసినాను తన ఫేస్‌బుక్‌లో పోస్ట్ చేసేవరకు బాబా లీనా గురించి ఎవరికీ తెలియదు. దాంతో ఆమె యాత్ర సెన్సేషన్‌గా మారింది.



ప్రస్తుతం ఆమె ఒంటరిగానే ప్రపంచ యాత్ర చేస్తోంది. ఇప్పటికే పోలాండ్, వియత్నాం, జర్మనీ, చెక్‌రిపబ్లిక్ దేశాలు చుట్టబెట్టేసింది. 90వ పుట్టినరోజు నాటికి డొమినికన్ రిపబ్లిక్ చేరుకోవాలని నిర్ణయించుకుంది. పెన్షన్ డబ్బు, కుటుంబ సభ్యుల సహకారంతో బాబాలీనా విజయవంతంగా తన యాత్ర కొనసాగిస్తోంది.

-నర్మద వాసిరెడ్డి

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## ఆస్థమా సమస్యకు సరైన వైద్యం



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

ప్రస్తుత శీతాకాలంలో శ్వాసకోశ సంబంధిత వ్యాధులతో బాధపడేవారి సంఖ్య అధికంగా ఉంటుంది. అందునా 'ఆస్థమా' వ్యాధితో బాధ పడేవారి సమస్యలు చాలా వర్ణనాతీతంగా ఉంటాయి. ఈ వ్యాధిగ్రస్తులలో - బయటి వాతావరణం కాస్త చల్లగా మారిందంటే చాలు, కొందరు వృత్తిరీత్యా తమ పనులను నిర్వహించలేని పరిస్థితి. మరికొందరైతే ప్రతినిత్యం తగినన్ని వ్యాయామాలు చేసినా కూడా 'ఆస్థమా' వ్యాధి తీవ్రత నుండి తప్పించుకోలేరు. దాంతో రోజువారీ దినచర్యల పరంగా కూడా వీరు తీవ్రఇబ్బందులను ఎదుర్కొంటారు. మనం నిత్యం వ్యాయామం చేస్తూ, దైనందిన కార్యక్రమాలను చురుకుగా నిర్వహించగలిగినప్పుడే మన ఆరోగ్యం సమతుల్యంగా ఉంటుంది. కానీ ఈ చురుకుదనం 'ఆస్థమా' సమస్య మూలంగా కొంతమందిలో శాపంగా మారుతుంది.



ఇతర వైద్యవిధానాలలో 'ఆస్థమా' వ్యాధికి సంపూర్ణ చికిత్స అందుబాటులో లేదు. ఆయా చికిత్సల ద్వారా కేవలం ఆస్థమా లక్షణాలను మాత్రమే నియంత్రించగలం. కానీ హోమియో చికిత్స ద్వారా ఈ 'ఆస్థమా' సంపూర్ణంగా నయం కావటంతో, అన్ని రకాల ప్రతికూల అనారోగ్యకర పరిస్థితులను సైతం ఎదుర్కొనే విధంగా శరీర రోగనిరోధక శక్తి బలోపేతం కాబడటం ద్వారా మనల్ని మనం కాపాడుకునే అవకాశం ఉంది.

'ఆస్థమా' అనేది ఊపిరితిత్తులకు సంబంధించిన ఒక దీర్ఘకాలిక ఆరోగ్య సమస్య. శ్వాసక్రియలో భాగంగా - సాధారణంగా మనం పీల్చుకున్న గాలి($O_2$) వాయుద్వారాల బ్రాంకై మరియు బ్రాంకియోల్స్ ద్వారా ఊపిరితిత్తుల్లోకి చేరుతుంది. అదేవిధంగా శరీరంలోని $CO_2$ బయటకు వెళ్ళిపోతుంది. ఈ వాయుద్వారాలు శోథమునకు గురి కాబడి, వాపు చెందటం ద్వారా, ఇవి సన్నగా, ఇరుకుగా మారి ఎక్కువ శ్లేష్మాన్ని (Mucus) ఉత్పత్తి చేయడాన్ని 'ఆస్థమా' అని అంటారు.

మన శరీరానికి సరిపడని పదార్థాలు గాలి ద్వారా పీల్చుకున్న వాయుద్వారాలు వాటికి బలంగా స్పందిస్తాయి. ఇలా స్పందించిన వాయుద్వారాల కండరాలు బిగించుకోబడతాయి. దీని వలన వాయుద్వారాలు కాస్త సన్నగా మారటం జరుగుతుంది. తదుపరి ఇవి శోథమునకు గురి అయి వాపు చెందడం ద్వారా మరియు సాధారణ స్థాయికి మించి శ్లేష్మాన్ని ఉత్పత్తి చేయడం వలన, అవి మరింత ఇరుకుగా మారి గాలి ఆవరణకు ఆటంకాలు ఏర్పడటం వలన 'ఆస్థమా' లక్షణాలు ఏర్పడతాయి.

**కారణాలు:** 'ఆస్థమా' వలన కలిగే కొన్ని లక్షణాల రీత్యా ఎటువంటి స్పష్టత లభించలేదు. కానీ జన్యుపరమైన లోపాలు, వంశపారంపర్యత మరియు వాతావరణ మార్పులు మొదలగు అంశాల సమ్మేళనం కారణంగా 'ఆస్థమా' వ్యాధి ఏర్పడుతుందని భావించడం జరుగుతోంది. 'ఆస్థమా' వ్యాధి బాధితుల వాయుద్వారాలు ఎప్పటికీ శోథమునకు గురి కాబడి ఉంటాయి. కానీ ఈ వ్యాధిని ప్రేరేపించే పరిస్థితులు ఎదురైనప్పుడు మాత్రమే 'ఆస్థమా' లక్షణాలు ఎక్కువగా కనిపిస్తాయి.

**ఆస్థమాను ప్రేరేపించే అంశాలు:** ఇవి అందరిలో ఒకే రకంగా ఉండవు. వివిధ సందర్భాలను బట్టి వేర్వేరుగా ఉంటాయి. • పూల మొక్కల నుండి వెలువడే పుప్పొడి రేణువులు, జంతుకేశాలు, దుమ్మూ-ధూళి, బొద్దింకలు • శ్వాసకోశ ఇన్‌ఫెక్షన్‌లు-ఫ్లూ, జలుబు మొ॥వి. • అధిక శారీరక శ్రమ-వ్యాయామాల వలన (Exercise-Asthma) • చల్లగాలి లేదా చల్లని వాతావరణం, వాతావరణ కాలుష్యం, పొగ త్రాగటం, కెమికల్స్, వృత్తిరీత్యా దుమ్మును ఎదుర్కోవడం (Occupational Asthma) • ఆస్ప్రిన్, బీటా బ్లాకర్స్ వంటి మందులు మరియు ఆహారాన్ని నిల్వ చేయుటకై ఉపయోగించబడే ప్రిజర్వేటివ్స్ • కొందరిలో అధిక మానసిక ఒత్తిడి మరియు మరికొందరిలో బలమైన భావోద్వేగాలకు (ఆనందం, దు:ఖం మొ॥వి) గురి అయినప్పుడు కూడా ఈ 'ఆస్థమా' ప్రేరేపించబడే అవకాశం ఉంటుంది.

**లక్షణాలు:** 'ఆస్థమా' వ్యాధి లక్షణాలు వ్యక్తి-వ్యక్తికీ వేర్వేరుగా ఉంటాయి. • శ్వాస తీసుకోవడంలో ఇబ్బంది, ఛాతీ బిగువుగా లేదా నొప్పిగా అనిపించటం. • శ్వాస బయటకు వదులుతున్నప్పుడు పిల్లి కూతల వంటి శబ్దాలు వినిపించడం. • దగ్గు: 'ఆస్థమా' వలన కలిగే దగ్గు, రాత్రివేళలో మరియు వేకువజామున అధికంగా ఉంటుంది. • శ్వాస ఆడకపోవడం, దగ్గు వంటి కారణాలతో నిద్ర ఇబ్బందికరంగా మారుతుంది.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** రోగి వ్యక్తిగత లక్షణాలు మరియు కుటుంబ ఆరోగ్య చరిత్రను తెలుసుకోవటం ద్వారా 'ఆస్థమా'ను నిర్ధారించవచ్చు.
• ఛాతీ X-Ray, లంగ్ ఫంక్షన్ టెస్ట్ (Spirometry), అలర్జీ పరీక్షలు • బ్రాంకో ప్రొవొకేషన్-వాయుద్వారాల సున్నితత్వాన్ని తెలుసుకునే పరీక్ష
• పీక్ ఫ్లో టెస్ట్ - మనం లోనికి పీల్చుకున్న గాలి ఊపిరితిత్తుల ద్వారా ఎంత వేగంగా బయటకు వెళుతున్నదో తెలుసుకునే పరీక్ష
• రక్తపరీక్షలు మరియు స్ఫుటమ్ ఇసినోఫిల్స్ పరీక్షలు నిర్వహించటం ద్వారా 'ఆస్థమా' వ్యాధిని నిర్ధారించవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో మాత్రమే అందబడే అధునాతనమైన జెనెటిక్ కాన్స్టిట్యూషనల్ సిమిలిమం చికిత్సా విధానం ద్వారా ఎలాంటి శ్వాసకోశ సంబంధిత సమస్యలనైనా సమర్థవంతంగా నయం చేయటం జరుగుతుంది. ఈ విశిష్ట పద్ధతిలో రోగి యొక్క మానసిక-శారీరక తత్వాలను పరిగణనలోకి తీసుకుని సరైన చికిత్సను అందించడం ద్వారా 'ఆస్థమా' వ్యాధిని పూర్తిగా నయం చేయవచ్చు. అంతేకాకుండా హోమియో మందుల ద్వారా రోగనిరోధక శక్తిని మెరుగుపరచి, తద్వారా ఎలాంటి 'ఆస్థమా' ప్రేరేపకాలు ఎదురైనప్పటికీ - మరోసారి తిరగబెట్టని రీతిలో ఈ 'ఆస్థమా' సమస్యను సంపూర్ణంగా నయం చేయటం జరుగుతుంది.

టోల్ ఫ్రీ 1800 108 1212 | కన్సల్టేషన్ ఉచితం 955 000 1199 | www.homeocare.in

**లాలసకథనం పూర్తిగా విన్న నంది, మాటలు మరిచిపోయిన వాడిలా ఆమెనే చూస్తూ ఉండిపోయాడు. ఆమె పెదవులు పలికే నిజానికి పట్టిన స్వచ్ఛమైన అద్దాల్లా ఉన్నాయి ఆమె పాలవిలోచనాలు. కామరూప నగరంలో పుట్టిపెరిగినప్పటికీ తను రాకుమారి లాలసను గుర్తుంచుకునేట్టుగా ఎప్పుడూ చూడలేదు. కామరూపాంబిక ఆలయానికి వచ్చిన సమయాల్లో చక్రవర్తి నిర్వహించే సార్వజనిక ఉత్సవాల్లో మాత్రమే రాణివాస స్త్రీలు పౌరులకు కనిపించేవారు. అదీ దగ్గర నుంచి కాదు, దూరం నుంచి!**



అర్ధరాత్రి సమయంలో ఆమెను ఆదుకున్న సమయం నుండీ లాలసను ఎక్కడో, ఎప్పుడో చూసినట్టు లీలగా అనిపిస్తోంది గానీ, లాలసను రాకుమారిగా తను ఊహించలేక పోయాడు. స్వయంవరం నాడు కామరూప యువ రాణి విచిత్రంగా అంతర్ధానమైందట అన్న వదంతి తమ కళింగ రాజధానిలో వ్యాపించిన విషయం అపరంజి ద్వారా తను విన్నాడు. ఆ వదంతి తనకు ఆశ్చర్యాన్ని కలిగించింది. ఎందుకంటే అది అంత ర్ధాన వార్త. కానీ ఇప్పుడు తెలిసిన సత్యం తనకు ఆశ్చర్యంతో బాటు ఆగ్రహాన్ని కలిగిస్తోంది. ఎందు కంటే ఇది అపహరణవార్త! ఒక అబలను, నిస్సహాయురాలిని ఒక స్వార్థపరుడు అపహ రించాడు. అది రాక్షస చర్య. పైశాచిక చర్య. సభ్య మానవులంతా నిందించాల్సిన నీచ చర్య.

"మీకు పూర్తి నిజాన్ని వివరించాను. నా ఆరాధ్యదేవత కామరూపాంబిక సాక్షిగా నన్ను కన్నతల్లి సాక్షిగా, కన్నతండ్రి సాక్షిగా ప్రత్యక్షర సత్యం వినిపించాను. అతి దీన మైన నిస్సహాయస్థితిలో ఉన్నాను. కళింగరత్న నన్ను అన్వేషించి పట్టుకుంటాడు. నేను.. నేను... అబలను. అతను మహాబలుడు. యువరాజు. కామరూపరాజ్యం చేరేదాకా నన్ను ఆపద వెంటాడు తూనే ఉంటుంది. నన్ను కాపాడండి.." మౌనంగా నందిని చూస్తూ దీనంగా అడిగింది లాలస.

నంది మాట్లాడకుండా ఆమె కళ్ళల్లోకి చూశాడు.

"నిజం చెప్తే రక్షిస్తానన్నారుగా.." లాలస అంది.

నంది మౌనంగా పైకిలేచాడు. వాతాయనం ముందుకు వెళ్లి తోటలో ఉన్న రావిచెట్టువైపు చూస్తూ ఉండిపోయాడు. రావి ఆకులు గాలికి నిర్విరామంగా టపటప కొట్టుకుంటున్నాయి. అతని మస్తిష్కంలోని అలజడిని ప్రతిధ్వనిస్తు న్నాయి టపటప రాలుతున్న రావి ఆకులు!

"..నన్ను కాపాడండి.. నిజం చెప్తే రక్షిస్తా నన్నారుగా..? లాలస మాటలు అతని చెవుల్లో గింగురుమన్నాయి. కదిపిన పుట్టలోంచి కందిరీగల్లా నందిలో సలుపు పుట్టించే ఆలో చనలు లేస్తున్నాయి. నంది ఒక్కసారిగా కళ్లు మూసుకున్నాడు. ఆలోచనలు రకర కాల ఆకారాలు ధరిస్తున్నాయి. లాలస కేవలం కామరూప యువరాణి మాత్రమే కాదు; లాలస కేవలం కుబేరవర్మ దంపతుల కూతురు మాత్రమే కాదు; లాలస తన తండ్రినీ, తననూ, చెల్లినీ జీవచ్ఛవాలుగా, నడపీనుగులుగా మార్చిన ఒక నిరంకుశ చక్రవర్తి

# మహానంది

-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287



ఏకైక పుత్రిక! తన కుటుంబాన్ని సర్వనాశనం చేసిన నిరంకుశుడి కుమార్తెను తను రక్షించాలా? ఆమెను తన ఆధీనంలో ఉంచుకుని తన చెల్లి దీపాంకురలా ఊడిగం చేయించుకోవాలా?

ఏం చేయాలి? రక్షించాలా? శిక్షించాలా?

రక్షించి మాట నిలుపుకోవాలా? శిక్షించి ప్రతీకారం చేయాలా?

మొదటిది ధీరుడూ, ఉదాత్తుడూ అయిన మనిషి చేసే పని.

రెండవది పగతో రగిలిపోతున్న సామాన్యుడు చేసే పని. యదార్థానికి తనకు గానీ, తన కుటుంబానికి గానీ లాలస ఏ హానీ చేయలేదు! తమకు అన్యాయం చేసింది ఆమె తండ్రి. చేలో మేసింది ఆవు. ఎక్కడో దూరంగా గెంతులేస్తూ ఆడుకుంటూ ఉండిపోయింది లేగదూడ. శిక్షించాల్సింది దేనిని? ఆవునా? దూడనా? కన్నతండ్రి చేసిన దానికి కన్నబిడ్డను శిక్షించడం ధర్మమా!

'ధర్మంకాదు!' అంటూ బొబ్బలెడుతున్నాడు నందిలోని సభ్యమానవుడు. నందిలోని ధీరుడూ, ఉదాత్తుడూ అయిన నాయకుడు ఆలోచనా సాగరంలో మునకలు వేస్తున్న నంది మస్తిష్కంలో ఒక్కసారిగా ఏదో తళుక్కుమంది. నీలాకాశంలో అప్పుడే పుట్టిన నక్షత్రంలాగా..

ఒక గురుతరమైన మహాబాధ్యత తనమీద ఉంది. తన తండ్రిని చెరలో బంధించడానికీ, తన చెల్లెలిని దాసీదానిగా రాణివాసంలో బంధించడానికీ, తనను దేశభ్రష్టుణ్ణి చేయడానికీ మూలమైన కుట్ర వుంది. ఆ కుట్రను తాను ఛేదించాలి. కుట్రకు కేంద్రమైన కామరూప రాజధాని నగరానికి దూరంగా, కామరూపరాజ్యానికి వెలుపల ఉంటూ ఆ కుట్రను ఛేదించడం సాధ్యం కాదు. కామరూప రాకుమారిని తన వద్దకు పంపిస్తూ, విధి తనకు దారి చూపుతోందా? కుట్రను సమూలంగా ఆయుధంలాగా ఆమెను విధి తనకు అందించిందా? ఆమె తండ్రిమూలంగా తన కుటుంబానికి జరిగిన అన్యాయాన్ని ఆమెకి వివరించి పగ, ప్రతీకారం అనే కారణాలతో ఆమెను తిరస్కరించి వెళ్ళగొడితే ఏం జరుగుతుంది? ఆమె ఆపదకు బలి అయిపోతుంది! పగతీర్చుకున్న తృప్తి తనకు కలుగుతుంది. నిజానికి అది 'తృప్తి' కాదు, 'ఛాయాతృప్తి', భ్రాంతి! అది ఏకోన్ముఖం.

ఆమెను కాపాడితే! ఒక అబలను, నిస్సహాయురాలిని రక్షించిన తృప్తి లభిస్తుంది. అది నిజమైన తృప్తి. ఛాయాతృప్తి కాదు, భ్రాంతి అంతకన్నా కాదు! లాలస రక్షణ ఏకోన్ముఖం కాదు, ద్విముఖం. ఒక నిస్సహాయురాలైన లాలసకు రక్షణ లభిస్తుంది. ఆమె క్షేమంగా తల్లిదండ్రులను చేరుకుంటుంది. రెండవ ఫలంగా తనకు ఒక అవకాశం లభిస్తుంది. తనకు లభించిన అవకాశం ముందు ముందు సత్ఫలితం ఇవ్వకపోయినాసరే నిస్సహాయురాలిని రక్షించిన నిజమైన శాంతి తనలో వికసించి సగర్వంగా తృప్తి అనే సువాసనను వెదజల్లుతూ ఉంటుంది. లాలస తనను శరణు కోరింది. శరణు అన్న వ్యక్తిని ఆదుకోవడం మానవధర్మం. ముఖ్యంగా వీరధర్మం! నిర్ణయం నంది హృదయాన్ని ఉప్పెనలా కమ్మేసింది. చిరునవ్వుతో లాలసవైపు తిరిగాడు.

●●●

అడుగుల చప్పుడు చేస్తూ వేగంగా వస్తున్న వ్యక్తిని అయిష్టంగా చూస్తూ, తూగుటుయ్యాల మీద వెనక్కివాలాడు విదారకుడు.

"మామయ్య, మామయ్యా! ఆపద ముంచుకొచ్చేస్తోంది! నువ్వే ఆదుకోవాలి!" ఊయల దగ్గరగా ఆగుతూ ఆత్రుతగా అన్నాడు వచ్చిన వ్యక్తి ఉలూకుడు.

"నీకు ఎప్పుడూ వచ్చేవి ఆపదలే! అవి ముంచుకొచ్చేస్తూనే ఉంటాయి. పేరుకి తగ్గట్టే ఉంది నీ ప్రవర్తన. మా అక్కయ్య నీకు ఆ పేరెందుకు పెట్టిందో ఆ దైవానికే ఎరుక!" విదారకుడు విసుగు, వెటకారం కలిపి అన్నాడు.

"మహాలక్ష్మి వాహనమైన గుడ్లగూబపేరు పెడితే తన ఒక్కగానొక్క కొడుకు నెత్తిమీద ఆ తల్లి నాట్యం చేస్తుంటుందని అనుకుంది అమ్మ. ఆదిలక్ష్మి స్థానంలో "అప్పులక్ష్మి" తాండవం చేస్తోంది నానెత్తిమీద. తలరాత!" ఉలూకుడు అన్నాడు.

"ఇంతకీ ఇప్పుడు ఏమొచ్చింది? అక్క కొడుకు కదా అని అడిగినప్పుడల్లా అప్పుగా అడిగినంతా ఇస్తూ వచ్చాను. ఇంక.."

"నేను మేనల్లుడినీ, నువ్వు మేనమామవూ! ఇది పవిత్రమైన రుణానుబంధం మామయ్యా! దీని ముందు ఆర్థిక రుణం ఎంత? అప్పుగా తీసుకున్నా నీకు రక్షణ కల్పిస్తున్నానుగా? నువ్వు ఎన్ని అన్యాయాలు చేసినా, నిన్ను ఎవ్వడూ కన్నెత్తి చూడకుండా చూసుకుంటున్నానుగా?" ఉలూకుడు దెప్పుతూ అన్నాడు.

ఉలూకుడి వైపు ఎర్రగా చూశాడు విదారకుడు. "హు! చూసుకుంటున్నావు! నీ ముఖాన్ని అద్దంలో! ఇలా చూడు... అప్పులిచ్చిన చేతులూ పోయాయి, ఇచ్చిన సొమ్మూ పోయింది!"

ఉలూకుడు మేనమామ పాదాల దగ్గర తూగుటుయ్యాలమీద కూర్చుని, అర్థం కానట్టు చూశాడు. "చేతులు పోయాయా? సొమ్ము పోయిందా?"

"చూడు!" విదారకుడు రెండు చేతుల్ని నెమ్మదిగా ఎత్తే ప్రయత్నం చేస్తూ అన్నాడు. "ఇప్పుడిప్పుడే ఈమాత్రం కదపగలుగుతున్నాను. ఏ కీలుకి ఆ కీలు ఊడదీశాడు.."

"ఎవడు! అప్పుతీసుకున్న అష్టదరిద్రుడా?"

"కాదు" అన్నాడు విదారకుడు తల అడ్డంగా ఊపుతూ. "ఎవరో పరదేశీయుడు! సొమ్ము రాబట్టుకోవడానికి అపరంజి భోజనశాలకు వెళ్ళాను.." తన అంగరక్షకులకూ, తనకూ పరదేశీయుడైన యువకుడు చేసిన శాస్తిని విదారకుడు చిలవలు పలవలుగా వర్ణించి చెబుతుంటే ఉలూకుడు మౌనంగా ఆలకించాడు.

## జరిగిన కథ

కామరూపరాజ్య సర్వసైన్యాధ్యక్షుడు రుద్రాక్షుడిని రాజద్రోహిగా నిర్ధారించి యావజ్జీవ కారాగారశిక్ష విధించాడు మహారాజు కుబేరవర్మ. రుద్రాక్షుడి కొడుకు నందికి రాజ్యబహిష్కార శిక్ష విధిస్తాడు. పౌరుగురాజ్యంలో సత్రం నిర్వాహకురాలి ఆశ్రయం పొందుతాడు నంది. స్వయంవరం రోజున యువరాణి లాలసాదేవి మాయమవుతుంది. రాకుమార్తెను సుకర్మ ద్వారా కళింగ యువరాజు కళింగరత్న అపహరిస్తాడు. ఆమెను ఒక మందిరంలో ఉంచుతాడు. విషయం తెలుసుకున్న మహారాణి చేసిన తప్పు సరిదిద్దుకోమంటుంది. తమ పూజామందిరంలో ఉన్న కలశ చరిత్ర వివరిస్తుంది. కళింగరత్న తన ఉపాయాల్లో తానుండగానే, కురంగి సహాయంతో లాలస తప్పించుకుంటుంది. ఉలూకుడు ఆమెని వెతికేందుకు బయలుదేరతాడు. ఉలూకుడి నుంచి ఆమెను నంది రక్షిస్తాడు.

ఆ తర్వాత....

"పరదేశీయుడికి అంత పొగరా? వాడి సంగతి నేను చూసుకుంటానుగానీ, నన్ను ఈ ఆపద నుండి.."

"నీకు ఆపదలు వస్తూనే ఉంటాయి. ఆ ఆపదలన్నీ నా ఆపదలుగా నాకు దాపురిస్తూనే ఉంటాయి. వడ్డీ సంగతి వదిలేస్తే, మూలధనం మునిగిపోతోంది నీ చేతుల్లో!" విదారకుడు ఉక్రోషంగా అన్నాడు. "ఏమొచ్చింది? ఎందుకొచ్చింది?"

"అది రహస్యం మామయ్యా, అతి రహస్యం.." అంటూ ఉలూకుడు అటూఇటూ చూసి విదారకుడి తలవైపు చేరి తగ్గుస్వరంతో ప్రారంభించాడు. "యువరాజు కళింగరత్నంగారు ఒక కన్యను అపహరించి తీసుకువచ్చారు."

"యువరాజులకు అది సాధారణమే" విదారకుడు తేలిగ్గా అన్నాడు.

"ఆ పిల్ల పర్వతమందిరంలోంచి తప్పించుకుని పారిపోయింది.."

"అది కూడా సాధారణంగా జరిగేదే!"

"ఆ పిల్లను వెంటాడి, వేటాడి నిర్ణీత సమయంలోగా పట్టి తీసుకువచ్చే బాధ్యత నానెత్తిమీద మోపారు యువరాజులు.."

"అదీ సాధారణమే!"

"ఈ కార్యక్రమం అతి రహస్యంగా, మహా గోప్యంగా సాగాలి. రాజపరివారానికి తెలియకూడదు. అంటే రాజభటులను ఉపయోగించకోకూడదు. కొందరు యోధులను తోడుతీసుకుని పిల్లను అన్వేషించి బంధించి తీసుకురావాలి. ఆ యోధుల బత్తెం నేనే భరించాలట! నా అశ్రద్ధ వల్లే ఆ పిల్ల తప్పించుకుందని యువరాజుగారి నమ్మకం. అందుకే వ్యయమూ, ప్రయాసా నేనే భరించాలంటూ ఆజ్ఞాపించారు."

"సాధారణ విషయమే.." విదారకుడు నిర్లక్ష్యంగా అన్నాడు.

"అన్నీ సాధారణమే అయితే ఇక అసాధారణమేమిటి మామయ్యా?" ఉలూకుడు విసుగ్గా అన్నాడు.

"నీ తలనొప్పి నా నెత్తిన రుద్దటం!" విదారకుడు కసిగా అన్నాడు.

"నువ్వు తోడుగా తీసుకెళ్లే యోధుల వ్యయం నేనెందుకు భరించాలి?"

"భరించే అవసరం లేదు. రుణంగా ఇస్తే చాలు.." ఉలూకుడు దీనంగా అన్నాడు. "ఈసారికి ఆదుకో మామయ్యా! యువరాజుగారి రత్నాభరణాలైనా సంపాదించి నీ అప్పులన్నీ చెల్లించేస్తాను!"

"ఒక పనిచేస్తే నీకు అవసరమైనంతలో ఎంతో కొంత సొమ్ము సమకూరుస్తాను..." విదారకుడు సాలోచనగా అన్నాడు.

"ఒకటేమిటి? వంద చెప్పు మామయ్యా!"




"వాడు నా చేతుల్ని దాదాపుగా విరిచేశాడు. నా అంగరక్షకుల కీళ్లు ఊడదీశాడు. ఆ అపరంజి భోజనశాలలో నా పరువు తీశాడు. అంతటితో ఆగకుండా నా వద్ద అప్పు తీసుకున్న దరిద్రులందరినీ గుంపుగా వెంటబెట్టుకు వచ్చాడు. ఋణపత్రాల్ని, కుదువపెట్టిన ఆభరణాలన్నీ ఎవరివి వాళ్లకి నా కళ్ళ ముందే ఇచ్చేశాడు! నా ఇల్లు గుల్ల చేశాడు. నాకు వాడి చేతులు కావాలి!" విదారకుడు పళ్లు కొరికాడు.

"కాళ్ళు కూడా తీయించేస్తాను. ఎవడు వాడు? ఎక్కడుంటాడు?" ఉలూకుడు ఆవేశంగా అన్నాడు.

"వాడిపేరు శివనంది అని విన్నాను. ఆ అపరంజి, వాడికి తన కొంపలో ఆశ్రయం ఇచ్చిందట! దానికీ, దాని మొగుడికీ వాడు అంగరక్షకుడు! వాణ్ణి నాకు బలివ్వాలి నువ్వు! అంతవరకూ నాకు శాంతి లేదు. వాడు చస్తే కానీ నాకు సొమ్ము రాదు!"

ఉలూకుడు ఉద్రేకంగా లేచాడు. "వాడికి పరదేశ చోరుడు అనే ముద్రవేస్తాను. రాజభటుల్ని తీసుకెళ్తాను. కాళ్లూ, చేతులూ విరిచేసి, చెరసాలలో పడవేయిస్తాను! విచారణ ఉండదు! విడుదలా ఉండదు! చాలా!"

"చెరలో వేసేముందు ఒకసారి వాణ్ణి నావద్దకు తీసుకురా! కాళ్లూ చేతులూ విరిగిన స్థితిలో వాణ్ణి నేను తనివితీరా చూడాలి! నా చేతుల్ని శిక్షించిన వాణ్ణి నా కాళ్లతో శిక్షించాలి!"

"ముందు వాణ్ణి నీ పాదాల ముందు పడేస్తాను, మామయ్యా! నీ మేనల్లుడి శక్తి నీకు తెలీదు!" ఉలూకుడు గర్వంగా అన్నాడు.

"వాణ్ణి అంత తేలికగా తీసుకోవద్దు ఉలూకా! నన్నూ, నా అంగరక్షకుల్నీ ఒంటిచేత్తో నుజ్జునుజ్జు చేశాడు! పదిమంది వీరాధివీరుల్ని తీసుకెళ్లు! వాణ్ణి తీసుకురా! నీక్కావాల్సింది తీసుకెళ్లు!

"ముల్లె సిద్ధంగా ఉంచు మామయ్యా! వాణ్ణి నీకు మంచి ధరకు అమ్మేస్తాను ఉలూకుడు గుమ్మంవైపు తిరిగాడు."

•••

మృదంగవాద్య సమ్మేళనంలా డెక్కల శబ్దం చేస్తూ, విసురుగా ఆవరణలోకి వచ్చి ఆగాయి అశ్వాలు. అశ్వాల చప్పుడు విన్న అపరంజి గుమ్మంలోకి వచ్చింది. కాసేపట్లో వంటవాడి సహాయంతో వచ్చిన ఆమె భర్త మోదకుడు ఆమెభుజం మీద చేతిని వేసి, విరిగిన కాలును పైకెత్తుకుని ఒంటి కాలి మీద నిలుచున్నాడు.

అపరంజి అశ్వం మీదున్న రాజభటుల్ని తేరిపార చూసింది. ఆరుగురు భటులు. శిరస్త్రాణాలూ, ఖడ్గాలూ ధరించి ఉన్నారు. వాళ్ళ ముందు, వాళ్ళ నాయకుడిలా గుర్రం మీద కూర్చున్నాడు ఉలూకుడు. అతను విదారకుడి మేనల్లుడని అపరంజి దంపతులకు తెలుసు.

ఉలూకుడు గుమ్మంలో నిలుచున్న దంపతుల్ని ఎగాదిగా చూశాడు... "ఎక్కడ వాడు?"

గుడ్లురిమి చూస్తున్న ఉలూకుడిని ప్రశ్నార్థకంగా చూసింది అపరంజి.

"ఎవరు?"

"వాడే, నీ అంగరక్షకుడు! శివనంది! పరదేశ చోరుడికి ఆశ్రయం కల్పించావు! అది రాజద్రోహం! శిక్ష అనుభవిస్తారు, నువ్వూ నీ మొగుడూ!" ఉలూకుడు గద్దించాడు.."ఎక్కడ? ఎక్కడున్నాడు వాడు? రమ్మను!"

"ఎందుకు? అతనితో నీకేం పని?" అపరంజి ధైర్యంగా అడిగింది.

"వాడితో నాకేం పనిలేదు! నాక్కావాల్సింది వాడి కాళ్లూ చేతులూ! నగర పౌరుల మీద చేయి చేసుకున్నాడు వాడు! అది నేరం!

"నీ మేనమామగారు నా కాలు విరగ్గొట్టారు. ఇది నేరం కాదా? కట్టుతో ఉన్న కాలు చూపిస్తూ అన్నాడు మోదకుడు.

"ఇచ్చిన సొమ్ము ఎగ్గొడితే ఎవడైనా కాళ్లు విరగ్గొడతాడు!" ఉలూకుడు వెటకారంగా అన్నాడు. "ముందు బైటకి రమ్మను! ఎక్కడ దాక్కున్నా వాణ్ణి వదిలిపెట్టం!"

"ఇటు తిరుగు! నీ వెనకే దాక్కున్నా!"

అపరిచితుడి కంఠధ్వని విని ఉలూకుడు తటాలున తలతిప్పి చూశాడు. చిన్న ఒంటెద్దు బండి మీద సరుకుల మూటలు వేసుకుని విపణివీధి నుంచి అప్పుడే ఆవరణలోకి వచ్చిన నందిని అపరంజీ, మోదకుడూ ఆందోళనగా చూస్తున్నారు.



భటుల గుర్రాలూ, ఉలూకుడి గుర్రమూ నందివైపు తిరిగాయి. ఉలూకుడు కళ్లు చిట్లిస్తూ నందిని తదే కంగా చూశాడు.

"మొన్న రాత్రి పారిపోతున్న నేరస్థురాలు ఉప వీధిలోకి వెళ్లిందంటూ నన్ను తప్పుదారి పట్టిం చింది నువ్వేగా?"

"ఉపవీధిలోకి వెళ్లిందన్నాను. అది తప్పుదారి అని నాకు తెలీదు.." నంది చిరునవ్వుతో అన్నాడు.

నంది మారుమాట్లాడకుండా కిందకు దూకి, ఉలూకుని వైపు చూశాడు.

"నిన్ను బంధిస్తున్నాం. రాజాజ్ఞ!" ఉలూకుడు హెచ్చరికగా అన్నాడు.

"ఎందుకు?"

"గౌరవనీయులైన ఈ నగరపాలకుల్ని నువ్వు శారీరకంగా హింసించావు. అక్రమంగా, అనధికారి కంగా మా నగరంలో ప్రవేశించి నివసిస్తున్నావు. ఈ రెండూ అపరాధాలే! నువ్వు పరదేశ చోరుడివి! అది మరొక అపరాధం. అందుకు బంధిస్తున్నాం!" అంటూ ఉలూకుడు భటులవైపు చూశాడు.

"ఊ! అపరాధిని బంధించండి!"

ఇద్దరు భటులు గుర్రాలమీద నుండి కిందకు దూకారు. ఒకరిచేతిలో జంటకంకణాల ఆకారంలో సంకెళ్ళున్నాయి. ఇద్దరూ నందిని సమీపించారు. సంకెళ్ళున్న భటుడు నంది మీదకు వెళ్ళాడు.

"చేతుల్ని వెనక్కి పెట్టు!" నంది రొమ్ముమీద నిర్లక్ష్యంగా బలంగా అరచేత్తో హెచ్చరించాడు ముందు నిలుచున్న భటుడు. నంది చేతుల్ని వెనక్కి పెట్టు కుంటూ భటుడివైపు చిరునవ్వు నవ్వాడు. ముందు నిలుచున్న భటుడు పొరపాటు చేస్తున్నాడు! తన వెనకవైపు వెళ్లిన భటుడు వదిలిన ఊపిరి వెచ్చగా నంది మెడమీద సోకింది. ఆ భటుడూ పొరపాటు చేస్తున్నాడు, తనకు కావాల్సింది అదే!

నోరు మెదపకుండా, తిరగబడకుండా లొంగి పోతున్న నందిని ఆశ్చర్యంగా, ఆందోళనగా చూస్తు న్నారు అపరంజి దంపతులు. బంధిస్తే అతడిని చెరలో పడవేస్తారు. విడుదల దైవానికే ఎరుక!

నంది తలను కొద్దిగా ముందుకు వాల్చాడు. మరుక్షణం అతని మెడనరాలు పురెక్కిన నులకల్లా బిగుసుకున్నాయి. భటుడి ఊపిరి మళ్లీ మెడమీద వెచ్చగా సోకింది. నంది తల తటాలున వెనక్కి జరిగింది. ఇనుప గదలాగా భటుడి ముఖాన్ని తాకింది. ఫట్‌మని చప్పుడైంది. భటుడు చెవులు చిల్లులు పడేలా కెవ్వుమన్నాడు. అతడి పోటుకు వాడి ముక్కు ఎముక పొంగింది, నందికి తెలుసు. నంది కుడి చెయ్యి మెరుపులా కదిలింది. తన ముందు నిలుచున్న భటుడు సహచరుడి స్పందన నుంచి కోలుకునేలాగా అతని ఒరలోని కత్తి పిడిని నంది వేళ్లు పట్టుకున్నాయి. అదే క్షణంలో అతని కాలు పైకి లేచింది. భటుడి పొట్టమీద బలంగా తన్నాడు నంది. భటుడు విసురుగా వెల్లకిలా పడి పోయాడు. అతని తల గుర్రం వెనక కాలు దగ్గరగా నేలకు తాకింది. బెదిరిన గుర్రం బలంగా కాలు విసిరింది. భటుడి తల మీద పగలేసిన కొబ్బరి కాయలా చప్పుడు చేసింది.

అపరంజీ, మోదకుడూ ఆశ్చర్యంగా చూస్తు న్నారు. నందికి సంకెళ్ళు వేయబోయిన భటుడు ముఖాన్ని దోసిట్లో దాచుకుని మూలుగుతున్నాడు. దోసిట్లోంచి నెత్తురు బొట్లు బొట్లుగా నేలమీదికి కారుతోంది. ఇంకా గుర్రాల మీదే ఉన్న ఆ నలుగురు భటులూ, ఉలూకుడూ తమ ముందు ప్రత్య క్షమైన దృశ్యాన్ని నివ్వెరపాటుతో చూస్తూ, విగ్రహాల్లా ఉండిపోయారు. ముందుగా ఉలూకుడు తేరుకున్నాడు. భటులవైపు ఉరిమి చూశాడు.

"చూస్తారేం! బంధించండి వాణ్ణి!" ఉలూకుడు అన్నాడు.

నలుగురు అశ్వికులు కిందకి దూకారు. ఒర ల్లోంచి కత్తులు దూస్తూ నందివైపు పరిగెత్తారు. సాయంకాలం ఎండలో నంది చేతిలోని ఖడ్గం తళుక్కున మెరుస్తూ, మెరుపుతీగలా కళ్ళు చెదిరే వేగంతో కదుల్తోంది. ఆ వేగాన్ని కళ్లతో అంచనా వేయలేక, కత్తులతో ఆపలేక చూస్తూ ఉండిపో యారు, ముందున్న ఇద్దరు భటులూ.

కాసేపట్లో భటులు నలుగురూ నందికి నలు వైపులా సర్దుకుని ఖడ్గ చాలనం ప్రారంభించారు. వాళ్ళ కత్తులలో శక్తి ఉండవచ్చుగానీ చేతులలో, తన చేతిలో ఉన్నంత శక్తి లేదు, నందికి తెలుసు. తన తండ్రీ , తాతా తనకు అద్భుతమైన శక్తినిచ్చే వ్యాయామాలు నేర్పించారు. నిరంతర శిక్షణ తన శరీరాన్ని రాటుదేల్చింది. నంది చేతిలోని కత్తి కొద్దిగా పైకి తేలింది. అతను మెరుపులా గుండ్రంగా తిరి గాడు. లోహం లోహాన్ని తాకుతున్న శబ్దం చుట్టూ వ్యాపించింది. రెప్పపాటులో భటుల శిరస్త్రాణాలు నాలుగూ గాలిలో ఎగురుతూ నలువైపులా పడ్డాయి. తలలు తెగిపోతాయేమో అని భయపడిపోయిన భటులు తేరుకోవడానికి కొన్ని క్షణాలు పట్టాయి.

నంది చేతిలో నాట్యం చేస్తున్న ఖడ్గానికి ఆ వ్యవధి చాలు! అది మెరుపు తీగలా కదిలింది. ఖడ్గ యోధుల్నీ, ఉలూకుడినీ, అపరంజి దంపతులనూ ఆశ్చర్యానికి గురిచేస్తూ నాలుగు కత్తులూ చేతుల నుండి జారిపోయి దూరంగా పడిపోయాయి. భటుల కళ్ళు విచ్చుకుంటూ ప్రాణభయంతో చూశాయి. నంది చేతిలో కదను తొక్కిన కత్తి చేస్తున్న సైగను అర్థం చేసుకున్న భటులు, నంది ఎదురుగా ఒకరి పక్కన ఒకరు నిలబడి ఆందోళనతో చూశారు.

"కిందపడి మూలుగుతున్న ఇద్దరు సహచరుల్ని వాళ్ల గుర్రాలమీద అడ్డంగా పడవేయండి! ఊ!" నంది హుంకరించాడు.

ఇద్దరేసి భటులు ఒక్కొక్కర్నీ లేవనెత్తి వాళ్ల అశ్వాల మీద అడ్డంగా పడుకోబెట్టి ప్రశ్నార్థకంగా నందివైపు చూశారు.

## 'ఖైదీ' పాపకి కొత్త కష్టాలు!

*నిన్న మొన్నటి వరకూ రాయ్‌లక్ష్మికి దక్షి ణాదిన హీరోయిన్ అనే గుర్తింపు ఉంది. ఎన్ని ఐటెంసాంగ్‌లు చేసినా అడపాతడపా హీరో యిన్‌గానో, లేక దానికి సమానమైన పాత్రనో చేసేది. 'ఖైదీ నంబర్ 150' విడుదల తరువాత రాయ్‌లక్ష్మిని ఐటెంసాంగ్స్‌కే ఎక్కువ అడుగు తున్నారట! రెమ్యునరేషన్ ఎంత కావాలంటే అంత ఇస్తామంటూ ముందుకొస్తున్నారట! కొందరైతే హీరోయిన్ కన్నా కూడా ఎక్కువ సమర్పించుకుంటామంటున్నారట! ఈ డిమాండ్ ఆనందంగానే ఉన్నా హీరోయిన్‌గా కెరీర్ ముగిసిపోతోందేమోనన్న భయం రాయ్ లక్ష్మిని వెంటాడుతోందట! డబ్బుకోసం ఐటెం సాంగ్స్ చేయాలా? లేక హీరోయిన్‌గా కెరీర్ కోసం డబ్బును త్యాగం చేయాలా? అన్నది రాయ్‌లక్ష్మి తేల్చుకోలేకపోతోందట! మొత్తానికి 'ఖైదీ' పాపకి కొత్తరకమైన కష్టాలు మొదలయ్యా యని సినీజనాలు అంటున్నారు.*

"ప్రాణాలు నిలుపుకోవాలనుకుంటే మీ గుర్రా లెక్కి తిరిగి చూడకుండా వెళ్లిపోండి!"

భటులు ఉలూకుడివైపు ఒకసారి చూసి, తమ గుర్రాలు ఎక్కేశారు. వాళ్ళు అధిరోహించిన గుర్రాలు నాలుగూ ప్రధానద్వారం వైపు కదిలాయి. ఇద్దరు భటులనూ మూటలలాగా మోస్తున్న రెండు గుర్రాలు వాటిని అనుసరించాయి. వెళ్తున్న గుర్రాలనూ, నందినీ మార్చిమార్చి చూస్తున్నాడు ఉలూకుడు. నంది తనకు కొంచెం దూరంలో పడి ఉన్న ఖడ్గాన్ని అందుకున్నాడు. ఉలూకుడికి దగ్గరగా నడిచాడు. నంది కత్తి పిడి ఉలూకుడి వైపు ఉండేలా పట్టుకుని అతని వైపు నడిచాడు.

'కత్తి అందుకో, నేను నిరాయుధునితో యుద్ధం చేయను. పై నుంచే తలపడతావో, నేలకు దిగి యుద్ధం చేస్తావో నీ ఇష్టం!"

ఉలూకుడు మౌనంగా చూశాడు. అతని కళ్ళల్లో భయమూ, అవమానమూ, ఉక్రోషమూ కలుస్తూ విడిపోతూ కనిపిస్తున్నాయి.

నంది చేతిలోని కత్తి చివాలున గాలిని కోస్తూ చప్పుడు చేసింది, ఉలూకుణ్ణి ఆహ్వానిస్తూ.

ఉలూకుడు ఉలికిపడి చూశాడు. అతని పెదవులు అదిరాయి. "ఈ ఉలూకుడు యుద్ధం చేసేవాడు కాదు, చేయించే వీరనాయకుడు!"

నంది అతణ్ణి చిరునవ్వుతో చూశాడు. ఉలూకుడు నంది అందిస్తున్న కత్తిని అందుకుని దూరంగా విసిరిపారేసి అశ్వాన్ని వీధివైపు మళ్ళించాడు. ప్రధాన ద్వారాన్ని దాటాక, గుర్రాన్ని ఆపి, తలతిప్పి నందివైపు నిప్పులు కక్కుతూ చూశాడు.

"ఇల్లు అలికావు, ఇంకా పండగ అవలేదు! అవనివ్వను! నిన్నూ, నీకు ఆశ్రయం ఇచ్చిన ఇంటినీ దిగ్బంధం చేస్తాను!" ఉలూకుడు బిగ్గరగా అరిచాడు.

"నీకు స్వాగతం చెబుతున్నాను!" నంది నవ్వుతూ అన్నాడు.

ఒక్కసారి ఉరిమి చూసి, ఉలూకుడు తన గుర్రాన్ని అదిలించాడు.

కింద చెల్లాచెదురుగా పడిన శిరస్త్రాణాల్నీ, ఖడ్గాల్నీ తీసుకుని నంది గుమ్మంవైపు నడిచాడు. అన్నింటినీ ద్వారం పక్కన ఉన్న అరుగుమీద కుప్పగా పెట్టాడు. సహాయకుడు సరుకుల బండి వైపు వెళ్ళాడు.

నిలువెత్తు నివ్వెరపాటులా తననే చూస్తున్న అపరంజినీ, మోదకుడినీ, సహాయకుడినీ చిరునవ్వుతో చూశాడు. "భయపడ్డారా? భయం లేదు. లోపలికి పదండి!" అన్నాడు

"ఉలూకుడు మన ఇంటిని ముట్టడిస్తాడు..." మంచం మీద కూర్చుంటూ అన్నాడు మోదకుడు.

"అందుకు సందేహమా! మొన్న మేనమామ విదారకుడు దెబ్బతిన్నాడు. ఇప్పుడు తాను మట్టి కరిచాడు!" అపరంజి అంది.

"ఈసారి ఆ దుర్మార్గుడు సైన్యమంత బలగంతో వస్తాడు. కత్తిపట్టలేకపోయినా, కసి ఎక్కువ వాడికి!" మోదకుడు అన్నాడు.

"ఉలూకుడు రావడం నాకు ప్రమాదం.." గుమ్మం వద్ద నుంచీ సన్నగా వినిపించింది. అందరూ అటు చూశారు. లాలస గుమ్మంలో చట్రంలో చిత్రసుందరిలా నిలుచుంది. ఆమె ముఖంలో భయం ప్రస్ఫుటంగా ప్రత్యక్షమవుతోంది. నంది ఆమెనే చూస్తున్నాడు.

"చాటు నుంచి చూశాను. ఉలూకుడిని గుర్తుపట్టాను. అతను యువరాజు కళింగరత్న తొత్తు! నన్ను మళ్లీ చెరలో వేస్తారు. బలవంతంగా రాక్షస వివాహం చేసుకుంటాడు కళింగరత్న" లాలస కంఠం వణికింది.

"భయపడకండి. మిమ్మల్ని ఆ రాక్షసుల బారిన పడనివ్వను!" నంది ధైర్యం చెప్తూ అన్నాడు. లోపలికి రమ్మన్నట్టు తల ఊపాడు.

లాలస మంచం దగ్గరగా వచ్చింది. నంది అపరంజినీ, మోదకుడినీ చూస్తూ అన్నాడు. "మీరు ఇప్పటికే ఊహించి ఉంటారు. మీ యువరాజు అపహరించిన కామరూప రాకుమారి ఈమే! పేరు లాలస. ఆమె ఎవరో 'ఒంటరి యువతి' అని మాత్రమే మీకు చెప్పాను. మీ నుండి నిజం దాచడం ఇష్టం లేదు. నేను ఇక్కడ ఉండడం మీకూ, నాకూ, రాకుమారికీ ప్రమాదమే! రాకుమారికి మీ గృహం ఆశ్రయం అయిన విషయం అతి రహస్యంగా ఉంచండి. మీ పనివాళ్లనూ హెచ్చరించండి."

అపరంజీ, మోదకుడూ తలలు పంకించారు.

"మేమిద్దరమూ చీకటి పడగానే బయలుదేరుతాం.."

"నాయనా..శివనందీ, మెరుపులాగా వచ్చావు. మెరుపులాగే వెళ్ళిపోతున్నావు. నువ్వు ఎవరివో, ఎక్కణ్ణుంచీ వచ్చావో మాకు తెలీదు.." అపరంజి విచారంగా అంది.

"నా నిజమైన పేరు మాత్రం చెబుతాను. ఎక్కడి నుంచి వచ్చానో, ఎందుకు వచ్చానో చెప్పలేను. నాపేరు శివనంది కాదు, నంది. భవిష్యత్తు మనల్ని మళ్లీ కలుపుతుందని ఆశిస్తున్నాను. ఆకాంక్షిస్తున్నాను. అప్పుడు నా గురించి పూర్తిగా మీకు చెబుతాను. ఇప్పటికి క్షమించండి.."

"నందీ" మోదకుడి కంఠంలో ఉద్వేగం ఉలికింది.

"అపరంజి నాకు అక్క. అక్కనూ, బావనూ చూడ్డానికి తప్పకుండా వస్తాను!" నంది చిరునవ్వు నవ్వాడు.

నందివైపు లాలస ఆశ్చర్యంగా చూస్తోంది. అపరంజి కళ్ళు తడిగా మెరవడం ప్రారంభించాయి.

"ఈ రాత్రికో, రేపో ఉలూకుడు ఇబ్బడిముబ్బడిగా భటుల్ని తీసుకుని మీ ఇంటిని ముట్టడిస్తాడు. అతణ్ణి ఎలా వదిలించుకోవాలో, మిమ్మల్ని ఎలా రక్షించుకోవాలో చెప్తాను. ఆ ఉపాయాల్ని అక్షరం పొల్లుపోకుండా ఆచరణలో పెట్టండి. మీరు ఆడబోయే ఆ నాటకం మిమ్మల్ని నిజమైన కళింగపౌరులుగా, దేశభక్తులుగా, రాజభక్తులుగా ఉలూకుడికి చూపిస్తుంది.."

"నందీ, కనీసం నీది ఏ రాజ్యమో, ఏ ఊరో చెప్పునాయనా!" అపరంజి ప్రేమగా అడిగింది.

నంది ఆమెవైపు జాలిగా చూశాడు. "ఈ తమ్ముడిని నమ్ము, మళ్లీ వస్తాను. అన్నీ చెప్తాను. ఇప్పుడు మీరు ఆడాల్సిన నాటకం ఏంటో చెబుతాను. జాగ్రత్తగా వినండి" అంటూ నంది తగ్గు స్వరంతో చెప్పసాగాడు.

**(ఇంకా వుంది)**




*నే కుచ్చిళ్ళు పైకెత్తి*
*నువ్ఫాంటు మడతపెట్టి*
*సముద్ర తీరంలో నడుస్తున్నపుడు*
*మెత్తగా కాళ్ళకింద జారుతున్న ఇసుక*
*చల్లగా పాదాలు ముద్దుపెట్టి వెనక్కు తిరుగుతున్న కెరటాలు*

## వాడేడీ!

*మన కబుర్లు మోసుకుపోతున్న సముద్రపు హోరు*
*ఇపుడు కూడా నన్ను పలకరించాయి*
*వాడు రాలేదా! ఎలా ఉన్నాడంటూ*
*నేజోళ్ళు వేసుకుంటుంటే*
*మనం కూర్చుని కొబ్బరిచెక్కకొట్టి తిన్న*
*భవన్నారాయణస్వామి గుడి మెట్లు*
*నువ్వొక్కదానివే వచ్చావా! ఎంత మారిపోయావు*
*ఎన్నెన్ని గంటలు నామీద కాళ్ళాడుస్తూ కథలు చెప్పారు*
*అవన్నీ నాకు గుర్తున్నాయి సుమా*
*ఇపుడెందుకులే. నేకొంచెం బిజీ.*
*మీరిద్దరు వచ్చినపుడు వినిపిస్తానన్నాయి.*
*కుళాయి చెరువు పార్కులో*
*బల్లమీద కూర్చుని నేనప్పుడే వస్తున్న*
*చందమామను నీళ్ళు నిండిన కళ్ళతో చూస్తుంటే*
*ఎన్నెన్ని వేరుశనగ తొక్కలు పోశారో మీరు*
*ఇప్పుడేమిటి నువ్విలా ఒక్కదానివే*
*చేతులు ముడుచుకు కూర్చున్నావు*
*వాడు శనక్కాయలు కొనుక్కురావడానికి వెళ్ళాడా*
*రానీ ఈసారి మీచేతే ఎత్తిస్తానంది.*



*నాకు తెలుసు*
*నువ్వు మొహం చాటేశావని*
*కాని పాపం ఈ లోకం అమాయకురాలు*
*నేనెప్పుడు ఒంటరిగా కనపడ్డా*
*నిన్ను గూర్చి తప్పక అడుగుతోంది*
*వాడేడీ! అంటూ*

**-నారాయణమూర్తి తాతా. సెల్: 92980 04001**

# ఆస్తమా - నివారణ హోమియో చికిత్స

మానవుడు జీవించాలంటే ప్రతిక్షణం శ్వాసఎంతో ముఖ్యం.నీరు, ఆహారం లేకపోయిన కొన్ని రోజుల వరకు జీవించగలడు. కాని కొన్ని క్షణాలు శ్వాస లేక పోతే శరీరం నిర్జీవమైపోతుంది, స్వచ్ఛమైన గాలితో మంచి ఆరోగ్యం సమకూరుతుంది. ఆస్తమా వలన దైనందినజీవితంలోచాలాఇబ్బందులుఎదుర్కొంటారు. ఏవైనా వాతావరణంలోమార్పులు, ఆహారంలో మార్పులు, కాలుష్యం, పొగత్రాగడంవలన ఆస్తమా, విజృంభిం చడంతో చాలా ఇబ్బందులు ఎదుర్కొంటారు. ఎక్కడికి వెళ్ళాలన్నా అభద్రత భావనకు లోనవుతారు. ఆస్తమా వలన మరణించేవారు... బీదదేశాలలో, బీదకుటుంబా లలో ఎక్కువ. ఆస్తమా వలన హాస్పిటల్‌లో చేరే వారి సంఖ్య పిల్లలలో ఎక్కువ. ఆస్తమా అనగా సేచ్ఛ లేని శ్వాస, ఊపిరితిత్తులు, దీర్ఘకాలిక శ్వాసకోశ ఇబ్బందినే ఆస్తమా అంటారు. ముఖ్యంగా ఆస్తమా వ్యాధిగ్రస్తులలో అలర్జీ, రియాక్షన్ వల్ల శ్వాసకోశం లో, ఊపిరితిత్తులలో గాలి మార్గంలో శ్వాస పీల్చు కోవటంలో అవాంతరం ఏర్పడుతుంది. ఫలితం గా పిల్లికూతలు, దగ్గు, ఆయాసం, ఛాతీలో నొప్పి వస్తాయి.

**ఆస్తమాకు ముఖ్య కారణాలు:** చల్లగాలి (చల్లటి వాతావరణం) దుమ్ము,ధూళి, పొగ(సిగరెట్) అలర్జెన్స్, గడ్డిచెట్లు, ఫంగస్, పొల్యూషన్ అధిక శారీరక శ్రమ వైరల్ ఇన్‌ఫెక్షన్ పిల్లి, గుర్రం, కుక్క వంటి పెంపుడు జంతువుల విసర్జక పదార్థాలు శ్వాసకోశ ఇన్‌ఫెక్షన్స్ ముఖ్యంగా పిల్లలలో... **రోగ నిర్ధారణ:** వంశానుగత చరిత్ర, అలర్జీలు, ఎగ్జిమా, చర్మవ్యాధులు, చిన్నతనంలో శ్వాసకోశ వ్యాధులు శారీరక పరీక్షలు, ముక్కు గొంతు, ఛాతీ పరీక్షలు ఎక్స్-రే, కఫం పరీక్ష, పీ.ఎఫ్.టీ అలర్జీ చర్మపరీక్షలు:. అలర్జెన్స్‌ను ఇంజెక్షన్‌ద్వారా ఇచ్చి రియాక్షన్ చూడటం.

**స్పైరోమెట్రీ:** శ్వాస మీటర్‌ద్వారా పరీక్ష గుండె, ఊపిరితిత్తులు, రక్త లోపం, కిడ్నీ వ్యాధులు, జీర్ణకోశ వ్యాధులు ఏవైనా ఉంటే వాటి నిర్ధారణ.

ఆస్తమాతో జీవించడమెలా? 1.ఆస్తమాతో రోజు వారి పనులు చేసుకునేలాప్రోత్సహించాలి.

2.రాత్రి, పొద్దున్న వచ్చే శ్వాస ఇబ్బందులను నివారించటం, నిర్మూలించటం, తగ్గించటం.

3.ఎక్కువ శారీరక శ్రమలేని ఉపాధి ఏర్పాటు చేసుకోవటం. 4. దుమ్ము ధూళి, పొగ, చల్లటి వాతావరణం నుండి దూరంగా ఉండటం. 5.ప్లాస్టిక్ బ్యాగ్స్, కార్పెట్స్, బెడ్‌షీట్స్, బెడ్స్, బ్లాంకెట్స్‌లో డస్ట్‌మైట్స్ (చిన్నపరాన్నజీవులు) ఉంటాయి. కాబట్టి 10 రోజులకోకసారి ఎండలో వేయటం, నీటితో శుభ్రం చేయడం. 6. పెంపుడు జంతువులకు దూరంగా ఉండటం చేయాలి

**రోగనివారణ:**బ్రాంకోడైలేటర్స్, కార్టికో,స్టీరాయిడ్స్, యాంటీబయాటిక్స్, స్ప్రేమందులు.. వీటి వలన వెంటనే ఉపశమనం కలుగుతుంది. కాని వ్యాధి మళ్ళీ తిరగబెడుతుంది. ధీర్ఘకాలికంగా మందులు వాడటం వలన సైడ్‌ఎఫెక్ట్స్, పిల్లల పెరుగుదల లోపాలు, మానసికఆందోళన, జ్ఞాపకశక్తితగ్గటం,

**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**



బరువు పెరగటం వంటివి జరగవచ్చు. యోగా, మెడిటేషన్, చేయడం మంచిది. పొగత్రాగడం,

కాలుష్యపదార్థాలకు దూరంగా ఉండటం. స్వచ్ఛ మైన గాలి, నీరు ఉన్న ప్రదేశాలలో నివసించటం బాగా సివియర్ ఆస్తమా వచ్చే వారిలో అది ఆ ప్రదేశం ప్రభావంవల్ల కావచ్చు. ఇలాంటప్పుడు వారు స్థిరపడిన చోటునుంచి వీలైతే ఇతర ప్రదేశానికి మారడం మంచిది.

**హోమియోవైద్యం:**ఈ వైద్యవిధానం ద్వారా ఆస్తమాకు చక్కటి చికిత్సను అందించవచ్చు.ముఖ్యంగా పిల్లలలో అలర్జీలు, శ్వాసకోశ ఇబ్బంది లకు... వారి శారీరక, మానసిక విశ్లేషణ ద్వారా తగిన కాన్‌స్టిట్యూషనల్ ఔషదాన్నిగుర్తించి చికిత్సజరిపితేవ్యాధిని సమూలంగా తగ్గించ వచ్చును.

వాడదగిన మందులు:

ఆంటమ్‌టార్ట్, ఆంటిమోనిమ్, ఆర్స్ ఆర్సినిక్ ఆల్బ్, స్పాంజియా, నాట్రంసల్ఫ్, ఆరేలియా, కార్బోవెజ్.



# చర్మం మీద నల్లమచ్చలు, తెల్లమచ్చలు

చర్మం యొక్క వర్ణమునకు మన శరీరంలోని మెలానిన్ పిగ్‌మెంట్ కారణంగా ఉంటుంది. ఈ మెలానిన్ పిగ్‌మెంట్ ఉత్పత్తిలో ఉన్న హెచ్చుతగ్గుల వల్ల మన చర్మంలో తెల్లమచ్చలు లేదా నల్లమచ్చలు రావచ్చు. మెలానిన్ పిగ్‌మెంట్ వల్ల చర్మం, కంటికి, జుట్టుకి వర్ణం వస్తుంది.

నల్లమచ్చల రుగ్మతలు:

**1. పోస్ట్ ఇన్‌ఫ్లమేటరీ హైపర్ పిగ్మెంటేషన్:** గాయం లేక వాపు వచ్చి మానడం వల్ల చర్మంలో నల్లమచ్చలు రావడాన్ని పోస్ట్ ఇన్‌ఫ్లమేటరీ హైపర్ పిగ్మెంటేషన్ అని అంటారు. ఈ అవస్తకి తరువాతనే మొటిమలు, సోరియాసిస్, ఎటోపిక్ మరియు కాంటాక్ట్ డెర్మటైటీస్, లైకెన్ ప్లానస్ వచ్చే అవకాశం వుంది. దీని వల్ల తెల్లమచ్చలు అప్పుడప్పుడు వచ్చే అవకాశం వుంది.

**2. మెలాస్మా:** శరీరంలో ఏ భాగమైతే ఎక్కువగా ఎండకి బహిర్గతం అవుతుందో అక్కడ ఈ విధంగా గోధుమ వర్ణంలో వున్న మచ్చలు వస్తాయి. ముఖ్యంగా ముఖము, చేతులు, పాదాలు, ఈ రకమైన మచ్చలు గర్భిణిలో కూడా చూడవచ్చు. కాని ఇవి ప్రసవం తరువాత వాటికంతట అవే పోతాయి.

**3. సోలార్ లెంటిజినెన్స్:** ఎక్కువ అల్ట్రావైలెట్ లైట్‌కి (కిరణాలకి) బహిర్గతం అయినప్పుడు చర్మం మీద నల్లగా చిన్నచిన్న మచ్చలు వస్తాయి. ఇవి ప్రాథమికంగా, ముఖం, చేతులు, చాతి, వీపు, కాళ్ళమీద వస్తాయి.

**4. ఎఫిలైడ్స్:** ఇవి సాధారణంగా పిల్లల్లో ఎక్కువగా కనబడతాయి. పిల్లలు ఎక్కువ ఎండకి బహిర్గతం అవడం వల్ల వస్తాయి. ఇవి ఎరుపు రంగు నుండి గోధుమరంగులో ముఖము, మెడ, ఛాతి, చేతుల మీద వస్తాయి. ఇది స్వయంగా వాటికంతట అవే చలికాలం వచ్చేసరికి మానిపోతాయి.

తెల్లమచ్చలు:

**1. విటిలిగో:** మెలెనిన్ శాతం తక్కువ అవ్వడం వల్ల చర్మం మీద తెల్లమచ్చలు ఏర్పడతాయి. ఇవి మృదువుగా, తెల్లమచ్చలుగా ఏర్పడతాయి. ఇవి శరీరం మీద అక్కడక్కడ లేదా మొత్తం కూడా రావచ్చు.

**2.ఆల్బినిజమ్:** శరీరంలో పూర్తిగా మెలెనిన్ పిగ్మెంట్ లేకపోవడం వల్ల ఈ రకమైన తెల్లమచ్చలు వస్తాయి. జుట్టు రంగు మరియు చర్మం రంగు తెల్లగా మారిపోతుంది. వంశపారంపర్యంగా వచ్చే అవకాశం వుంది.

**3. టీనియా మెర్సికలర్:** ఇది ఒకరకమైన ఫంగల్ ఇన్‌ఫెక్షన్. దీనిలో చర్మంపై అనేక తెల్లమచ్చలు. పొరలలో కూడా వస్తాయి. ఈ మచ్చలు అప్పుడప్పుడు పెరుగుతాయి కూడా. చర్మం జిడ్డుగా ఉన్నవాళ్ళు, చెమటలు ఎక్కువగా వస్తున్నవాళ్ళు, వ్యాధినిరోధకశక్తి తగ్గినవాళ్ళు వీళ్ళకి ఇవి ఎక్కువ రావడానికి అవకాశం వుంది.

**నిర్ధారణ:** రోగి శరీర, మానసిక, వంశపారంపర్య చరిత్ర ఆధారంగా రోగనిర్ధారణ చేయువచ్చును.

**చికిత్సవిధానం:** ఆయుర్వేద వైద్యనుసారం దూషించబడిన వాత, పిత్త, కఫ దోషాలను సమస్థితిలోకి తీసుకుని వచ్చే ఔషదాలు అద్భుతమైన లేపనాలు, పంచకర్మ విధానాలు ఉన్నాయి. వ్యాధి ఆరంభంలోనే రోగి ఆలస్యం చేయకుండా వైద్యుల్ని సంప్రదించి వ్యాధిని పూర్తిగా నివారించుకోవచ్చును.

**డా. లక్ష్మీ** M. D (Ayurveda)
**స్టార్ ఆయుర్వేద**




# టీనేజ్ ఫ్రెండ్స్‌పై పేరెంట్స్ నిఘా?

**రక్తసంబంధాన్ని మించిన ఆత్మీయత, నమ్మకంతో పెనవేసుకున్న బంధమే స్నేహబంధం. స్నేహ మాధుర్యాన్ని రుచిచూడనివారు ఎవరూ ఉండరు. టీనేజ్‌లో ఏర్పడే స్నేహబంధాలు కొన్ని మనల్ని అభివృద్ధిపథంలోకి తీసుకెళ్తే మరికొన్ని పాతాళానికి నెట్టేస్తాయి.**

**ముందే చెప్పుకున్నట్లు టీనేజ్ అంటే భవిష్యత్తుకు పునాది. ఈసమయంలో చెడు తిరుగుళ్లకు అలవాటుపడితే భవిష్యత్తు అంధకారమే. అందులో సందేహమేమీ అక్కర్లేదు. అందుకే పిల్లల స్నేహాలను తల్లిదండ్రులు ఎప్పటికప్పుడు గమనిస్తూ ఉంటారు. ఈక్రమంలో పిల్లలనుంచి వచ్చే సమాధానాలు కొన్నిసార్లు తల్లిదండ్రులను ఆందోళనలో పడేస్తాయి. అది సహజమే.**

'మట్టికుండ సులభంగా పగిలిపోతుంది. అతికించడం సాధ్యం కాదు, చెడ్డవారితో స్నేహం అలాంటిదే. బంగారం కుండను సులభంగా పగలగొట్టలేం. ఒకవేళ పగిలిపోయినా తిరిగి అతికించడం సాధ్యమే. మహాత్ములతో మైత్రి కూడా అంతే, వారితో స్నేహం ఎన్నటికీ చెడిపోదు'.

'నీ స్నేహితులు ఎవరో చెప్పు, నువ్వు ఎలాంటి వాడివో చెబుతా' అనే ది కూడా పైన పేర్కొన్న సూక్తిలాంటిదే.

'కాదు సుమీ దుస్సంగతి..' అంటూ సుమతీ శతక కర్త కూడా స్నేహం ఎలా ఉండాలో వివరించాడు. మంచికి చెడుకు తేడా తెలియని వయసు టీనేజ్. ఈవయసులో వారికి అందరూ మంచివారిగానే కనిపిస్తారు. అందుకే అందరితో స్నేహం చేయాలని చూస్తుంటారు. ఫలితంగా కొన్నిసార్లు చెడు స్నేహాల బారినపడి అనేక అలవాట్లు నేర్చుకుంటుంటారు. అందుకే పిల్లల్ని ఓకంట కనిపెట్టడం ఇంట్లో తల్లిదండ్రులదీ, స్కూల్లో ఉపాధ్యాయులదే బాధ్యత అంటారు.

టీనేజీలో స్నేహాలు చూసి కుర్రాడు చెడు సావాసాలు పట్టి చెడిపోతున్నాడేమో అనిపిస్తుంది తల్లిదండ్రులకు. అయితే ఈ విషయంలో మరీ అంత ఆందోళన పడాల్సిన అవసరం లేదు. ఈ వయసులో వారికి స్నేహాలు కూడా అవసరమే. తల్లిదండ్రులతో చెప్పుకోలేని కొన్ని ఆంతరంగిక విషయాలు ఫ్రెండ్స్‌కి చెప్పుకోవచ్చు. అంతేకాదు, తన భావాలు, అనుభవాలు, అనుభూతులను తోటి మిత్రులతో పంచుకోవడం ద్వారా తనకున్న ఫీలింగ్సే అందరికీ ఉన్నాయా లేక తనకొక్కడికేనా? అనే విషయాలను టీనేజర్ తెలుసుకోగలుగుతాడు.



## పిల్లలతో పేరెంట్స్ స్నేహం!

ముఖ్యంగా పిల్లల స్నేహాలు, వారి ధోరణుల గురించి తెలుసుకోవాలంటే తల్లిదండ్రులు పిల్లలతో స్నేహంగా ఉండడం ఎంతో అవసరం. తల్లిదండ్రులు అర్థం చేసుకుంటారు, ఒకవేళ తప్పు చేసినా సహనంతో తమ తప్పులు సరిదిద్దుతారని పిల్లలు భావించినప్పుడు తోటివారిమీద ఎక్కువ డిపెండ్ కాకుండా తల్లిదండ్రులతో స్నేహపూర్వకంగా ఉంటారు. అయితే టీనేజర్లకు తల్లిదండ్రులపట్ల ఇలాంటి నమ్మకం కలగడం అంత తేలికైన విషయం కాదు. అందుకు ఎంతో సమయం పడుతుంది. ఈవిషయంలో పిల్లలకు స్వేచ్ఛనివ్వాలి. కొన్నిసార్లు స్వేచ్ఛనిచ్చినా వయసు ప్రభావం వల్ల తోటివారితోనే ఉండాలన్న కోరిక కలుగుతూ ఉంటుంది. వారిలో ఉండే ఈ సహజ



లక్షణాన్ని ప్రోత్సహించడం కూడా ముఖ్యమే.

అయితే అప్పటివరకు తమ కనుసన్నల్లో ఉన్న కుర్రాడు అకస్మాత్తుగా స్నేహితులవైపు మొగ్గుచూపడం, స్నేహం పేరుతో తమను నిర్లక్ష్యం చేయడాన్ని అందరు తల్లిదండ్రులూ జీర్ణించుకోలేరు. పిల్లవాడు తమ అదుపాజ్ఞల్లో ఉండాలని కోరుకుంటారు. పిల్లవాడు తిరగబడితే సహజంగానే తల్లిదండ్రులు కలత చెందుతారు. చాలా మంది తల్లిదండ్రులు వారి వారి పాత్రను తప్పుగా అర్థం చేసుకుంటారు. క్లిష్టపరిస్థితులలో పిల్లలకు తల్లిదండ్రులు రక్షణవలయంలా ఉంటూ, సంక్లిష్టమైన పరిస్థితుల పరిణామాలు, వాటి పర్యవసానాలను అర్థంచేసుకునే అవకాశం పిల్లలకు ఇవ్వాలి. వారిని తెలివితేటలు పెంచుకోనివ్వాలి.

## ఫ్రెండ్స్ సర్కిల్ ఓ మజిలీ

తల్లిదండ్రులు ఇక్కడొక సంగతి గమనించాలి.

ఇంతకాలం పిల్లల్ని పెంచింది దేనికోసం? వారి కాళ్లమీద నిలబడేలా చేయడం, స్వతంత్రంగా ఆలోచించగలగడం, వారిని ప్రయోజకులుగా తీర్చిదిద్దడం కోసమే కదా. దాన్ని సాధించాలంటే వారిలో ఆత్మవిశ్వాసం ఏర్పడాలి. అంటే నలుగురితో కలిసినప్పుడే పిల్లలకు మంచిచెడుల గురించి తెలుస్తుంది. స్నేహితులతో కలిసి ఒక లోకాన్ని ఏర్పరుచుకోవడం ద్వారా కుర్రవాడు సమాజంలోకి

వెళుతున్నాడని తల్లిదండ్రులు గ్రహించు కోవాలి. తన లక్ష్యానికి చేరువవు తున్నాడనుకోవాలి. స్నేహితులను ఏర్పరుచుకోవడం అభివృద్ధి దిశగా ఒక విజయవంతమైన మజిలీ! ఈమజిలీని తల్లిదండ్రులు ఆహ్వా నించాలి. అందుకోసం పిల్లలకు సహాయపడాలి. ఏది మంచి ఏది చెడు అనే విచక్షణ జ్ఞానాన్ని తెలియ చెప్పాలి. అంతేగాని పిల్లవాడు తమ చేతుల్లో నుంచి జారిపోతున్నాడని కలత చెందకూడదు.



## చెడుసావాసాలకు రెమిడీ

తమ అభిప్రాయాలు, నమ్మకాలే సరైనవనీ, విలువైనవనీ లోకంలో ఎవరైనా భావిస్తూ ఉంటారు. అది సహజం. ఇందుకు తల్లిదండ్రులు కూడా మినహాయింపు కాదు. తాము అంతగా విలువ ఇచ్చి నమ్మే సిద్ధాంతాన్ని టీనేజ్‌లో తమ బిడ్డలు తృణీకరించడం తల్లిదండ్రులకు బాధాకరంగా అనిపిస్తుంది. అలా తమను తిరస్కరించడానికి కారణం పిల్లల చెడు సావాసాలే అనిపిస్తుంది. సావాసగాళ్ల మూలంగానే ఇలా చెడిపోతున్నా వంటూ పిల్లల్ని నిందిస్తారు. ఇది సరైన పద్ధతి కాదు! కొన్నిసందర్భాల్లో పిల్లలు తమకు తెలియ కుండానే చెడుసావాసాలు చేస్తుంటారు. ఓ ఉదా హరణ చూద్దాం.

'కృష్ణయ్య రామాపురంలో ఉండే ఓ రైతు. ఓ చలికాలంలో రహదారి వెంబడి నడిచివెళుతు న్నాడు. చలి కారణంగా బిగుసుకుపోయిన ఒక పాము అతనికి కనిపించింది. ఆ వణుకుతున్న పామును చూసి రైతు జాలిపడ్డాడు. పాముకు పాలు పోశాడు. గడగడా తాగేసింది పాము. అయినా చలి, వణుకు తగ్గలేదు. జాలితో ఆ రైతు పామును తన ఛాతి దగ్గరకు తీసుకుని నెమ్మ దిగా నిమిరాడు. వెచ్చదనం స్పర్శతో కాసేప టికి పాముకి వణుకు తగ్గింది. ఇక తర్వాత పాము తన స్వభావం చూపించి రైతును కాటువేసింది. పాపం రైతు మరణించాడు.

దుష్టులపట్ల ఎంత జాలి, కరుణ చూపిం చినా కృతజ్ఞత ఉండదు. అందుకనే దుష్టో దూర వర్జితః అన్నారు. మంచివారితోనే స్నేహం చేయ మని పెద్దలు చెబుతారు.'

పై కథలో లాగానే పిల్లలు కూడా పాము లాంటి వారికి స్నేహం రుచి చూపిద్దామనుకుం టారు. వారు చెడ్డవారని పిల్లలకు తెలియదు, తీరా తెలిశాక మనచేయి దాటిపోయి ఉంటారు. అందుకే తల్లిదండ్రులు, తమ పిల్లల సావాసగాళ్ళు ఎవరో తెలుసుకోవడానికి ప్రయత్నించాలి. ఉదాహ రణకు, తన కొడుకు స్నేహితులు ఇంటికి వచ్చి నప్పుడల్లా భయపడేలా కాకుండా వారితో తను కూడా ఓ ఫ్రెండ్‌లా కలిసిపోయే ప్రయత్నం చేయాలి తండ్రి. వాళ్ళతో చనువుగా మాట్లా డుతూ తమ కుర్రాడి స్నేహితుల వ్యక్తిత్వం ఎలాంటిది, వారేం చేస్తుంటారు వంటివి తెలుసు కోవాలి. ఇవన్నీ ఒకసారి అడిగితే తెలిసేవి కావు కాబట్టి మెల్లమెల్లగా తెలుసుకోవాలి. ఆ స్నేహి తుల ప్రభావం తన పిల్లలపై ఎలా ఉందో అంచనా వేయగలగాలి. వారిలో ఎవరైనా వక్రమార్గంలోకి నెట్టేవారు ఉన్నారనిపిస్తే వెంటనే బరస్ట్ కాకూ డదు. అరవడంవల్ల, కొడుకు వారితో రహస్యంగా స్నేహం కొనసాగించవచ్చు. అందువల్ల తగిన సమయం చూసుకుని పిల్లాడితో అవీ ఇవీ చర్చిస్తూ ఫ్రెండ్ గురించి ప్రస్తావించాలి. ఫ్రెండ్స్ గురించి తనేమనుకుంటున్నాడో పిల్లాడికి తెలియ జేయాలి. అలా అనుకోవడానికిగల కారణాలు ఏమిటో కూడా వివరించి చెప్పాలి. అతనితో స్నేహం అపాయకరం కావచ్చునని హెచ్చరించాలి. ఒక్కసారి చెప్పినంత మాత్రాన పిల్లల్లో మార్పు వస్తుందనే భరోసా ఉండదు. ఒకటికి నాలుగు సార్లు తండ్రిగా పిల్లలమీద తన ప్రభావం ఉప యోగించి బ్రెయిన్‌వాష్ చెయ్యాలి. దార్లోకి తెచ్చు కునే ప్రయత్నం చేయాలి. అయితే కొందరు పిల్లలు అప్పటికీ లొంగరు. ఈసమయంలో వారికి సన్నిహితులు, స్నేహితులు, బంధువులు, స్కూల్లో టీచర్లు... ఇలా ఇతరులచేత చెప్పించవచ్చు. ఫలి తంగా మెల్లమెల్లగా పరిస్థితి అర్థం చేసుకుని వారిలో మార్పు రావడానికి వీలు కలుగుతుంది.

## తల్లిదండ్రులకు చిట్కాలు

1. పిల్లలు ఎవరితో ఫ్రెండ్‌షిప్ చేయాలన్నది తల్లిదండ్రులు నిర్ణయించకూడదు. పిల్లల పైన తమ ఇష్టాయిష్టాలు రుద్దకండి. స్నేహాలకు సంబంధించి పిల్లల ఇష్టాన్ని వారి హక్కుగా భావించండి. చెడుస్నేహం చేస్తుంటేతప్ప ఫ్రెండ్‌షిప్ విషయంలో పిల్లల్ని ఏమీ అనకండి.
2. పిల్లలు ఎప్పుడు ఏది చెప్పినా వాళ్ళ అభి ప్రాయాన్ని శ్రద్ధగా వినండి. వాటిల్లో విలు వైనదాన్ని అంగీకరించండి. మీకేం తెలుసు అన్నట్లుగా మాట్లాడకండి. వారితో వారి స్నేహితులతో పరిచయం పెంచుకోవ డానికి ప్రయత్నించండి.
3. పిల్లలు చెడుదారిలో వెళుతున్నారనుకుంటే తప్పనిసరిగా జోక్యం చేసుకోవాలి. అంత కంటేముందుగా నిర్ధారణ చేసుకోవాలి. టీనేజర్స్ తమ అభిప్రాయం వెల్లడించ డాన్ని తల్లిదండ్రులెప్పుడూ ఆహ్వానించాలి.

## లిక్కర్‌కి అలవాటు పడ్డారా?



టీనేజ్‌లోనే మద్యానికి బానిసైనవారు తీవ్ర ఇబ్బం దులు ఎదుర్కొంటున్నారని సర్వేలు చెబుతున్నాయి. మద్యం అలవాటు మనదేశ టీనేజర్లలో పెరుగు తోందని తాజా అధ్యయనాలు నిరూపిస్తు న్నాయి. ముఖ్యంగా పట్టణ ప్రాంతాల్లో అబ్బా యిలు మద్యపానానికి బానిసలవుతున్నారు. 1956-60 మధ్యకాలంలో 19.5 శాతం మేల్ టీనేజర్లు మద్యానికి అలవాటుపడితే ప్రస్తుతం వారి సంఖ్య 70 శాతం కంటే పెరిగిపోయిందని కొలంబియా యూనివర్సిటీ బృందం వెల్లడిం చింది. ఒకప్పుడు సంపన్న దేశాల్లో టీనేజర్లకున్న ఈ అలవాటు ఇప్పుడు అభివృ ద్ధితో సంబంధం లేకుండా దాదాపు అన్ని దేశాల టీనేజర్లలోనూ వచ్చిందని సర్వేలో తేల్చి చెప్పారు. టీనేజ్‌లో స్నేహితులపట్ల జాగ్రత్తగా ఉండాలని అధ్యయనవేత్తలు సలహా ఇస్తు న్నారు.

## టీనేజ్ ఆకర్షణలు

టీనేజ్‌లో స్నేహం చేసే వయసులోనే ఆడపిల్ల లకు, మగపిల్లలకు మధ్య ఒకరకమైన ఆకర్షణ భావం కలుగుతుంది. ఆ ఆకర్షణ భావాన్నే ప్రేమ అనుకుని పీకల్లోతు భ్రమల్లో మునిగి తేలు తుంటారు. ఫలితంగా అనూహ్యమైన మార్పులు వారి జీవితంలో చోటు చేసుకుంటాయి. మరి ఈ ఆకర్షణలు ఎలా కలుగుతాయి. వాటివల్ల వచ్చే ప్రమాదం ఏంటి? నిజమైన ప్రేమ ఈవయసులో కలుగుతుందా? ఇలాంటి విషయాల్ని గురించి ముందుముందు మరింతగా తెలుసుకుందాం!

-లతాకమలం

lathakamalam.me@gmail.com

# వృక్షబలి

గొల్లపూడి రాజ్యలక్ష్మి

**కిర్రుమని గేటుతీసిన చప్పుడు.**

**ఆ వెంటనే కాలింగ్‌బెల్ మోత. చదువుతున్న పుస్తకం పక్కనబెట్టి లేచింది వసుంధర. కొడుకు రోజూ కాలేజీకి వెళ్తూ "అమ్మా! ఒంటరిగా ఉన్నప్పుడు ఎవరు వచ్చి బెల్ కొట్టినా, కిటికీలోంచి చూడకుండా తలుపు తీయకు. గ్రిల్‌కి తాళం వేసి ఉంచు. జాగ్రత్త. అసలే రోజులు బాలేవు" అంటూ చెప్పే మాటలు గుర్తొచ్చి ఒక్క క్షణం ఆగింది.**



"ఎవరు?" అంది గట్టిగా.

"నేనండీ! చలమయ్యను"

"చలమయ్యా?" ప్రశ్నార్థకంగా అంది.

"మీ ఇంటివెనక స్థలం ఓనర్ని. ఓసారి తలుపు తీస్తారా?"

తలుపు తీసింది వసుంధర.

సుమారు అరవైఏళ్ళ వయసు. పంచె, లాల్చీతో పెద్దమనిషి తరహాగా వున్నాడు. పరికించి చూస్తే ఆయన్ని ఇంతకుముందు ఎప్పుడో చూసినట్లనిపించింది వసుంధరకు.

మెదడులో ఫ్లాష్‌లా వెలిగింది.

'ఈయనే కదూ ఆ మధ్యనెప్పుడో మీ ఇంటి స్థలాన్ని వెనకవున్న మా స్థలంతో కలిపితే పెద్ద అపార్ట్‌మెంట్ కాంప్లెక్స్ కట్టొచ్చు. మీ ఇల్లెలాగూ పాతకాలందైపోయింది. అపార్ట్‌మెంట్స్‌కిస్తే లేటెస్ట్ మోడల్‌లో అన్ని ఫెసిలిటీస్‌తో కట్టించుకోవచ్చు. ఇద్దరం కలిసి డెవలప్‌మెంట్‌కి ఇస్తే మీకూ లాభం మాకూ లాభం. మీ వాటాగా మీకు రెండో మూడో అపార్ట్‌మెంట్స్ గానీ, దానికి సమానమైన డబ్బుగానీ తీసుకోవచ్చం'టూ తన భర్త రమేష్‌కి ఆఫర్ చేశాడు. రమేష్, పిల్లలు ఆ ప్రపోజల్‌పట్ల కొంచెం ఆసక్తి చూపినా తనుమాత్రం తీవ్రంగా ఖండించింది.

ఆ తరువాత మరోసారి చలమయ్య ఈ విషయం ప్రస్తావించినా తామేం మాట్లాడకపోవ

డంతో ఆ ప్రయత్నం విరమించి తన స్థలంలో మొన్నీ మధ్యే శంకుస్థాపన చేశాడు. నాలుగు అంతస్తుల బిల్డింగ్ కట్టి ఒక దాంట్లో తనుండి, మిగిలినవి అద్దెలకు ఇచ్చుకుంటాడట.

"ఓ మీరా? చెప్పండి ఏమిటి విషయం?" అంది వసుంధర గుమ్మం బైటే నిలబడి.

"ఏం లేదండీ! మా ఇంటి కన్‌స్ట్రక్షన్ మొదలు పెడుతున్నాం. మీకో చిన్న విషయం చెప్పాలని వచ్చాను. అసలు రమేష్‌గారు ఆఫీస్‌కి వెళ్ళకముందే వద్దామనుకున్నాను. కుదర్లేదు" అన్నాడు తాను చెప్పబోయే విషయానికి నాందిగా.

"ఏ విషయం?" అంది వసుంధర అర్థంగాక.

"మీ పెరట్లో రెండు కొబ్బరిచెట్లు మీ వెనుక కాంపౌండ్ వాల్ మీదుగా మా స్థలం మీదకి వంగి ఉన్నాయి పూర్తిగా. దాని ఎండిన మట్టలు, చెత్తా, చెదారం అన్నీ మా స్థలంలో పడుతున్నాయి. పైగా ఇల్లు కట్టాక, జనం వచ్చి చేరాక కొబ్బరికాయలు రాలి ఎవరి నెత్తినైనా పడితే ప్రమాదం. అలాగే మామిడీ, జామ ఇంకా మిగతా చెట్ల కొమ్మలన్నీ కూడా మావైపు వచ్చాయి. వీటి గురించి మీరేదైనా పరిష్కారం ఆలోచిస్తే బాగుంటుందని చెప్పడానికి వచ్చాను" అన్నాడు చలమయ్య నిదానంగా.

"పరిష్కారం అంటే?" అంది వసుంధర.

"ఏముంది? మేం ఇల్లు కట్టకముందే మీరు ఆ చెట్లు కొట్టించేస్తే ఉభయులకూ బాగుంటుంది. ఇల్లు కట్టాక వీటిని తీయించడం మీకు కష్టం అవుతుంది. ఇప్పుడైతే వెనక ఖాళీగా ఉంది కాబట్టి తీయించడం ఈజీ!"

కాస్సేపు ఏమ్మాట్లాడాలో అర్థం కాలేదు వసుంధరకి.

"రమేష్‌గారితో కూడా ఆలోచించి నిర్ణయం తీసుకోండి, వస్తాను" అంటూ హడావిడిగా వెళ్ళిపోయాడు చలమయ్య.

'కొట్టించేయాలా? అయినా కొట్టించేయాల్సినంతగా వాళ్ళ స్థలంలోకి అవేం వాలిపోలేదే! కొన్ని కొమ్మలు అటువైపు వెళ్ళాయంతే. పైగా కొబ్బరిమట్టలైతే రోజూ రాలే ఆకుల్లాంటివి కాదు. ఎప్పుడో బాగా ఎండిపోయాక ఒకటీ, అరా రాలిపడతాయి. అసలు అలాంటి పరిస్థితి రాకుండా కాయలు దింపేటప్పుడు ఎండిన మట్టల్ని కొట్టిస్తూనే ఉన్నాం. అనుకోని సమస్య వెతుక్కుంటూ రావడంతో ఏం చేయాలో తోచక సతమతమైపోయింది వసుంధర.

పెరట్లోకెళ్ళి చూసింది.

విశాలమైన పెరడు పచ్చని చెట్లతో కనువిందు చేస్తూ ఆహ్లాదకరంగా ఉంది. పెరటికి ఓ పక్కన మామిడి, జామ, దానిమ్మ చెట్లు, మరో పక్కన కొబ్బరిచెట్లు అన్నీ ఏపుగా, గుబురుగా ఎదిగి కాయలతో కళకళలాడుతున్నాయి. కొబ్బరి చెట్లు బాగా ఎదిగి, తలబరువుతో కొంచెం వెనక కాంపౌండ్‌వాల్ వైపు వంగి ఉన్నాయి.

సాలోచనగా వాటివైపు చూసింది.

'ఈ ఇల్లు కట్టిన కొత్తలో నర్సరీకి వెళ్ళి రకరకాల పూల మొక్కలు, పళ్ల మొక్కలు ఎంతో ఇష్టంగా తెచ్చి, తనూ రమేష్ నడుంకట్టి, ఏది ఎక్కడ నాటాలో ఆలోచించి, తవ్వి వాటిని నాటారు. పెరటి గోడ వెనక్కి రెండు మీటర్ల దూరంలో నాటారు.

ఎదిగాక వాటివేర్లు వల్ల గోడ దెబ్బతినకూడదనీ, పక్కవాళ్ళకి ఇబ్బంది ఉండకూడదనీ ఆలోచించి అలా చేశారు.

అయినా ఈ చెట్లు ఎదిగాక అల్లరి పిల్లల్లా కొంటెగా సరిహద్దు గోడ దాటి కొమ్మల్నీ, రెమ్మల్నీ బైటకు పంపించాయి. ఇన్నాళ్ళూ వెనకవైపు ఖాళీస్థలం ఉండేది కనుక ఇబ్బంది అనిపించలేదు. తమ పెరటిగోడ సరిహద్దు దాటిన ఏ కొమ్మైనా వేరేవాళ్ళ స్థలాన్ని దురాక్రమణ చేస్తున్నట్లే కదా! ఇప్పుడేం చెయ్యాలి?

వసుంధరకు ఒక్కసారిగా నిస్సత్తువ ఆవహించింది.

తన చేతుల్తో నాటిన మొక్కలివి. ఇవాళ ఆరోగ్యంగా, ఏపుగా ఎదిగి గొడుగులా విస్తరించి తనను చూడగానే పొంగిపోయినట్లు తలలూపుతూ ఉంటాయి. ఏం చేస్తోంది వీటికి తను? కాసిని నీళ్ళు పోస్తోంది, అంతే. ఆ మాత్రానికే ఇవి విరగబూసి, కాయల్ని మోసి తన చేతుల్లో పెడుతున్నాయి. ఇవాళ ఎవరికో అడ్డం వస్తున్నాయని వీటిని అటూ, ఇటూ వాలకుండా నిలువరించడం సాధ్యమా?

ఇంట్లోకి నడిచింది. పుస్తకం మీద మనసు నిలవలేదు. ఆఫీస్‌లో ఉన్న భర్తకు ఫోన్ చేసింది.

"ఏమిటి వసూ? ఇదేమంత పెద్ద విషయం? దానికి ఇంత ఆందోళన పడాల్సిన అవసరమేముంది? చాలా బిజీగా ఉన్నాను. ఇంటికొచ్చాక చూద్దాం. ఫోన్ పెట్టేయ్" అన్నాడు రమేష్ విసుక్కుంటూ.

ఈయనింతే! అన్నీ తేలిగ్గా తీసుకుంటూ, ఏదీ పట్టించుకోరు అనుకుంటూ కాల్ డిస్‌కనెక్ట్‌చేసి ఒక్క క్షణం ఆలోచించి కూతురికి చేసింది. "ఎక్కడున్నావ్?" అంటూ.

"అమ్మా! నేను చిన్న షాపింగ్‌లో ఉన్నాను. ఏమిటి విషయం?" అంది కూతురు సుమన.

"షాపింగ్‌లో ఉన్నావా? ఆఫీస్‌కి సెలవు పెట్టావా?" అనడిగింది వసుంధర.

"అదేం లేదు. ఆఫీస్‌కొచ్చాను. లంచ్ టైం కదా! మా కొలీగ్ ఏదో కొనుక్కోవాలంటే దగ్గర్లో షాప్‌కొచ్చాను. అది సరే... ఫోన్ ఎందుకు చేశావు?" అడిగింది సుమన.

విషయం చెప్పింది వసుంధర.



"అదా! నేనింకా ఏమిటో అనుకుని భయపడ్డాను. ఈ టైంలో నువ్వెప్పుడూ ఫోన్ చేయవు కదా! అయినా నీకు రానురానూ చాదస్తం ఎక్కువవుతోం దమ్మా! ఆ చలమయ్యగారేదో వచ్చి ఆయనకు తోచింది చెప్పాడు. మన వీలునిబట్టి మనం చేద్దాం. దానికింత కంగారు దేనికీ? ప్రశాంతంగా పుస్తకం చదువుతూ పడుకో! టెన్షన్ పడకు. సాయంత్రం ఆఫీస్ నుండి నేరుగా అక్కడికొస్తాను. అప్పుడు మాట్లాడుకుందాం. సరేనా?" అంటూ ఫోన్ కట్ చేసింది సుమన.

'వీళ్ళింతే! ఏదీ సమస్య కాదంటారు. హాయిగా పడుకోవాలిట, ఎలా పడుకుంటుంది? నిక్షేపం లాంటి చెట్లు. ఈ మాత్రం ఎదగడానికి ఎన్ని ఏళ్ళు పట్టాయి! అలాంటిది ఇప్పుడు ఒక్క నిమిషంలో వాటి మనుగడకు ముప్పు వస్తుంటే పట్టించుకో కుండా ఎట్లా పడుకోగలదు తను? అన్యమనస్కం గానే పుస్తకంలోకి దృష్టి మళ్ళించింది వసుంధర.

•••

సాయంత్రం వీధిలోకొచ్చిన కూరగాయల బండి దగ్గర వసుంధర కూరలు తీసుకుంటుంటే పక్కింటి ప్రమీల కలిసి పలకరించింది.

"మధ్యాహ్నం చలమయ్య మీ ఇంటికొచ్చాడు. ఎందుకు?"

చాలా ఏళ్ళ నుండీ ఇరుగూ పొరుగుగా వుండ డంతో వసుంధర, ప్రమీల మధ్య స్నేహం, చనువు ఉంది.

అసలే చిరాకుతో ఉందేమో 'నా ఇంటికి ఎవరు వచ్చిపోయారో గమనించడం తప్ప ఈవిడగారికి మరో పనీపాటా లేదు' అనుకుని "ఏం లేదు. వాళ్ళ స్థలంలో ఇల్లు కడుతున్నాడు కదా! ఆ వైపున్న మా చెట్లు వాళ్ళకు అడ్డం వస్తున్నాయట" అంది.

"అంతేగా మరి! నీకేమో మొక్కల పిచ్చి. దొడ్డంతా వాటితో నింపావు. అడ్డూ అదుపూ లేకుండా పెరిగాయవి. అంతదాకా ఎందుకు? ఉన్న మాట చెప్తున్నాను. మావైపు ఉన్న సందులో నువ్వు పెట్టిన సువర్ణగన్నేరు మొక్క మొత్తం మా ఇంటి వైపు వాలింది. ఇంక మందార, ఉసిరి చెట్ల గురించి చెప్పక్కర్లేదు. మీచెట్లవల్ల మా ఇంటివైపు రాలిపడే పూలూ, ఆకులూ, చెత్త చూడ్డానికేమీ బాగుండటం లేదు. పనిమనిషి కూడా ఊడవలేక చస్తోంది. నీకింతకు ముందోసారి చూచాయిగా చెప్పాను. విని ఊరుకున్నావు. ఇరుగుపొరుగు వాళ్ళ కష్టం సుఖం కూడా మనం ఆలోచించాలి వసుంధరా!" అంది ప్రమీల సమయం దొరికింది కదా! అని సంబరంగా వసుంధరను వాయిస్తున్నట్లుగా.

"మొక్కలన్నాక ఆకులు ఉంటాయి, ఎండినవాటిని రాల్చేస్తాయి. అంతమాత్రాన వాటివల్ల వచ్చే లాభాల్ని విస్మరించడం న్యాయమా? నా చేతుల్తో వాటి కొమ్మల్ని విరిచి, నరికి వాటిని హింసపెట్ట లేను. నీకేదైనా అడ్డం అనిపిస్తే నువ్వే తీయించే సుకో" అంది వసుంధర బెండకాయలు ఏరుతూ.

"హింసా?" అంటూ పెద్దగానవ్వి "అవేమైనా మనుషులా, పశువులా హింసపడడానికి? అలా అనుకుని అందరూ ఊరుకుంటే ఈ భూమ్మీద మనం నిలవడానికి కాస్తయినా జాగా మిగులు తుందా? మళ్ళీ మనం మన పూర్వీకుల్లా అడవుల మధ్యల్లో గుహల్లో జీవించినట్లు బతకాలి. భలే దానివిలే" అంది మళ్ళీ పడీపడీ నవ్వుతూ ప్రమీల.

"ఇంటి లోగిట్లో చాలా ఖాళీ స్థలం వున్నా మొత్తం బండలు పరిపించి కుండీల్లో షోగ్గా నాలుగు క్రోటన్ మొక్కలు పెంచే ప్రమీల అంత కంటే ఏం మాట్లాడుతుంది? ఏం ఆలోచిస్తుంది?

మళ్ళీ ఈ ప్రమీలే తెల్లారక ముందే పూల బుట్టతో బయలుదేరి తమింటి వాకిలి ముందున్న గరుడ వర్ధనం, గన్నేరు మొక్కల కొమ్మలువంచి మరీ పూలు కోసుకుపోతుంది. తన ఇంటిముం దున్న పెద్ద వేపచెట్టునీడన వాళ్ళ వెహికల్స్ పార్క్ చేసుకుంటారు. ఏం మనిషో!' అనుకుంది వసుంధర.

"ఒక్కటి ఆలోచించు ప్రమీలా! ఈ సృష్టిలో మనుషులు ఒక భాగం మాత్రమే. ప్రతివాడూ తన సుఖంకోసం భూమిని అవసరానికన్నా ఎక్కువ ఆక్రమించుకుని ఈ మట్టిపైన, భూమి పైన ఆధిపత్యం ప్రదర్శించడం అవసరమా? అది ప్రకృతి సమతుల్యాన్ని దెబ్బతీయదా?

ఒకప్పుడు చిన్న పల్లెలుగా, చుట్టూ చెట్టూ చేమలతో నిండి, పచ్చటి పైరులతో కళకళ లాడుతూ ఉండే ప్రదేశాల్ని పట్టణీకరణ పేరుతో కాలరాసి కాంక్రీటుమయం చేయడం ఎంతవరకూ సమంజసం? ఎన్నో చెట్లూ, మొక్కలూ మనం సుఖంగా బతకడానికి కావల్సినవన్నీ మనకు ఇస్తు న్నాయి. ఆరోగ్యవంతమైన గాలి, చల్లదనం, వర్షం, పూలు, పళ్ళు, ఇంటి నిర్మాణానికి కలప, తిండి... చివ రకు మనం పోతే తగలబెట్టడానికి కట్టెలూ... అన్నీ చెట్లే ఇస్తున్నాయి కదా! ఇంటా, బైటా ఎక్కడా వాటిని బతకనివ్వకపోతే వాటిమీద ఎన్నోరకాలుగా ఆధారపడిన మనం ముందు ముందు ఏమై పోతాం? ఇళ్ళ బైట ఉండే చెట్లనేమో కరెంట్ తీగలు, కేబుళ్ళకు అడ్డొస్తున్నాయనో లేదా రోడ్డు విస్తరణకు అడ్డంగా ఉన్నాయనో ఇష్టమొచ్చినట్లు నరికేస్తున్నారు" ఇంకా ఏదో అనబోయింది వసుం ధర.

**వసుంధరకు మొక్కలపిచ్చి. ఇంటినిండా కొబ్బరిచెట్లు, రకరకాల పూలచెట్లు పెంచు తోంది. ఆ చెట్లు వెనుకవైపు ఖాళీస్థలంలోకి వంగి అందాలు చిందిస్తూ పువ్వులూ, ఫలాలు అందిస్తున్నాయి. అదే కంటగింపుగా తయారైంది కొందరికి. ఆ చెట్లు అడ్డంగా ఉన్నాయని, వాటిని తొలగించాలనీ ఘర్షణ పడటం మొదలుపెట్టారు. మరి వసుంధర ఎలాంటి ఆలోచనలు చేసింది? ఆమె రాజీ పడి మొక్కలు కొట్టించేసిందా? లేక గొడ వలు పడిందా?**

"అంటే ఏమంటావు వసుంధరా? మనిషి పురోభి వృద్ధి సాధించడం తప్పా? ఎప్పుడూ గుడిసెల్లోనో, పెంకుటిళ్ళలోనో ఉంటూ గతుకుల రోడ్లమీద గల్లం తవుతూ, కిరోసిన్ గుడ్డి దీపాల్లో బిక్కుబిక్కు మంటూ బతకాలా? ఇంటి చుట్టూ చెట్టూ చేమా పెంచితే ఎంత చాకిరీ చేయాల్సి ఉంటుంది! అంత ఓపిక మనకెక్కడుంది? పూర్వం వాళ్ళ ఓపిక మన కున్నాయా? మనకున్న ఈకొద్దిపాటి ఓపిక ఇప్పటి పిల్లలకు ఉంటోందా?" అంది ప్రమీల పుల్లవిరుపుగా.

"అవున్లే! అందుకే ఇప్పుడు చాలామంది పిల్లలు ఏ మొక్కనూ, చెట్టునూ ఫలానాదీ అని గుర్తించలేక పోతున్నారు, వాటిపేర్లు చెప్పలేకపోతున్నారు. ఇంట్లో కొన్నైనా మొక్కలుపెంచి తల్లిదండ్రులు వాటిని పిల్లలకు పరిచయం చేస్తే కదా! అనుకుంది వసుం ధర. ప్రమీలతో అంది.

"మనిషి అభివృద్ధి చెందడం తప్పు అని నేనెందు కంటాను? కానీ ఆపేరుతో ప్రకృతినీ, ఈ భూమిపై మనతోపాటు సమాన హక్కు కలిగివున్న చెట్లనూ నాశనం చెయ్యొద్దంటాను. మరో ప్రత్యామ్నాయం ఆలోచించాలంటాను."

"అమ్మా! ముందు నా సంగతి చూడండి తల్లీ! నేను మరో నాలుగు వీధులు తిరగాలి" అన్నాడు కూరగాయల బండివాడు దీనంగా.

అతనివైపు సాలోచనగా చూసి "మన కడుపు నింపే ఈ ఆకుకూరలు, కాయగూరలు పండించు కోవాలన్నా జానెడు ఖాళీ జాగా ఉండాలిగా ప్రమీలా! ఇలా ఖాళీ అన్నదే లేకుండా భూమిని కాంక్రీట్ మయం చేస్తూ జనావాసాలు నిర్మించుకుంటూ పోతే ఎక్కడ తేలుతామో అర్థం కావట్లేదు" అంది వసుంధర ఆవేదనగా.

"సర్లే! దీనిగురించి నేనెంతైనా వాదించగలను గానీ పాపం ఇతను తొందర పడుతున్నాడు. ముందు అతని సంగతి చూద్దాం" అంది ప్రమీల వసుంధర మాటలు అంగీకరించనట్లుగా.

నిట్టూర్చింది వసుంధర.

•••

రాత్రి అందరూ ఇంటికొచ్చాక మీటింగ్ మొద లైంది.

"ఇంతకీ ఏమంటాడాయన?" అడిగాడు రమేష్.

"అనడానికేముంది? చుట్టూ చెట్లతో బొమ్మ రిల్లులా ఉన్న మన ఇల్లు చూసి అతగాడికి కన్ను



కుట్టింది. మన ఇంటి స్థలం కూడా కలుపుకుని పెద్ద అపార్ట్‌మెంట్ కాంప్లెక్స్ కట్టిద్దామనుకున్నాడు. మనం సహకరించలేదు. ఆ కక్షతో ఇప్పుడు ఆయన వాటిని నరికి పోగులు పెట్టమని చెప్పి వెళ్ళాడు" అంది కసిగా వసుంధర.

"ఈ మొక్కల పిచ్చిలో పడి, వాటి సేవలో నడుం విరగ్గొట్టుకుంటూ ఎందుకు ప్రయాస పడతావు?' నేను అప్పుడే చెప్పాను, నువ్వు విన్నావా? కుండీల్లో ఏవో నాలుగు పూలమొక్కలు, అందంగా పెంచు కుంటే సరిపోయేది. ఇప్పుడు చూడు. అంత కష్ట పడి పెంచిన ఆ చెట్లు నిండుగా కాయలు కాసే సమయానికి కాపాడుకోవడం తలనొప్పిగా మారిపోతోంది. వెనక స్థలం ఖాళీగా ఉండడంతో మామిడికాయలు, జామకాయలు మనం లోపలున్నప్పుడు ఎవరో గోడ ఎక్కి కోసుకుపోతున్నారు. వాకిలి ముందు చెట్లకు పూస్తోన్న పూలను, వాకింగ్ పేరుతో కవర్లు పట్టుకుని వచ్చి మనం నిద్ర లేవకముందే ప్రతివాళ్ళూ తెంపుకుపోతున్నారు. ఏమిటీ చెట్లవల్ల సుఖం? అంతేనా? ఆ కొబ్బరి చెట్లు చూడబోతే..."

అంటూ ఇంకా ఏదో అనబోతోన్న రమేష్‌ని ఆపింది వసుంధర.

"గెలలు వేసి, చెట్లనిండా కాయలున్నా వాటిని కోయించడం ఒక సమస్య. వాటి తోలు, పీచు తీయించడం మరో సమస్య. పైగా పెరట్లోకెళ్తే అవి ముదిరాక రాలి నెత్తిమీద పడతాయేమోనని భయం. ఇదేగా మీరు చెప్పబోయేది. చూడండి, మనం చెట్లునాటి పెంచాం, పూలు, కాయలు కాసి వాటి ధర్మం అవి పాటిస్తున్నాయి. వాటిని అనుభవించడం కూడా మనకు సమస్యేనా? అసలు సమస్య అది కాదు. మన ఆలోచనా విధానమే ఒక సమస్య.

కొబ్బరికాయలు దించడానికి మనుషులున్నారు. పీచు తీయడానికి పరికరాలున్నాయి. ఆ కష్టం కూడా వద్దనుకుంటే చెట్లకే వదిలేద్దాం. వాటిని దింపించడానికయ్యే ఖర్చు పెడితే బజార్లో బోలెడు కాయలు దొరుకుతాయని తెగ గొణుగుతూ వుంటారుగా! అలాగే కొనుక్కుందాం. కానీ చెట్లను మాత్రం వాటి మానాన వాటిని వదిలేద్దాం" అంది ఆవేశంగా.

"అమ్మా! నీలా అందరూ ఆలోచిస్తే బాగానే ఉంటుంది. కానీ అలా ఆలోచించరు కదా! ఎదుటి వాళ్ళ ఆలోచనావిధానం మార్చుకోమని చెప్పగలం గానీ, మారి తీరాలని నిర్బంధించలేం కదా! ప్రస్తుతం ప్రపంచం డబ్బు చుట్టూ తిరుగుతోంది. కాస్త కూడా ఖాళీ స్థలం వదలకుండా ఇళ్ళు కట్టేసి, వాటాలు చేసేసి అద్దెలకిచ్చేస్తున్నారు. ఎన్ని వాటాలుంటే అంత ఎక్కువ అద్దెలు వస్తాయి. ఖాళీ స్థలం వదిలేస్తే వాళ్ళకేంటి లాభం. ప్రతీదీ లాభాపేక్ష దృష్టితో చూడటం కనిపిస్తోంది. ఏం చేస్తాం?" అంది ఆవేదనగా కూతురు సుమన.

"అది సరే. ముందు చలమయ్యేకేం సమాధానం చెప్పాలో ఆలోచించండి" అన్నాడు కొడుకు ప్రశాంత్.

"ఆలోచించడానికి ఏముందిరా? వాళ్ళవైపు వంగిన చెట్లు తీయించేస్తే సరిపోతుంది. వాళ్ళతో మనకెందుకొచ్చిన గొడవ, చెప్పు" అన్నాడు రమేష్.

"అంటే వాటిని చంపేస్తారా?" అంది ఆందోళనగా వసుంధర.

"అంతేగా మరి. మన సంతోషం కోసం ఇతరుల్ని ఇబ్బంది పెట్టలేం కదా!" అన్నాడు రమేష్.

"వద్దండీ! అంత మహాపాపానికి ఒడి కట్టొద్దు. నిండుగా కాయలతో, పచ్చగా ఉన్న చెట్లు నరికేస్తే పాపం చుట్టుకుంటుంది మనకు" అంది కళ్ళలో నీరు తిరుగు తుండగా వసుంధర.

"ఇదుగో మీ అమ్మతో ఇదే తంటారా! ఆధ్యాత్మిక పుస్తకాలు చదువుతుంది. టీవీలో ప్రవచనాలు వింటుంది. ఏం లాభం? దేనిమీదా అతిగా మమకారం, ప్రేమా పెంచుకోకూడదు, అశాశ్వతమైన ఈ జీవితానికి బంధాలు అనర్థాలు' అనే చిన్న సత్యం తెలుసుకోలేకపోతోంది." అన్నాడు రమేష్ నవ్వుతూ ప్రశాంత్‌తో.

"సరేనమ్మా! నువ్వు దాని గురించి దిగులు పడకు. ఏదో ఒకటి ఆలోచించి చేద్దాంలే! నేనోసారి చలమయ్యగారితో మాట్లాడి చూస్తాను. అవును గానీ సుమనా! పిల్లలకు రెండ్రోజులు సెలవులు కలిసొస్తున్నాయని ఎల్లుండి బయల్దేరి మీరు శ్రీశైలం వెళ్దామనుకుంటున్నారు కదా? అమ్మని కూడా తీసుకెళ్ళండి. లేకపోతే చెట్లని తలుచుకుంటూ దిగులుపడి తిండీ, నిద్రా మానేస్తుంది. అలా బైట తిరిగొస్తే కాస్త మనసు కుదుటపడుతుంది" అన్నాడు ప్రశాంత్.

## రాఖీ సావంత్‌కి సంబంధాలు చూస్తున్నారట!



*నిన్న మొన్నటి వరకూ రాఖీ తన మొగుడిని తానే వెతుక్కునే పనిలో స్వయంవరాలు నిర్వహించింది. అవన్నీ బెడిసి కొట్టాయి. ఎవరూ రాఖీకి సెట్ కాలేదు. దాంతో ఆ బాధ్యతను ఆమె స్నేహితురాలు, హాలీవుడ్ నటి సోఫియా హయత్ తీసుకుందట! ఈవిడ రాఖీకి తగిన వరుడిని అన్వేషించే పనిలో పడిందట! వాస్తవానికి రాఖీ చాలా మంచి మనసున్న వ్యక్తి అట! ఆమెను ఎవరూ సరిగా అర్థం చేసుకోలేదని సోఫియా ఆవేదన వ్యక్తం చేస్తోంది. రాఖీ మనసు తనకు బాగా తెలుసుననీ అందుకే ఆమెకు వరుడిని వెతికే పనిని తాను నెత్తికి ఎత్తుకున్నానని చెప్పుకొచ్చింది. మొత్తానికి సోఫియా ప్రయత్నాలు ఫలించాలని రాఖీ అభిమానులతో పాటు బాలీవుడ్ జనాలు కూడా కోరుకుంటున్నారు.*

"అవును. నువ్వూ, నాన్న కూడా వస్తే బాగుంటుంది" అంది సుమన ఉత్సాహంగా.

"మాకు ఆఫీస్‌లో ఆడిట్ జరుగుతోందమ్మా! ప్రశాంత్‌కి వచ్చే వారం నుండీ ఎగ్జామ్స్. ఈసారికి మా ఇద్దర్నీ వదిలెయ్" అన్నాడు రమేష్.

"బావుంది. మీరు రాకుండా నేను వెళ్ళను" అంది కళ్ళు తుడుచుకుంటూ వసుంధర.

"అమ్మా! నువ్వు వస్తే పిల్లలు చాలా సంతోషిస్తారు సరదాగా వెళ్ళొద్దాం రామ్మా!" అంది సుమన బ్రతిమాలుతూ.

"నిజమే! సుమన పిల్లలు పింకీ, బాబీలకు తన దగ్గర చాలా చనువెక్కువ. 'అమ్మమ్మా' అంటూ ఎప్పుడూ తన చుట్టూ తిరుగుతుంటారు. వాళ్ళతో వెళ్తే కాస్త మైండ్ డైవర్ట్ అయి మనసు కుదుట పడితే ఏం చెయ్యాలనేది ఆలోచించొచ్చు" అనుకుని అంగీకారం తెలిపింది వసుంధర.

•••

రెండ్రోజులు కూతురు కుటుంబంతో దైవ సాన్నిధ్యంలో ప్రశాంతంగా గడిపి తిరిగి ఇల్లు చేరే సరికి రాత్రి పదకొండైంది. వసుంధరను దింపి సుమనా వాళ్ళు వెళ్ళిపోయారు.

మర్నాడు పొద్దున్నే నిద్రలేచి పెరటి గుమ్మం తెరచిన వసుంధర గుండె ఝల్లుమంది. చేష్టలుడిగిన దానిలా నిలబడిపోయింది. పెరడంతా ఖాళీగా ఉంది. మామిడి, జామ, సపోటా, దానిమ్మ చెట్ల కొమ్మలన్నీ నరికి వేయబడి, కొద్దిగా మొదలుతో మిగిలి ఉన్నాయి. కొబ్బరి చెట్లు ఉండాల్సిన చోటంతా ఖాళీ! ఒళ్ళు తూలింది వసుంధరకు. గుమ్మానికి ఆనుకుని నిలదొక్కుకుని రమేష్‌ని గట్టిగా కేకేసింది.

చదువుతున్న పేపర్ అవతల పడేసి పరుగెత్తుకొచ్చాడు రమేష్ కంగారుగా.

"ఏమిటిదంతా? అయ్యో! ఎవరి పనండీ ఇది? దొడ్డంతా ఎడారిలా ఉందేమిటి?" అంది కోపంగా.

"ఓ... ఇదా? అది కాదు వసూ! చలమయ్య మళ్ళీ ఇంటిమీదకొచ్చి మొన్న గొడవ చేశాడు. 'ఎందుకొచ్చినగోల?' అని తీయించేశాం. ఇక్కడ చెట్లు పోతేనేం.... ఇంటిముందు, సందుల్లో చాలా ఉన్నాయిగా. వాటి పోషణ చూడు చాలు" అన్నాడు తేలిగ్గా రమేష్.

భర్త కళ్ళల్లోకి సూటిగా చూస్తూ "అయితే ఇది మీ నిర్వాకం అన్నమాట! ఎలా చేయగలిగారండీ ఈ పని? మీదసలు గుండేనా? రాతిబండా? పూర్వం అనాగరికులు, అజ్ఞానులు, మూర్ఖులు తమ పనులు ప్రారంభించేముందు లేదా కోరికలు తీరడానికి నరబలిగానీ, జంతుబలిగానీ ఇచ్చేవారుట. ఈ చలమయ్య తన ఇంటిపని ప్రారంభించేముందు 'వృక్ష బలి' ఇచ్చాడండీ. వాళ్ళకీ, ఈయనకీ తేడా ఏమిటి? వాళ్ళు చేసేది తప్పు, శిక్షార్హమైనదైతే ఇప్పుడు ఈయనకీ శిక్ష పడాలి" అంది ఉద్రేకంతో వణుకుతున్న గొంతుతో.

"కూల్... కూల్... ఇలా లోపలికి రా! స్థిమితంగా కూర్చో!" మరీ అంత ఎమోషనల్ అవకు" అంటూ వసుంధర భుజం చుట్టూ చేయివేసి హాల్లోకి తీసుకొచ్చి సోఫాలో కూర్చోపెట్టాడు. అప్పుడే నిద్రలేచి ప్రశాంత్ ఆవులిస్తూ వచ్చాడు.

తల్లి వాలకం చూసి "ఏమైందమ్మా?" అంటూ

కంగారుగా దగ్గరకొచ్చాడు.

"ఏం తెలీనట్లు అడుగుతున్నావా? నన్ను అక్కా వాళ్ళతో తిరిగిరమ్మని పంపి ఇద్దరూ కలిసి పెరడంతా ధ్వంసం చేశారు కదరా!" అంది విలవిల్లాడుతూ.

"అమ్మా! నువ్వింత సెన్సిటివ్‌గా ఉంటే కష్టం. ప్రతిదాన్ని ఎక్కువగా ఆలోచించి సీరియస్ అయితే మన మనశ్శాంతిని మనమే దూరం చేసుకున్న వాళ్ళం అవుతాం. చలమయ్య మాటిమాటికీ ఇంటి మీదకొచ్చి ఈ విషయమ్మై గొడవ పెడ్తూంటే ఎన్నాళ్ళని భరిస్తాం? పోనీ ఈ సమస్యను మరోవిధంగా పరిష్కరించే దారుందా? ఆ చెట్లను కట్టడి చేయాలంటే మొదలంటా నరకడం ఒక్కటే తప్ప వేరే మార్గం లేదు. ఒక్క కొబ్బరి చెట్టు తప్పించి మిగతా చెట్లకు మొదలు ఉంది కాబట్టి మళ్ళీ వస్తాయిలేమ్మా! మన సెంటిమెంట్స్ కోసం, ఇరుగు పొరుగుతో ఎన్నాళ్ళు పోట్లాడగలం?" అన్నాడు ప్రశాంత్ అనునయంగా.

"అంటే ఏంట్రా? మనింట్లో, మన స్థలంలో, మనకిష్టమైన మొక్కలు పెంచుకునే స్వేచ్ఛ మనకి లేదా?" అంది.

"ఉంది, కానీ అది ఎదుటివాడికి అసౌకర్యం కలిగించకూడదు" అన్నాడు ప్రశాంత్.

"అసలా చలమయ్య ఎంతసేపూ తన సౌకర్యం గురించే గానీ మన గురించి ఏనాడైనా ఆలోచించాడా? తన ఇంటి వెనక మున్సిపాలిటీ రూల్స్ ప్రకారం




వదలాల్సినంత స్థలం వదలకుండా మన పెరటి గోడకు దాదాపుగా ఆనేట్లుగా ఇల్లు కట్టించడానికి ప్లాన్ వేయించడమేమిటి? అది మనకి అసౌకర్యం కలిగించదా?" అంది రోషంగా వసుంధర.

"డబ్బున్న వాణ్ణి ఏ రూల్సూ ఆపలేవమ్మా! ఎవడికో లంచమిచ్చి అప్రూవ్ చేయించుకుని ఉంటాడు. ఆ తర్వాత అక్రమ కట్టడాల్ని సక్రమం చేసుకోడానికి ప్రభుత్వం అవకాశం ఇచ్చినప్పుడు దాన్ని రెగ్యులరైజ్ చేయించుకుంటాడు" అన్నాడు రమేష్.

"ఏమిటో! నాకసలేం అర్థం కావట్లేదు. అయినా వాడి స్థలంలో వాడికి ఇష్టం వచ్చినట్టు చిన్నపాటి అడ్జస్ట్‌మెంట్‌తో సర్దుకునే సమస్యకి ఇంత దారుణమైన పరిష్కారమా?" అంది ఆవేదనగా వసుంధర.

"బాధ పడకమ్మా! అందుకే నీ ఎదురుగా ఆ పని చెయ్యలేక నువ్వు లేనప్పుడు చేశాం."

"అసలీ భూమ్మీద మనిషి పుట్టక ముందు నుండే చెట్లు ఉన్నాయంటారు. స్వార్థపరుడైన మనిషి తన మనుగడ కోసం వాటిని నిర్మూలిస్తున్నాడు. వాటి పొడంటేనే గిట్టకుండా పోతున్నాడు" అంది వసుంధర.

"అందుకేగా మన నాయకులు 'పచ్చదనం కోసం నడుం బిగిద్దాం' అంటూ మొక్కలు నాటే కార్యక్రమాల్ని తమ చేతుల్తో ప్రారంభిస్తున్నారు" అన్నాడు వెటకారంగా ప్రశాంత్.

"ఆ... నాటుతున్నారు. ఆ తర్వాత ఆ మొక్కల మొహాన ఇన్ని నీళ్ళన్నా పోస్తున్నారో, లేదో, వాటి అతీగతీ ఏమిటో తెలీదు. అసలు మొక్కలు నాటడం కాదు, ఉన్న మొక్కలు నరికే వాళ్ళ చేతులు నరుకుదాం' అన్న శిక్ష ప్రకటిస్తే వాటిని రక్షించినవారవుతారేమో!" అంది వసుంధర కసిగా.

రమేష్ తన చేతులు రెండూ వెనక్కి దాచుకుని "నాకేం తెలీదు వసూ! నేనేం ఆ చెట్లు నరకలేదు. ఆ నరసింహుల్ని పిలిపించి ప్రశాంతే అతనితో ఆ పని చేయించాడు" అన్నాడు భయం నటిస్తూ.

ప్రశాంత్ నవ్వుతూ చూశాడు.

"చాల్లెండి. ఈ వేషాలకేం తక్కువలేదు. నేనింత బాధపడుతూ ఉంటే మీకు నవ్వులాటగా ఉంది" అంటూ ఏదో అనబోయింది.

"అమ్మా! జరిగిందేదో జరిగిపోయింది. చలమయ్యతో గొడవ వదిలిందని సంతోషిద్దాం. మిగిలిన మొక్కల్ని జాగ్రత్తగా చూసుకుందాం సరేనా? ఇదుగో ఆ పక్క సందులో కరివేపాకుచెట్టు ఎంత ఎదిగిందో చూడు. సువర్ణగన్నేరు చెట్టునిండా ఎన్ని గుత్తులో. నిజంగా బంగారు నేల! దాని పక్కన పారిజాతం... తెల్లారేసరికల్లా పగడాలు, ముత్యాలు కలబోసినట్టు చెట్టు కింద వత్తుగా రాలిన పూలకు ఎంత పరిమళమో! ఆ పక్కన నూరు వరహాల చెట్టు..." అంటూన్న ప్రశాంత్‌ని ఆపింది వసుంధర.

"చాల్చాలు. నా మొక్కల గురించి నాకు చెప్తున్నావా? నీ తాపత్రయం దేనికో నాకు అర్థమైందిలే!" అంది.

"కదా! మరి నీ కర్థమయ్యేలా చేసినందుకు నాకు కాస్త మంచి కాఫీ ఇస్తే..." అన్నాడు నవ్వుతూ ప్రశాంత్.

నిట్టూరుస్తూ స్టౌ దగ్గరకి కదిలింది వసుంధర. మనసుకు పరిపరి విధాల నచ్చచెప్పుకుని తనను తాను సముదాయించుకుంది.

ఆ సాయంత్రం ప్రమీలవచ్చి పెరడంతా తిరిగి చూసి "అబ్బ ఎంత మంచి పని చేశారు. హాయిగా, విశాలంగా, శుభ్రంగా ఉందిప్పుడు. ఇదే ఊపులో మా గురించి కూడా కాస్త ఆలోచించకూడదూ? ఆ సందులో చెట్లు కూడా కొట్టిస్తే బాగుంటుంది" అంటూ వసుంధర మాన్పుకోవడానికి ప్రయత్నిస్తున్న గాయంపై కారం జల్లి వెళ్ళింది.

ఆ రోజునుండీ నవ్వడం మర్చిపోయింది వసుంధర.

•••

పది రోజుల తర్వాత ప్రమీల వాళ్ళింటివైపు సందులో మొక్కల మొదళ్లలో ఉన్న ఎండిన ఆకుల్ని లాగి పోగు చేయసాగింది వసుంధర.

పక్కింట్లోంచి ప్రమీల ఎవరితోనో గట్టిగా మాట్లాడుతోంది.

"అవునండీ! ఏమిటో అప్పట్లో ఇల్లు కట్టించేటప్పుడు వాస్తు సరిగా చూపించలేదు. ఈ మధ్య మా వారికి అస్సలు ఒంట్లో బాగుండటంలేదు. ఉబ్బసం వ్యాధి బాగా ముదిరింది. నానా అవస్థా పడుతున్నారు. ఇంటి వాస్తు చూపించమని ఎవరో చెప్తే చూపించాం. ముందరున్న ఈ మెట్లు వీధివైపు ఉండకూడదట. అదుగో అటు ఆ సందులో ఉండాలిట. దానివల్లే మాకీ అనారోగ్యాలూ, కష్టాలూ అని చెప్పారు. ఆ మాట చెప్పాక ఊరుకోలేం కదండీ! ఇప్పుడా మెట్లు మార్చాలి. ఈ సందు చూడబోతే పక్కింటివాళ్ళ చెట్లన్నీ, మా ఇంట్లో ఉన్నట్లే వుంటాయి. ఆవిడకేమో మొక్కల పిచ్చి. ఇంతింత వృక్షాలు ఇంట్లో పెంచుతారా ఎవరైనా? రోజూ ఆ చెట్ల తాలూకా చెత్త ఊడవలేక మా పనిమనిషి విసుక్కుంటోంది" అది రాని రోజూ ఊడవలేక నా నడుం పడిపోతోంది, వెధవ గోల" అంటోంది ప్రమీల.

వసుంధర నిర్లిప్తంగా వింటూ ఉండిపోయింది.

•••

వారం రోజుల తర్వాత వసుంధరా వాళ్ళింటికి వచ్చింది ప్రమీల.

"వసుంధరా! ఇవిగో మా ఇంటి తాళాలు! మేం సాయంత్రం ఊరికి వెళ్తున్నాం. తిరిగి రావడానికి పదిహేను రోజులు పడుతుంది. కాస్త ఇల్లు కనిపెడుతూ ఉండండి" అంది.

"ఏమిటింత సడెన్‌గా" అంది వసుంధర.

"మావారికి ఈ మధ్య ఆయాసం మరీ ఎక్కువైంది. నాల్రోజుల క్రితం స్పెషలిస్ట్‌కి చూపిస్తే ఆయనకు డస్ట్ ఎలర్జీ బాగా ఉందనీ ఈ పొల్యూషన్‌కి దూరంగా స్వచ్ఛమైన వాతావరణం, గాలీ ఉండే ప్రదేశంలో పచ్చని చెట్ల నడుమ కొన్నాళ్ళు గడిపితే సమస్య తగ్గుముఖం పడుతుందన్నారు. మన సిటీలో గానీ చుట్టుపక్కలగానీ అలాంటి ప్రదేశాలు కాగడా వేసి వెతికినా కనిపించవుగా! అందుకే కేరళవెళ్ళి మా మరిదిగారింట్లో కొన్నాళ్ళు గడిపి వద్దామని వెళ్తున్నాం. అక్కడైతే పచ్చదనం ఎక్కువ కదా! ఏం చేస్తాం? చాలా దూరమైనా ఆరోగ్యం కోసం వెళ్ళక తప్పడం లేదు" అంది దిగులుగా ప్రమీల.

చాలా రోజుల తర్వాత వసుంధర పెదిమలపై నవ్వు విరిసింది అసందర్భమైనా.


**సెల్: 9493386780**

# సూపర్‌మార్కెట్లో రోబోలు

మనిషికి మనిషి సహాయం చేయని రోజులు రానున్నాయి. బంధువులు, స్నేహితులు ఉంటే ఉండవచ్చు. వారు సమయానికి ఉపయోగపడటం ఇప్పటికే తగ్గిపోయింది. ఎవరి పనులు వారివి. మనిషి మరొకర్ని మంచి చేసుకునో, లేక డబ్బిచ్చో పనులు చేయించుకుంటున్నారు. రాబోయే దశాబ్దాల్లో అదంతా ఇక జాంతానై! ఈ పనులన్నీ రోబోలే చేస్తాయట.

ఇప్పటికే రోబోలు ఎన్నో ఉద్యోగాలు వెలగబెడుతున్నాయి. సర్వర్స్, పనిమనుషులు, టెక్నీషియన్లుగా పనిచేస్తున్నాయి. మేనేజర్లు, హెచ్చార్లుగా, రాగ ద్వేషాలు, లంచాలు, రికమెండేషన్లకు లొంగకుండా ఉద్యోగస్తులను రిక్రూట్‌చేసుకునే ప్రధానాధికారులుగా, హోమ్ మేకర్స్‌గా అనేక పాత్రల్లో ప్రత్యక్షం కానున్నాయి. సామాన్య ప్రజలకు ఉపయోగపడే స్వయంఉపాధి రోబోలు కూడా అందుబాటులోకి వస్తాయట.



తాజాగా కెనడియన్ సంస్థ 4D Retail Technology Corporationకి చెందిన రోబోటిక్స్ ఇంజనీర్లు కొత్తగా స్వయం ఉపాధి రోబోలను తయారు చేసింది. వీటిలో కొన్ని సూపర్ మార్కెట్‌లో పనులకు ఉపయోగపడతాయట. స్టాక్ టేకర్లుగా సూపర్‌మార్కెట్‌లో పనులు పూర్తిచేస్తాయట ఇవన్నీ. సూపర్ మార్కెట్‌లో సెగ్వేలపై పరుగెత్తుతూ చిటికెలో పనులన్నీ చేసేస్తాయట. వేలాది రకాల వస్తువులు అమ్మకానికి ఉంటాయి. వాటి జాబితా తయారు చేసుకోవడం, అమ్మకాలు కాగా మిగిలినవి, కొత్తగా వచ్చేవి, కాలం చెల్లినవి ఇలా అనేక విభాగాలుగా ఆ వస్తువుల్ని విభజించి జాబితా తయారుచేయడానికి ఉద్యోగులు నానా తిప్పలు పడుతూ ఉంటారు. కానీ ఈ స్టాక్ టేకర్ రోబోలు మాత్రం అరవై నిమిషాల వ్యవధిలో మొత్తం వస్తువుల వివరాలతో కూడిన జాబితా, రకాల వారీగా విభజించి ఇచ్చేస్తుందట. డిజిటల్ కెమెరాలు, ఆబ్జెక్ట్ రికగ్నైజేషన్ సాఫ్ట్‌వేర్ ఈ రోబోలలో ఫీడ్ చేస్తారు. వినియోగదార్లకు, యజమానికి ఎలాంటి ఇబ్బందీ, సమయం వృథా లేకుండా కావాల్సిన వివరాలు, కావల్సిన వస్తువు ఏ ప్రదేశంలో ఉన్నదీ వెంటనే సమాచారం అందజేస్తుందట ఈ రోబో. కానీ సూపర్‌మార్కెట్ ఉద్యోగులు మాత్రం తమకు ఎసరువచ్చిందని బాధపడుతున్నారట.







**పసిడి మనసులు**
కథలసంపుటి
సి.యస్.రాంబాబు
ధర: 100 రూపాయలు
పేజీలు: 168
ప్రతులకు: పాలపిట్ట బుక్స్, 403, విజయ సాయి రెసిడెన్సీ, సలీంనగర్,మలక్‌పేట, హైదరాబాద్-36

దయ, సత్య, శౌచాలనే మాటలు వింటూ ఉంటాం. మనిషైనవాడికి దయాగుణం, సత్యానికి, స్వచ్ఛ జీవన విధానానికీ కట్టుబడి ఉండటం ప్రాథమిక విషయాలని ఆ మూడు మాటలు వాడటంలోని సారాంశం.

రచయిత సి.యస్.రాంబాబు కవిత్వం రాస్తారు. కథలూ రాస్తారు. అడపాదడపా సమీక్షా వ్యాసాలు రాయడం కూడా కద్దు. ఆయన తన ఇరవై కథలను ఎంచి కూర్చుకున్న సంపుటి ఇది.

గత కొన్నేళ్ళుగా తెలుగు కథా రచనలో ఒక పరిణామం గమనించదగినదిగా కనిపిస్తున్నది. అది పాజిటివ్ థింకింగ్. జీవితంలో మంచి చూడాలి. మంచిని ప్రోత్సహించాలి. మంచి గురించే మాట్లాడాలి. మానవత్వం ప్రధానాంశంగా సమాజంలో పరస్పర సంబంధాలు అందరికీ మేలుచేసేవిగా పరిణమించాలి. సూక్ష్మంగా ఇదీ పాజిటివ్ థింకింగ్ సాహిత్యంలో కోరుకునే విశేషం.

మనం-స్నేహితులు, మనం-తల్లి దండ్రులు, మనం-పిల్లలు, మనం - ఉద్యోగ సాధకబాధకాలు, మనం-పరోపకార గుణం, మనం-మన ఆశలు, పరిమితులు, మనం- సంపాదనా సమస్యలు... ఇలా ఈ సమాజ జీవితంలో 'మనం' (ఇండివిడ్యుయల్స్) కేంద్రంగా సర్వ సామాజికాంశాలూ పరిభ్రమిస్తూ ఉంటాయి.

రాంబాబు రాసిన ఇరవైకథల నేపథ్యం కూడా 'మన'మే. మనం తోటివారికి, కుటుంబానికి, మరీ ముఖ్యంగా పేదతనం కారణంగా అవకాశాలు అందిపుచ్చుకోలేనివారికి అండగా ఉండాలనే సున్నితమైన సందేశం ఈ కథలన్నిటా అంతస్సూత్రంగా కొనసాగుతూ కనిపిస్తుంది. వీటిలో చాలా కథల్లో ప్రముఖ పాత్ర 'నేను'.అంటే ఉత్తమ పురుష. రచయిత ఈ 'నేను' ని ఎంచుకోవడంలో కథా రచనలో సాధించిన ప్రత్యేకత ఏమిటంటే, తన సున్నితమైన మనస్సును తాకిన ఏదో ఒక ఘటనను కథకు ఇతివృత్తంగా కుదుర్చుకోవడం. అలాగే నిత్యం ఒత్తిళ్ళ మధ్య, కుటుంబ సామాజిక అవసరాల మధ్య నలిగే మధ్యతరగతి, మధ్య వయస్కుల ఆరాటాలు కూడా ఈ కథల్లో కనిపిస్తాయి.

"విజ్ఞుడు, విద్యావంతుడు అయిన ఆధునిక మానవుడు సాటిమనుషులపట్ల దయ కలిగి ఉండాలి. పక్కవాళ్ళను పట్టించుకోవాలి" అనే అంతస్సందేశం ఈ కథల సారాంశంగా చెప్పవచ్చు. ఈ చెప్పడం కోసం రచయిత రకరకాల అంతరువుల్లో అంశాలు స్పృశించారని "అనిర్వచనం", "ఇరుకు", "కొత్త పరుగు", "పితృణం" "థాంక్యూ అబూమియా" కథలు సాక్ష్యంగా నిలుస్తాయి. వీటికి భిన్నమైన సరదా కథ "వెంకీ విలాపము'. విశేషించి ఈ కథలలో కనిపించే మేలిమిగుణం స్త్రీ పాత్రల హృదయసంస్కార చిత్రణం. పురుషుడు సందేహగ్రస్తుడైన సందర్భాలలో స్త్రీలు ఉదారంగా పరిష్కారాలు చూపిస్తూ ఉంటారు.

సున్నితమైన, ఆర్భాటాలులేని కథనంతో మానవ సంబంధాలు ఎలా సాగితే బాగుంటుందో చెప్పే ఈ కథలు ముఖ్యంగా యువతరం చదవదగినవి.

-శ్రీకాంతశర్మ

## స్వీకారాలు

**శిథిలస్వరాలు**
కవిత్వం
ఉండవిల్లి.ఎమ్
ధర: 60 రూపాయలు,
పేజీలు: 78
ప్రతులకు: ప్రముఖ పుస్తక దుకాణాలు

**వ్యాస మంజరి**
వ్యాసాల సంపుటి
బొగ్గరపు రాధాకృష్ణమూర్తి
ధర: 100 రూపాయలు,
పేజీలు: 72
ప్రతులకు: శ్రీమతి బి.ఇందిరాకృష్ణ,16-8-364, రామలింగాపురం, నెల్లూరు సెల్:9885481939

**గాంధి గణాధిపత్యం**
బాలల గేయ నాటికలు
డా. వడ్డేపల్లి కృష్ణ
ధర: 100 రూపాయలు,
పేజీలు: 48
ప్రతులకు: రచయిత, 1-5-963, చైతన్యపురి, హైదరాబాద్-60 సెల్: 9246541699

**ప్రేమ్‌చంద్ సాహిత్యం పరిశీలన**
రచన: వలేటి వెంకటేశ్వర్లు
ధర: 50 రూపాయలు, పేజీలు: 32
ప్రతులకు: రచయిత, హిందీభవన్, పర్చూరురోడ్, ఇంకొల్లు. ప్రకాశంజిల్లా సెల్ 9676343468

-లలితా త్రిపుర సుందరి




**ఘంటాపథం! గంటకోపదం మాట్లాడే అతి మితభాషి, అది చిన్నప్పుడు. వయసెక్కిన ఒళ్లు గొంతువిప్పడం మొదలుపెట్టడంతో ఘంటాపథం అతి అమితభాషి అయ్యాడనే చెప్పాలి. ఏ విషయమైనా ఎంతసేపైనా మాట్లాడుతాడు అనే పేరు తెచ్చుకున్నాడు. అది గురి గింజయితే కింద నలుపేంటంటే ఆ మాట్లాడిందేవిటో ఆనవాలు కూడా లేకుండా పోవడం!**

**ఆ నలుపేంటో చెప్పే సాహసం ఎవరూ చేయరు. ఘంటాపథం డబ్బు అటువంటి సాహసాలకు పలుకులేకుండా చేస్తుంది.**

భార్య సున్నాంబ బతుకుతెరువుకోసం షార్టు హ్యాండ్ నేర్చుకుంది పెళ్ళికాకముందు. భర్త వాక్కువ్యాపకం విస్తరించి భార్య కళకు విస్తరి వేసింది. ఆయన మాట్లాడిందేదో చెప్పడంకంటే వాళ్ళకు కట్టడి, మనకు ముట్టడి" అని ఘంటాపథంగా చెబుతున్నాడు. సభాస్వర అనే బిరుదు తలపాగ అయింది.

•••

# చేయెత్తి జోకొట్టు!

రాసి చూపించడం సరదాగానే ఉండేది మొదట్లో!

సరదా చేతినొప్పిగా మారకముందే ఇద్దరు పిల్లల్ని ముద్దు పెట్టుకుంది. పెంపకం వంకతో చేతినొప్పి లేకుండా చేసుకుంది. అయితే ఘంటాపథం సీడీలుతెచ్చి పడేయడం మొదలు పెట్టాడు.

ఊళ్లో మెదడువాపువ్యాధి ప్రబలి ఘంటాపథం గొంతు నులిమేసింది. నోరుమూసుకుని ఉండలేక గిలగిలా కొట్టుకున్నాడు. దెబ్బలు తగులుతున్నాయి. బొబ్బలు కడుతున్నాయి. దానికి లేపనం రాయడాన్ని మించింది లేదనుకున్నాడు. రాస్తున్నాడు చించిపడేస్తున్నాడు. ఓసింతేనా రచన చేయడం అంటే అన్నాడు. అంతటితో ఊరుకోలేదు. పుస్తకాలు కదం తొక్కాయి. మళ్లీ కూత పట్టాడు!

•••

ఎక్కడ ఏ సభ జరిగినా ప్రముఖ వక్తల్లో ప్రముఖ రచయిత ఘంటాపథం ఒకడయ్యాడు. ఎలా అయ్యాడు. ఎందుకయ్యాడు అని ప్రశ్న వేయడానికీ, జవాబు వెతకడానికీ ఎవరికీ తీరిక లేకుండా చేశాడు.

"ఏముందండీ, ఎవరో ఒకళ్ళు పిలుస్తుంటారు. ఏదో ఒకటి మాట్లాడాలి. సభామర్యాద బందీలై ఎదురుమాట్లాడే వాళ్ళుండరు. అది ఎయిడ్స్ నివారణ సభ!

"యుద్ధానికి తలపడేముందు శత్రువు బలమేంటో తెలుసుకోవడం రణనీతి. అదే నీతి నిత్య వ్యవహారాల్లో ఇంకో రకంగా ఉపయోగపడుతుంది. వ్యక్తిగతమైన విషయాల్లో నీ నిర్ణయం, నీ ఆలోచన, నీ ఆచరణ కావాలి. తిట్లు, బొట్లు నీవే భరించాలి. కానీ, నలుగురితో సంబంధించిన సందర్భాల్లో...."

సభాస్వర మైకు వదలడంలేదు. ఎలా వదిలించాలో తెలియక మల్లగుల్లాలు పడుతున్నారు నిర్వాహకులు. జనాలు కోడిమెడలు వేస్తున్నారు. "మాకు తెలియని విషయం ఏదన్నా వినిపించవయ్యా" ఒక ప్రేక్షక అసహనం గొంతెత్తింది.

"అన్ని విషయాలూ అందరికీ తెలియాలనేం లేదుగా. ఎక్కడైనా ఎప్పుడైనా ఎవరికివారు కొత్త జ్ఞానగుళికలు ఏరుకోవడంబట్టి ఉంటుంది" సభాస్వర మైకు జవాబు చెప్పింది.

'ఏరుకోవడానికేం లేకపోతే ఏం చేయాలి, సభా భాస్వరా!"

ఘంటాపథం మంటాపథం కాకముందే ఎలక్ట్రీషియన్ సభను చీకటిమయం చేశాడు. చీకటిలో సభాస్వరకు దాహం వేసింది. అదే అదనను కుని ఎవరో మత్తునీళ్ళు తాగించారు. చిలిపి చేతుల్ని కట్టేయడానికి అక్కడక్కడా సెల్‌ఫోన్లు మిణుగురు పురుగులయ్యాయి. వేదికమీద ఎవరో "ఎలక్ట్రీషియన్ ఎక్కడ చచ్చావ్" అన్నారు. "ఇక్కడే బతికున్నా" అన్నాడతను "అయితే అదేంటో చూడు".

"చూస్తున్నా" అని స్విచ్చు వేశాడు. లైట్లు వెలిగాయి!

ఓ మహాకాయుడు సభాస్వరను భుజం మీద వేసుకుని వెళ్తూ కనిపించాడు!

•••

"ఇంకెప్పుడూ మీ సభలకు రానుగాక రాను" అంది సున్నాంబ.

"ఏం... ఎందుకో ఎప్పుడూలేంది అంతవిరక్తి" అన్నాడు ఘంటాపథం.

"మైకు చేతికొస్తేచాలు మీకు మైకం వచ్చేస్తుంది. ఈసారి మత్తే వచ్చింది."

"ఒక్కోసారి అనుభవాలు చేదుగా ఉంటాయి. ఇంతకీ ఆ గొంతు ఎక్కడి నుంచి వచ్చిందో కనిపెట్టావా?"

"ఏ గొంతు"

"నాకు అంతరాయం కలిగించిందే"

"అదేమోగాని ఆ గొంతుపక్కన కూర్చుంది మాత్రం మన అవుట్‌హౌస్‌లో కిరాయికుండే అతనిలా కనిపిస్తున్నాడు".

"ఏదీ ఒకసారి ఆ వీడియో చూపించు!"

•••

"అయ్య బాబోయ్! నేనే మీ దగ్గరికి బయల్దేరా. ఇంతలో మీ పిలుపు వచ్చింది" అంటూ వచ్చాడు అవుట్‌హౌస్ నివాసి.

"మీరెందుకు బయల్దేరారో చెప్పండి ఆ తర్వాత నేనెందుకు కబురుపెట్టానో చెబుతా" అన్నాడు సభాస్వర.

"అయ్యబాబోయ్! వాడు నా బామ్మర్దండీ. కాలేజీ సెలవలని వచ్చాడు. వచ్చాడు కదాని సభకు తీసుకొచ్చా, చప్పట్లు మోగించాలని. వాడు నా కొంపమీదకు తెస్తాడనుకోలేదు" ఘొల్లుమన్నాడు.

"మీ తప్పేం లేదు, బెంగపడకండి. ఈ రోజుల్లో పిల్లవాళ్ళకి ఉపన్యాసాలు వినేంత ఓపిక ఎక్కడిదిలెండి" అంది సున్నాంబ కాఫీ తీసు

**భర్త ఘంటాపథం సభాస్వర బిరుదాంకితుడు. భార్య సున్నాంబ పొట్టిచేయి నిపుణురాలు. ఏ విషయాన్నైనా గంటల గ్గంటలు మాట్లాడగల దిట్ట ఘంటాపథం. ఆ యత్నం బెడిసికొట్టిందేమో! దాంతో ఆకస్మికంగా ఈ సభాస్వరుడు రూపు మార్చుకున్నాడు. దాంతో ఆ ఇంట్లో సాహితీ సరస్వతి తాండవం ప్రారంభించింది. భర్త ఏదో దుస్సాహసం మొదలెట్టాడని పసిగట్టిందా ఇల్లాలు! తెలియక గజిబిజి పడింది. తెలిసి సొమ్మసిల్లిపడింది! ఆమె భర్త చేసిన కొత్త దుస్సాహసం ఏమిటి?**

కొచ్చి యిస్తూ.

"ఓపిక ఉన్నవాడేనమ్మా! సభాసంస్కృతి-పోకడలు అనే అంశంపై పరిశోధన చేస్తున్న వాడు".

"ఒకసారి అబ్బాయితో మాట్లాడాలని పిస్తోంది" అన్నాడు సభాస్వర.

●●●

"మా బావకి బాగా కలిసొచ్చిన ఇల్లు ఎక్కడ ఖాళీ చేయాల్సి వస్తుందో అని భయ పడుతున్నాడు! కానీండంకుల్, మీరు వింటానంటే మీ సభా భాషణంపై నేనోమాట చెబుతా".

"దానికోసమే నిన్ను రమ్మంది" అన్నాడు సభాస్వర.

"మీరు పట్టాలుతప్పి ఎటు పోతున్నారో మీకే తెలియకుండా గడియారాన్ని మింగేశారు. నా పక్కన కూర్చున్నతను తర్వాతి ప్రోగ్రాం గురించి వచ్చాడు. అతను, కాలం కాలం అంటూ నా చెవిలో



గంట కొడుతున్నాడు. ఏం తోచక ఓ మాట విసిరినందుకు క్షమించండి" చెప్పాడు బామ్మర్ది.

"నిజంగా, విసిరింది రాయైనా నీ తప్పేం లేదు నాయనా" అంది సున్నాంబ.

సభాస్వర తలపట్టుకున్నాడు!

"ఏమైందంకుల్".

"రాయితో కొట్టకుండానే దెబ్బ తగిలినట్లుంది పాపం".

"ఆంటీ! మీరు చాలా ఫోర్స్‌గా డ్రైవ్ చేస్తున్నారు."

"ఓ మార్పు రావాలంటే ఆ కాస్త అవసరం తండ్రీ"

"మీరేం చిన్నబోకండి అంకుల్! ధోనీ అయినా ప్రతి బాలూ సిక్సర్ కొట్టలేడుగా"

"చివరి బంతిని కొడతాడుగా" ఆనందంగా అన్నాడు సభాస్వర.

"మీకు చివరి బంతంటూ లేదుగా" అంది సున్నాంబ నవ్వుతూ. "సర్లే ఆ కట్టె బ్యాటూ, తోలుబంతీ గోల మనకెందుకుగాని, నువ్వీ సెలవుల్లో మీ బావదగ్గరుండి ఏం చేద్దామనుకుంటున్నావ్".

"మీ ఉపన్యాసం ఏదన్నా ఉంటే తప్పకుండా వద్దామనుకుంటున్నాను".

'తిన్నదెబ్బ చాల్లేదా" అంది సున్నాంబ అబ్బాయే వినేట్లుగా.

"అదికాదు నాక్కావాల్సింది" అన్నాడు సభాస్వర.

"నా సీడీలన్నీ విని ఓ పుస్తకం తయారు చేయాలి"

"ఈ బుక్కా, ప్రింటు బుక్కా",

"రెండోది నాయనా"

"ఒక్క బుక్కయితే సరే అంకుల్"

"కనీసం మూడు బీరువాలకు సరిపడా" అంది సున్నాంబ.

"నువ్వు మధ్యలోవచ్చి పిల్లవాణ్ణి భయపెట్టకు" అన్నాడు భార్యతో.

"ఆ పని నేను చేస్తానులెండి" అన్నాడు బావ.

"లేదు, అబ్బాయే చేయాలి. అబ్బాయి చదువుకి డబ్బు సమస్యే లేకుండా చేస్తాను" అన్నాడు సభాస్వర.

"నాకా సమస్య లేదంకుల్".

"అయితే, లేటెస్ట్, ల్యాప్‌టాప్ కొనిపెడతాను".

"సరే, రెడీ అంకుల్".

"నీకు తెలుగు షార్ట్‌హ్యాండ్ వచ్చా నాయనా" అడిగింది సున్నాంబ.

"వచ్చాంటీ".

"అయితే, ఇంకేం! ఆంటీ నీకు ఇల్లంత కంప్యూటర్ కొనిపెడుతుంది" అన్నాడు సభాస్వర.

●●●

"చూశావా! పడ్డశ్రమ ఎప్పుడూ వృథా కాదు." అన్నాడు సభాస్వర.

"మీ శ్రమా, నా శ్రమా" అడిగింది సున్నాంబ.

"నా గొంతు, నీ పొట్టిచేయి"

"అనువాద కళ బాగానే ఉందే! ల్యాప్‌టాప్‌ని తెలుగులో చెప్పండి కాస్త".

"కొద్దిగేదో ఇబ్బందిగా ఉందే".

"ఇబ్బంది పడకండిగానీ, పుస్తకం పట్టుకుని చదివేవాళ్ళ సంఖ్య తగ్గిపోతున్న ఈ రోజుల్లో మీ అకృత్యం ఏంటో నా కర్థం కావట్లేదు".

"ఉన్న పుస్తకాలే కట్టలుగట్టుకుని అటకమీదకు చేరాయనేగా నీ వెనకడుగు".

"లేదులెండి! అటక కూలిపడితే మళ్ళీ కట్టించడానికి అదో అదనపు ఖర్చని".

"పక్కంలో బల్లెం అంటే ఇదే!"

"పుస్తకాన్ని పూజించేదాన్ని నన్నలా అనకండీ".

●●●

ఈ వ్యాపకవ్యసనంనుంచి భర్తను ఎలా తప్పించాలా అని వేయి వేలమార్గాలు ఆలోచిస్తున్నది సున్నాంబ.

అబ్బాయి వచ్చాడు.

"జేబులు కళకళలాడుతున్నాయని అందరూ అంకుల్ని ఎత్తేస్తున్నారు. ఎంతోమంది ఉన్నతమైన రచయితలు తమ రచనలు వెలుగుచూసే అవకాశంలేక మనోవ్యథకు గురవుతున్నారు. అంకులిచ్చిన పనికి నా మనసూ, చేయీ కదలడం లేదు, మన్నించండి" అని చెప్పాడు. ఇచ్చిన కాఫీ తాగి వెళ్ళాడు.

ఓ అర్ధరాత్రి తనకో పీడకల వచ్చిందని ఆ సంగతి భర్తకు చెప్పింది.

"ఓసి పిచ్చిదానా! నా సంగతి నాకు తెలీదనుకున్నావా" అన్నాడు భర్త. "మరెందుకండీ, ఈ ఆటంతా" అంది ఆశ్చర్యంగా.

"నా అసలు లక్ష్యం రాజకీయాల్లో పైకి తేలడం, సరైన సమయంలో సరైన కుర్చీకి ఎసరు పెట్టడం" చెప్పాడు భర్త.

"ఆ తర్వాత?"

"నా కొడుకుల్ని నా వారసులుగా తీర్చిదిద్దడం!"

సొమ్మసిల్లి పడిపోయింది సున్నాంబ.

"అమ్మా!" అంటూ కొడుకులు దగ్గరికొచ్చారు.



# జీవితమే ఒక ప్రతిఘటన

(కోట శ్రీనివాసరావు కథాకథనం) 17

# ఆ పాత్రని చెడుగుడు ఆడుకున్నా!

(గతవారం తరువాయి)

**చెప్పుకుంటూవెళ్తే నా జీవితంలో చాలామంది దర్శకులు నాతో గొప్ప వేషాలు వేయించారు. ఈవీవీ తర్వాత నేను చెప్పాల్సింది కోడి రామకృష్ణగారి గురించి. తెలుగు ఇండస్ట్రీలో ఉన్న గొప్ప దర్శకుల్లో ఒకరు కోడి రామకృష్ణ.**

సమాజంలో మామూలుగా జరుగుతున్న విషయాన్ని సినిమాలో పెట్టి, సినిమా కథగా మెప్పించగల దర్శకుడు. అతి కొద్దిమందికి మాత్రమే తెలిసిన నిజం ఏమిటంటే కోడి రామకృష్ణగారు బేసిగ్గా మంచి నటుడు. నటుడిగా ఆయన సినిమాల్లో పెద్దగా రాణించలేదు కానీ, స్టేజీమీద బాగా చేసిన వ్యక్తి. అనుభవజ్ఞుడు. ఆయన మేనరిజమ్స్ చాలా ప్రత్యేకంగా ఉంటాయి. ఆయన రాసిన ప్రతి పాత్రకూ ఏదో ఒక మేనరిజం ఉండేలాగా చూసుకునేవాడు. నా అదృష్టం ఏమిటంటే సెట్లో ఆయన ప్రతిదీ చేసి చూపించేవారు. చేతుల్ని ఇలా పెట్టి, అలా పెట్టి, తిప్పి తిప్పి చేసి చూపిస్తుంటే,

'ఏం చేస్తున్నాడురా? అలా మనం ఎక్కడ చేస్తాం?' అనిపించేది. ఎందుకనిపించేదంటే ఆ పర్సనాలిటీ అలాంటిది. పర్సనాలిటీ ఆయనకు అడ్వాంటేజ్. నాకు ఆ అడ్వాంటేజ్ లేదు. నా కాయం పెద్దది. డైరెక్టర్‌గారి లాగా టక్కున పడుకోవాలన్నా, లేవాలన్నా, చేయాలన్నా.. కుదిరేది కాదు. ఇబ్బందులు ఉండేవి. ఇబ్బందులంటే పర్సనాలిటీ పరంగానే. అందువల్ల చెప్పింది చెప్పినట్టే తు.చ తప్పకుండా నేను చేసేవాణ్ణి కాదు. కాకపోతే అం...త చెబితే ఇంతైనా చేస్తారేమోననే ఆలోచనతో ప్రతిదీ చేసి చూపించేవారు కోడి రామకృష్ణ.

నా కెరీర్‌లో నేను నటించిన ఆయన సినిమాల్లో బెస్ట్ పాత్రలున్నాయి. అందుకు ఉదాహరణగా 'శత్రువు' సినిమా. ఆ చిత్రాన్ని ఎం.ఎస్.రాజుగారు తీశారు. ఎస్.గోపాలరెడ్డి కెమెరామన్.

### ఆయనలా చేయగలనా అనిపించేది

'శత్రువు' సినిమాలో కనిపించే నా మేనరిజమ్స్ అన్నీ డైరెక్టర్ కోడి రామకృష్ణగారివే. ఆయన చెప్పిన పద్ధతి ఫాలో అయ్యానంతే. ఏమాటకామాట చెప్పుకోవాలి 'శత్రువు'లో నా పాత్ర తీరును సెట్లో ఆయన చేసి చూపిస్తుంటే భలే నవ్వొచ్చేసేది.

' ఆయన లాగా చేయగలనా?' అని మథనపడేవాడిని. నేనే కాదు ఆయన సినిమాల్లో పనిచేసే ప్రతి ఆర్టిస్టూ మథనపడేవాడు. 'శత్రువు'ను మద్రాసులో తీశారు. తమిళంలో ఇప్పుడు స్టార్‌హీరో విజయ్ ఉన్నాడే, వాళ్ళ నాన్నగారు ఎస్.ఎ.చంద్రశేఖర్‌గారని పెద్ద డైరెక్టర్. ఆయన ఇంట్లో షూటింగ్ చేశారు. అక్కడ యాక్ట్ చేయడానికి ఫస్ట్ డే వెళ్ళా. గోపాలరెడ్డిగారు ఉన్నారు.

### అన్ని టేకులెప్పుడూ తినలేదు

శత్రువు చిత్రంలో నా పాత్రను కోడిరామకృష్ణగారు చాలా ముచ్చటపడి డిజైన్ చేసుకున్నారు. దాంతో నేనేం చేసినా ఆయనకి ఒక పట్టాన నచ్చలేదు. మచ్చుకు ఒక విషయం చెబుతా....

ఆ సినిమాలో ఓ డైలాగ్ ఉంటుంది.

'ఏవయ్యా మిమ్మల్ని సలహా సంఘంగా పెట్టుకుని పందెపు గొర్రెల్ని మేపుతున్నట్టు మేపితే మీరిచ్చే సలహా ఇదా. థాంక్స్. ఈ సమస్యకి మీరు గనక రెండు నిమిషాల్లో సమాధానం చెప్పకపోతే మీ పేరు రాసిపెట్టి ఆ మేడమీద నుంచి దూకి సచ్చిపోతా.. అయ్యో అగ్గిపెట్టె లేదురా బాబూ. అగ్గిపెట్టె లేదు" అని అంటా. అగ్గిపెట్టె లేదు అనేది అక్కడ అవసరం లేదు. అయినా అది ఆ క్యారెక్టర్ మేనరిజం. అందుకోసం చెప్పే తీరాలి. ఈ డైలాగు నా మీద మొదటిరోజు, మొదటిటేక్‌గా తియ్యాలనుకున్నారు.

' కెమెరా స్టార్ట్ ' అన్నారు రామకృష్ణగారు.

'రోలింగ్ సార్' అన్నాడు అసిస్టెంట్.

నేను డైలాగ్ చెప్పాను.

'వన్‌మోర్' అన్నారు కోడిగారు. అలా 17 సార్లు వన్‌మోర్‌లు చెప్పారు. 18వ సారి కూడా అదే తంతు. ఏవైనా ఉంటే ఇంకొన్ని ఎక్కువే ఉంటాయి కానీ తక్కువేం కాదు. ఇదంతా కెమెరామన్ ఎస్.గోపాలరెడ్డి గమనించారు. అప్పటికే సమయం మధ్యాహ్నం 12 దాటింది.

'కోటయ్యా... ఇలా రా ఒకసారి' అని పిలిచారు ఎస్.గోపాలరెడ్డిగారు.

'ఏంటండీ' అంటూ వెళ్ళా.

'నా మాటవిని నువ్వెళ్ళి బ్రేక్ తీసుకుని రా' అని సలహా ఇచ్చారు.

'డైరెక్టర్‌గారు ఏమంటారోనండీ. అయినా ఇప్పటి





దాకా నా కెరీర్‌లో ఇన్ని టేకులు తినలేదండీ' అన్నా.

'నాకు తెలుసు. నువ్వు ముందెళ్ళి బ్రేక్ తీసుకో. డైరెక్టర్‌గారితో నేను మాట్లాడతా' అన్నారు.

వెంటనే అటు తిరిగి డైరెక్టర్‌గారితో,

'కోటయ్యని బ్రేక్‌కి పంపించెయ్యండి. వెళ్ళొచ్చి చేస్తాడు' అన్నారు.

ఇటు తిరిగి నాతో... 'నువ్వు చెయ్యాలి. నువ్వే చేయాలి. దేని గురించీ ఎక్కువగా ఆలోచించకు. నువ్వు చేయగలవు కాబట్టే డైరెక్టర్‌గారు ఈ డైలాగ్ పెట్టారు' అన్నారు. మేం మాట్లాడుకుంటూనే ఉన్నాం. ఇంతలోనే కోడి రామకృష్ణగారు 'బ్రేక్ చెప్పేశారు.

### కెరీర్‌లో అదో గొప్ప పాత్రగా మిగిలిపోయింది

నేను వెళ్ళి భోజనంచేసి అరగంట పడుకున్నా. పడుకున్నానేగానీ మనసంతా ఇదే ఆలోచన.

'ఎట్టారా, ఎట్టా చేయాల్రా... ఆ మేనరిజం మనకు ఎందుకు అంతుబట్టటం లేదు' అని. సరేనని లేచి సెట్‌కి వెళ్ళా. అక్కడ డైరెక్టర్‌గారు ఉన్నారు. నేరుగా వెళ్ళి 'ఇంకొక్కసారి చెప్పండి' అన్నా. ఆయన కూడా చేసి చూపించారు. 'రెడీ అండీ' అన్నా.

టేక్ అనగానే ఫట్‌మని చేశా.

డైరెక్టర్‌గారు "ఓకే" అన్నారంతే.

ఆ నటరాజే నన్ను కాపాడాడనుకున్నా. అంతే నండీ... అక్కడి నుంచి ఆ వేషాన్ని చెడుగుడు ఆడు కుంటూ వెళ్ళిపోయా. దాన్లో ఎన్నెన్ని డైలాగులు ఉంటాయో! 'ఈ ఫోన్ కనిపెట్టినవాడెవడ్రా?, హోటల్లో జలపా తాలేంట్రా?....' అంటూ... ఒకటా రెండా? ఇలా చాలా డైలాగులు ఉంటాయి.

అందులో నాకు బాగా నచ్చిన సీన్ ఒకటుంది. ఇప్పుడు చూసినా నాకు ఇంకోసారి చూడాలని పిస్తూ ఉంటుంది.

'మేడమీద కూర్చుని కలగంటాను. 24 గంటలు తాగుతూనే ఉంటాను. అది ఎక్కదు. అంతలో హీరోని చూస్తా. 'దొరికావ్రా బాబూ' అంటా.

అంతలోనే హీరో వచ్చి 'ఎలా చంపమంటావ్రా నిన్ను' అని అడుగుతాడు. నాలుగు పీకుతాడు. 'బేర్' మని అరిస్తే చిన్న బిల్డింగ్ దగ్గర తలకాయ ఉంటుంది.

'బిల్డింగ్ చిన్నదైపోయిందేంట్రా బాబూ' అని అరుస్తా. తీరా చూస్తే అది కల. నిజంగా హీరో అప్పుడొస్తాడు. ఏదో డైలాగ్ చెప్తాడు.

'ఇది కలే' అంటా. అనడం కాదు కలే అను కుని సీక్రెట్ అంతా హీరోకి చెప్పేస్తా. చెప్పి ఊరుకో కుండా 'నువ్వేంది నన్ను పీకేది, ఇది కలే కదా' అంటా.

'థాంక్స్' అని వెళ్ళిపోతాడు హీరో. అప్పుడు జ్ఞానోదయం అయ్యి 'నా మస్తిష్కం దెబ్బతిందిరా బాబూ' అంటా. ఇలా సాగుతుంది ఆ సీన్.

ప్రజలకు కూడా బాగా రీచ్ అయింది ఆ సీన్. ఈ సినిమాకూ దాంతోపాటు నాకూ వచ్చినంత పేరు ఇంక దేనికీ రాలేదు. నా కెరీర్లో గొప్ప పాత్రల్లో ఇది కూడా ఒకటిగా మిగిలిపోయింది.

### నంది అవార్డు వస్తుందని ఎదురుచూశా

అలాగే కోడి రామకృష్ణగారు మరో సినిమాలో చాలా మంచి వేషం వేయించారు నాతో. ఆ చిత్రం పేరు 'పంజరం'. అందులో మీనా హీరోయిన్. మీనా భర్తగా నటించా. 'అహనా పెళ్లంట' ఛాయలున్న పాత్ర అందులో చేశా. సబ్జెక్ట్ కూడా చాలా బావుం టుంది. కానీ ఆడలేదు. ఎందుకు ఆడలేదో తెలియదు.

నేను 102, 103 టెంపరేచర్‌తో అపోలో ఆసుప త్రిలో చికిత్స పొందుతున్న సమయంలో మొద లైంది ఆ సినిమా. అప్పుడు ముక్కు నరసింహారావు అని ఒక ఆర్టిస్ట్ ఉండేవాడు. ఆయనిప్పుడు లేడను కోండి. కాలం చేసినట్టున్నాడు. ఆసుపత్రికి వచ్చి షూటింగ్‌కి రమ్మని పిలిచాడు.

'జ్వరం అయ్యా.. నాకు. ఓపిక లేదు' అన్నా.

'ఏహే, జ్వరం లేదు. ఏమీ లేదు. అవతల మీనా కాల్షీట్లు టైట్‌గా ఉన్నాయి. చచ్చిపోతున్నాం' అని లాక్కెళ్ళినంత పనిచేసి తీసుకెళ్లాడు. పిసినిగొట్టు పాత్ర అది. అందుకే 'అహనా పెళ్లంట' ఛాయలున్నా యని అన్నా. 'పంజరం'లో ఓ సీన్ నాకు ఇష్టం. అందులో నా పాత్ర గమ్మత్తుగా ఉంటుంది.

చెంబుకు తాడు కట్టి చెరువు ఒడ్డున కూర్చుని నీళ్ళు తోడుకుని పోసుకుంటా.

'ఏంటండీ చెరువు ముందు పెట్టుకుని ఇలా తోడుకుని పోసుకుంటున్నారు' అని అటుగా పోయేవారు అడుగుతుంటారు.

'జలగండం ఉందంట్రా నాకు' అంటా.

ఇలా చాలా ఫన్నీ సన్నివేశాలు రాయడంలో కోడిగారు దిట్ట. పంజరం సినిమా ఆడకపోయినా నంది అవార్డులకు వెళ్తుందేమో, నంది అన్నా వస్తుందని చాలా ఎదురుచూశా. అక్కడ కూడా రాలేదు. పాపం కోడి రామకృష్ణగారు కూడా ఫీలై ఉంటారేమో. ఆయన ఎందుకు అవ్వరు... ఎంతైనా క్రియేటర్ కదా. బాధపడి ఉంటారు. నాకే అంతుంటే, ఆయనకి ఎంత ఉండాలి. అయినా ఒక్క మాటలో చెప్పాలంటే ఈవీవీగానీ, కోడిగారు కానీ ఈ కాలానికి పనికొచ్చే డైరెక్టర్లు కాదు. వాళ్ళ కథలు వేరు. వాళ్ళ క్రియేషన్ వేరు. వాళ్ళది చాలా గొప్ప, పెద్ద వ్యవహారం. వాళ్ళు కథలను, వైవిధ్యాన్ని నమ్ముకున్నారు. ఇప్పటివారి పరిస్థితి వేరు. అంతా టెక్నికల్‌గా ఆధారపడుతున్నారు. కథ, పటుత్వం లేదు. నాలాంటివాళ్లు ఆ మాటలంటే వినేవాళ్ళకి కోపం వస్తుంది. నిజానికి ఇప్పటివాళ్ళకి ప్రాక్టికల్ నాలెడ్జ్ పెద్దగా లేదు.



### సినిమానే గొప్ప!

ఎన్ని టీవీలు వచ్చినా సినిమా సినిమానే. సినిమా ఆడియన్స్ వేరు. ఆ పరిస్థితులూ వేరు. టీవీల్లో ఎంత గొప్ప ఆర్టిస్టులు వచ్చినా వాళ్ళకి 'సినిమా ఆర్టిస్టు' అనిపించుకోవాలని ఉంటుందే తప్ప టీవీ తెరమీదే ఉండిపోవాలని ఎవరూ అనుకోరు. టీవీ ఆర్టిస్ట్‌లు సినిమాలో చేస్తే ఒక స్టెప్ పెరిగినట్టు ఫీలవుతారు. ఆ గుర్తింపు వేరుగా ఉంటుంది.

### పోలీసంటే రాజశేఖరే!

రాజశేఖర్ ఫస్ట్ పిక్చర్ 'వందేమాతరం'లో నేను విలన్‌గా చేశా. రావడం రావడమే రాజశేఖర్‌గారు విజయశాంతి సినిమాలో చేశారు. ఆ తర్వాత ఉషా కిరణ్ మూవీస్‌లో 'ప్రతిఘటన'లో. ఒక ప్రత్యేకత ఉన్నటువంటి నటుడు రాజశేఖర్. టి.కృష్ణగారికి ఇష్టమైన హీరో. నేను ఇంతకుముందు మీతో చెప్పాను కదా, ఒకసారి నాకు ఫుడ్ అలర్జీ అయితే, వెంటనే ఆ విషయం ముందుగానే గుర్తించి నన్ను కాపాడాడు. కోడి రామకృష్ణ దర్శకత్వంలో చాలా మంచి సినిమాలు చేశాడు. పోలీస్ అంటే రాజ శేఖరే అనే ఇమేజ్ తెచ్చుకున్నాడు. అందుకనే అతను తెలుగు సరిగా మాట్లాడలేకపోయినా 'ఇత నికి లాంగ్వేజ్ రాదుగా, డబ్బింగ్ ఇంకొకడు చెబు తాడు' అని తెలుగువారు ఎప్పుడూ అనుకోలేదు. ఇన్‌స్పెక్టర్ అంటే ఆయనే అన్నట్టు ఫీలయ్యారు. తెరమీద అగ్రెసివ్‌గా కనిపించేవాడు రాజశేఖర్. మంచి పర్సనాలిటీతో పాటు ఆయన ముఖం మీద ఎక్స్‌ప్రెషన్స్ బాగా పలికేవి. ఆ సీరియస్‌నెస్, ఆయన వాయిస్ అన్నీ ఆయనకే సాధ్యమయ్యాయి. అందుకే సక్సెస్‌ఫుల్ హీరోగా కొనసాగాడు.

**(ఇంకా ఉంది)**

**- డా.చల్లా భాగ్యలక్ష్మి**
**సెల్: 88850 55528**




**నేను సోఫాలో ఒరిగి కళ్ళు మూసుకున్నాను. కళ్ళు మూసి ఉన్నా మనోనేత్రం ముందు శ్రావణే ప్రత్యక్షమైంది. ఆ రోజు శ్రావణి నన్ను వదిలిపెట్టి వెళ్ళడానికి ముందు జరిగిన సంఘటనలన్నీ గుర్తుకొచ్చాయి.**

**రుస్తుంపేటలో షూటింగ్ పూర్తయిన తర్వాత మేమిద్దరమూ కలిసి నా ఇంటికొచ్చాం. ఆ రాత్రంతా శ్రావణీ నేనూ మనసులు విప్పి మాట్లాడుకున్నాం. మనసులు, మనువులు కలిసిపోయి ఆ రాత్రంతా ఆనంద డోలికల్లో తేలి, అలసిసొలసి మేమిద్దరమూ ఒళ్ళు తెలియకుండా నిద్రపోయాం.**

మర్నాటి ఉదయాన, సంతృప్తసరస్సులో ఆనంద స్నానం చేసినట్లుగా, ఇద్దరం కలిసి షవర్ బాత్ చేశాం.

నిన్ననే, షూటింగ్‌లో, నీళ్ళ ట్యాంకులో ఆడుకుంటూ శ్రావణి హీరోతో 'సరిగంగ స్నానాలు చేద్దాం రా బావా' అని అంటుంది.

మేము ఇద్దరం, నిజంగానే ఇప్పుడు అభ్యంగ స్నానం చేస్తున్నప్పుడు శ్రావణి మళ్ళీ అదే డైలాగ్ చెప్పింది. 24 గంటల్లోనే, ఇప్పుడు ఈ సంఘటన, యదార్థంగా, నిజజీవితంలో జరగడం నాకు ఆశ్చర్యం కలిగించింది.

'చేస్తున్నాంగా?' అన్నాను.

స్నానాలయ్యాక, శ్రావణి, జాకీయాడ్‌లో అమ్మాయిలా నల్లరంగులో పొట్టి బనీను, పొట్టి లాగూ వేసుకుని హాల్లోకి వచ్చింది.

నా గుండెల్లో సప్తవర్ణాల సీతాకోకచిలుకలు గుంపులు గుంపులుగా ఎగురుతూ గిలిగింతలు పెట్టాయి.

బ్రేక్‌ఫాస్ట్ చేసి, డీ.ఐ. టెక్నీషియన్ ఇచ్చిన రష్ చూద్దామని కూర్చున్నాం. శ్రావణి నా పక్కనే కూర్చుని, నా తల తన ఒళ్ళో పెట్టుకుంది. టీవీ స్క్రీన్‌మీద అద్భుత విన్యాసాలను ప్రదర్శిస్తున్న శ్రావణిని, ఆమె ఒళ్ళోనే పడుకుని చూడడం గమ్మత్తుగా అనిపించింది నాకు.

ఇట్లాంటి అదృష్టం ఈ ప్రపంచంలో ఎంత మందికి ఉంటుంది. నేను సృష్టించిన పాత్ర తెర మీద ప్రాణం పోసుకుని నటిస్తుంటే ఆ పాత్రను పోషించిన శ్రావణి పక్కన కూర్చుని చూడటం కేవలం యాదృచ్ఛికం. నా అదృష్టం.

రుస్తుంపేటలో షూట్‌చేసిన ఔట్‌పుట్, రఫ్ ఎడిట్ తర్వాత, సుమారు గంటపైన ఉంది. నేననుకున్న దానికన్నా బెస్ట్ ఔట్‌పుట్ రావడంతో చాలా తృప్తిగా ఉంది. నేను ఆనంద డోలికల్లో తేలిపోతుంటే...

'టూ ఓ క్లాక్ కాల్‌షీటుంది, అన్నపూర్ణాలో. వెళ్ళాలి!" అంది శ్రావణి సోఫాలో నుంచి లేస్తూ.

నా గుండెల్లో రాయిపడింది.

నేను ప్రాన్పడిపోయి, 'అదేంటి?' అన్నాను.

'అదేంటి అంటే?' అంది శ్రావణి నా దగ్గరకు వచ్చి, నా జుట్టును తన వేళ్ళతో సవరిస్తూ.

నేను ఈ ఆనందం శాశ్వతం అనుకున్నాను. శ్రావణి నా సొంతం అనుకున్నాను. ఊహల పల్లకిలో ఊరేగుతున్న నేను దబిల్లుమని వాస్తవంలోకి వచ్చి పడ్డాను.

నేను ఏం మాట్లాడాలో, ఏం ఆలోచించాలో కూడా తెలియని స్థితిలో పడిపోయాను.

అంతరిక్షంలోకి వెళ్ళేముందు భూమ్యాకర్షణరహిత స్థితిని, శూన్యాన్ని అలవాటు చేయడం కోసం, వ్యోమగాములకు కృత్రిమ వాతావరణంలో, సిమ్యులేటర్లతో ట్రైనింగ్ ఇస్తారు. వాళ్ళు భారరహిత స్థితిలో ఉంటారు. మొదట్లో అయోమయంగా ఉన్నా మెల్లి మెల్లిగా ఆ శూన్యస్థితికి అలవాటు పడతారు.

### జరిగిన కథ

ఆస్కార్ అవార్డుల పోటీల్లో అతడి చిత్రం ఎంపికైన సందర్భంగా అమెరికా వెళుతున్నాడా తెలుగు దర్శకుడు. విమానంలో కూర్చుని గతం గుర్తుచేసుకున్నాడు. జూనియర్ ఆర్టిస్టు హత్యాయత్నం కేసులో డీసీపీ పుష్పాకిరణ్ ప్రమేయంతో దర్శకుడికి లిఫ్ట్ ఇస్తాడు నిర్మాత. దాంతో సినిమా నిర్మించేందుకు సన్నద్ధమవుతాడు దర్శకుడు. నటి జలజ హత్య కేసులో సయీమ్‌ని ఎన్‌కౌంటర్ చేస్తారు. హీరోగా గోపీ, హీరోయిన్‌గా శ్రావణిని సెలెక్ట్ చేస్తాడు. షూటింగ్ మొదలవుతుంది. క్రమంగా శ్రావణి పట్ల ఆకర్షితుడవుతాడు. డైరెక్టర్‌కి తన గతం చెప్పడం మొదలుపెడుతుంది శ్రావణి. ఆమె తల్లి ఒక వేశ్య. ఒకణ్ణి నమ్మి హైదరాబాద్ వచ్చి సినిమాఫీల్డులోకి వస్తుంది. చిన్నతనంలోనే శ్రావణి ఎంతోమంది కామవాంఛలకు బలవుతుంది. నవీన్ కూడా తనకో కమిట్‌మెంట్ కావాలని అడిగాడని చెబుతుంది శ్రావణి. దాంతో డైరెక్టర్ నవీన్‌కి ఇక ఆఫీసుకు రావాల్సిన అవసరం లేదని చెప్తమంటాడు.

ఆ తర్వాత.....



శ్రావణి మాటలు, ఇప్పుడునన్ను ఆ శూన్యస్థితి లోకి తోసేశాయి.

నేనేమో తను నా సొంతం అనుకుని, తొంద ర్లోనే తనతో మాట్లాడి, నా జీవన సహచరిని చేసు కుందామని ఆలోచిస్తుంటే, ఆశ పడుతుంటే, తనేమో చాలా క్యాజువల్‌గా, అలవోకగా 'షూటిం గుకు వెళ్తున్నానంటూ' నాకు షాక్ ఇచ్చింది.

అంటే రాత్రి జరిపిన శృంగారం కేవలం ఒక్క రాత్రి వ్యవహారమేనా? వన్‌నైట్ స్టాండేనా? లేక పోతే, అందరిలాగా, నాక్కూడా 'కమిట్‌మెంట్' ఇచ్చిందా?

ఆ ఊహే నేను భరించలేకున్నాను.

అంత ప్రేమ, అంత అనురాగం, ఆ ఆప్యా యత, ఆ దగ్గరితనం అంతా ఒక అగ్రిమెంట్‌లోని అంతర్భాగమేనా! అంతమాత్రానికే నా కళ్ళల్లో అంతులేని అగాధాలు చూశానని, అవి ఏవో సందే శాలు పంపాయని, విడిపోతామేమోనన్న బాధ తనను రంపపుకోత కోసిందని... ఎన్నెన్ని కల్లబొల్లి కబుర్లు చెప్పాల్సిన అవసరమేముంది?

నేను సోఫాలో నుంచి మెల్లిగా లేచి మౌనంగా తలూపి, బెడ్‌రూంలోకొచ్చి తలుపులు మూసేశాను. శ్రావణి రెండుమూడు సార్లు పిలిచింది. నేను మాట్లాడేస్థితిలో లేను. చివరకు 'కారొచ్చింది. నేను వెళ్తున్నాను' అని చెప్పి వెళ్ళిపోయింది.

తలుపువేసిన చప్పుడువిని నేను హాల్లోకి వచ్చి చూశాను. శ్రావణి నిజంగానే వెళ్ళిపోయింది.

సమయం ఒంటిగంటవుతుంది.

ఆ హాల్ నిండా శ్రావణి జ్ఞాపకాలు, పున్నాగ పూల సౌగంధంలా, చిక్కటితెరల్లా వ్యాపించి ఉన్నాయి. ఆ చిక్కటి తెరలను తొలగించుకుని నేను ముందుకు అడుగు వెయ్యలేక, అక్కడే ఉన్న సోఫాలో కూల బడిపోయాను.

సోఫాలో పడి ఉన్న రిమోట్ ప్రెస్ అయ్యేసరికి, టీవీలో శ్రావణి ప్రత్యక్షమైంది.

పచ్చటిపైర్ల మధ్య, స్వేచ్ఛావిహంగంలా, విహ రిస్తూ కన్పించింది. కిలకిలా నవ్వుతూ హీరోను టీజ్ చేస్తూ నవ్వుతూ, ఎగురుతూ, చెరుకుముక్కను నము లుతూ చేతులు చాచి కెమేరా ముందుకు వస్తున్న అనేక షాట్లు చూస్తుంటే, తను నా కోసమే వస్తున్న ట్టనిపించింది.

నిన్ననే ఇదే సీను చూసినప్పుడు శ్రావణి నా పక్కనే ఉంది. అచ్చం సినిమాలో లాగానే టీవీ దగ్గ రకు వెళ్ళి చేతులుచాచి నా దగ్గరకొచ్చి, నా ఒళ్ళో కూర్చుంది.

టీవీ ఆఫ్ చేశాను.

మోయలేని బరువులా, శూన్యం, నా గుండెల మీద ఒత్తిడి పెంచసాగింది.

అథ్లెట్లు, క్రికెట్ ప్లేయర్లు పరుగెత్తేటప్పుడు గ్రిప్ ఉండడం కోసం స్పైక్‌షూస్ వేసుకుంటారు. ఆ ముళ్ళు భూమి పొరలను చీల్చి గ్రిప్ దొరికించుకుని, ఆటగాళ్ళు జారిపడకుండా కాపాడుతాయి.

అట్లాంటి బూట్లు వేసుకుని శ్రావణి నా గుండెలు చీల్చుతూ, పరిగెత్తుకుంటూ వెళ్ళిపోయింది. గుండె గాయమై రక్తం కన్నీరుగా మారి కంటికొలకుల దగ్గర కొచ్చి ఆగింది.

దిగమింగితే దుఃఖం.

బైటకు కార్చేస్తే విషాదం.

నాకో పాట గుర్తొచ్చింది.

'కల చెదిరింది, కథ మారింది, కన్నీరే యిక మిగి లింది'.

దుఃఖం నాకు అలవాటైందే!

నా జీవితంలో ఏ స్త్రీతో అయినా ఒకనాటితోనే సంబంధం ముగుస్తుంది. జలజ, డీసీపీ మేడం నన్ను మురిపించి, నేను ఆ జ్ఞాపకాల మధురిమ నుండి తేరు కోకముందే, నా జీవితం నుండే మాయమై పోయారు.

శ్రావణి కూడా అంతేనా?

శ్రావణి ఎడబాటును తట్టుకునే శక్తిలేదు నాకు.

ఐన్‌స్టీన్ e=mc2 అనే శక్తి తృత్వ సూత్రం కను క్కున్నాడు. దాని ప్రకారం శక్తి అనేది శాశ్వతం. దాన్నెవ్వరూ నాశనం చేయలేరు. కాకపోతే, ఒక స్థితినుండి ఇంకో స్థితికి రూపాంతరం చెందు తుంది.

అలాగే నా జీవితానికి కూడా ఎడబాటనేది శాశ్వతం అయినట్టుంది. కాకపోతే, ఒక వ్యక్తి వల్ల కాకపోతే అనేక వ్యక్తుల వల్ల. డీసీపీ మేడం వల్ల కాకపోతే శ్రావణి వల్ల.

అసలు ఆడవాళ్ళ మాయలో పడనే కూడదు. కానీ, పడ్డాక మనం పీకల్లోతు ప్రేమలో కూరుకుపోయాక వాళ్లేమో సుల భంగా తెంచేసుకుని పోతారు. ప్రతీసారీ నా గుండె వేయి వ్రక్కలవుతుంది. జలజ, డీసీపీ మేడంతో నా బంధం శాశ్వతం అయ్యే అవకాశమే లేదు. జలజ కేవలం శరీర సౌఖ్యానికి తప్ప ఎమోషనల్ అటాచ్ మెంట్ ఉన్న రిలేషన్‌షిప్‌కు పనికి రాదు. డీసీపీ మేడంతో సాన్నిహిత్యాన్ని నేనసలు ఊహించనే లేదు. అది ఒక 'వన్ నైట్ ఆఫర్'గానే భావించాను. అది అలాగే ముగిసింది కూడా. సయామ్‌ను, అతని గ్యాంగును మట్టుపెట్టానన్న యూఫోరి యాలో డీసీపీ మేడం నాతో శారీరకంగా కలిసింది. దానికి ప్రేమ అనే లోతైన పునాదే లేదు. ఓ మంచి స్నేహితురాలు, శ్రేయోభిలాషి విడిపోతుం దన్న ఎడ బాటు బాధే తప్ప, గుండె కోసి పట్టుకుపోయినంత విరహబాధ కలగలేదు.





కానీ, శ్రావణితో కలిసి చేసిన ఈ నెలరోజుల ప్రయాణంలో, నాకు కావలసిన భావాలను ఆమె ముఖంలో ప్రతిఫలించాలని చేసిన ప్రయత్నంలో ఆమెపట్ల ఒక అవ్యాజానురాగమైన ప్రేమ కలిగింది. ఈ నెలరోజుల గడువులో నేను సృష్టించిన పాత్రకు ప్రాణప్రతిష్ట చేసింది శ్రావణి. పదహారేళ్ళ లేలేత ప్రాయంలో యవ్వనపు ఆరంభదశలో ఉన్న యువతినుండి ఇరవై ఐదేళ్ళ ప్రౌఢగా రూపాంతరం చెందడం నాకు అద్భుతంగా తోచింది. ఆమె కెమేరా ముందు పలికించిన భావాలు, యదార్థమైనవే అనుకున్నాను. నా కోసమే అనుకున్నాను. మనసులోనే ఆమెను ఓన్ చేసుకోవడం ప్రారంభించాను. ఆ మోహా మాయపు వలలో  చిక్కుకుపోయాను.

అసలు నేను సినిమాలో హీరోయిన్ పాత్రను ప్రేమిస్తున్నానా లేక శ్రావణిని ప్రేమిస్తున్నానా అనే విషమస్థితిలో కొన్ని రోజులు ఉండిపోయాను. నిన్నటితో ఆ సందిగ్ధం తొలగిపోయింది. నేను నా హీరోయిన్ పాత్రను అభిమానించాను. కానీ, శ్రావణిని నా జీవన సహచరిగా ఆరాధిస్తున్నానన్న విషయం నాకైతే క్లారిఫై అయింది. నా మనసులోకి అడుగుపెట్టిన శ్రావణిని నా హృదయ ప్రాంగణంలో ప్రతిష్ఠిద్దామనుకున్న తరుణంలోనే 'ఇదంతా అవాస్తవం' అన్నట్టుగా, తను వేరే 'షూటింగ్'కు వెళ్ళిపోయింది. మరో సినిమాలో ఇంకో పాత్ర పోషించేందుకు వెళ్ళిపోయింది.

మెయిన్‌డోర్ తాళం తీస్తున్నట్టు చప్పుడు కావడంతో నేను ఉలికిపడి, ఆలోచనల నుండి తేరుకుని, చుట్టూ చూశాను. టైం ఆరవుతోంది. నా మనసులాగానే, ఇల్లంతా చీకటిగా ఉంది. ఇన్ని గంటలు, ఆలోచనల్లోనే, తీరం దొరకని నావికుడిలా మునిగి తేలుతున్నానన్న మాట.

ఎవరో లోపలకి వచ్చారు. కారిడార్‌లో ఉన్న లైట్ల వెలుతురులో ఒక క్రీనీడ కనిపించింది.

'శ్రావణి' అయితే బాగుణ్ణనుకున్నాను.

లైటు వేశాను. లైటు వేయగానే, ఎదురుగా 'శ్రావణి'.

నా భయాలన్నీ పటాపంచలై పోయాయి.

నా శ్రావణి నా దగ్గరకొచ్చేసింది.

నేను ఒక్క ఉదుటున లేచి 'ఐ లవ్యూ, ఐ లవ్యూ!' అంటూ కౌగలించుకున్నాను.

'ఒక్క నిమిషం' అంటూ శ్రావణి నన్ను విడిపించుకుని పక్కన నిలబడింది.

ఆమె వెనకాలే ఉన్న మేనేజర్, డ్రైవర్ ఆశ్చర్యంతో నోరెళ్ళబెట్టడం చూసి నేను కూడా శ్రావణికి దూరంగా జరిగి సోఫాలో కూర్చున్నాను.

ఒక ఆక్వర్డ్ సిచ్యుయేషన్.

నవీన్ వచ్చాక నెక్స్ట్ షెడ్యూలు వేద్దామని మేనేజరును, కాసేపు వెయిట్ చేయమని డ్రైవరుకు చెప్పి పంపించాను. వెళ్తూ వెళ్తూ వాళ్ళు తలుపు మూసేశారు.

వాళ్ళు వెళ్ళిపోయిన తర్వాత, శ్రావణి నా పక్కనే వచ్చి కూర్చుంది.

పది నిమిషాల వరకూ ఏం మాట్లాడుకోలేదు మేమిద్దరం.

'లవ్ సీనా?'

శ్రావణి నా వంక అదోలా చూసింది.

'నా లవ్ ఇక్కడుంటే, సీను అక్కడెలా ఉంటుంది?' అని నా పెదాలపై ముద్దుపెట్టుకుంది.

'వారెవ్వా, ఏం ఆడాళ్ళురా బాబూ! ఒక్క చిన్న చూపుతో గుండెకు గాయం చేస్తారు; ఇంకొక్క చిన్న జెస్చర్‌తో వేయి ముక్కలైన గుండెను అతికించి ప్రాణం పోస్తారు' అనుకున్నాను, ఆమె ముద్దు మాధుర్యం మనసులో మరులు గొలుపుతుంటే....

"తిన్నావా?" అడిగింది.

"నువ్వు?"

"లేదు"

"లేదు"

తను అడిగేవరకు నాకు ఆకలే తెలియలేదు.

శ్రావణి గబగబా వెళ్ళి రెండు కప్పుల్లో కాఫీ తెచ్చింది. కాఫీ తాగిన తర్వాత 'అయ్యగారి అలక తీరిందా?' అని నా బుగ్గలు పిండింది.

నేను 'ఊ' అని తలూపాను సిగ్గుపడుతూ.

•••

తర్వాత ఇద్దరం కలిసి 'ఓ్రీస్'లో భోజనం చేసి వచ్చిన తర్వాత, నేను శ్రావణిని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్న విషయం చెపుదామనుకుంటున్న తరుణంలోనే తను తన గతమంతా చెప్పి వెళ్ళిపోయింది.

ఇప్పుడు, నన్ను అందరూ వదిలి వెళ్ళిపోయారు.

కానీ, నేను ఇవన్నీ మరిచిపోవాలి. నా జీవిత లక్ష్యమైన సినిమా  మీద కాన్సన్‌ట్రేట్ చేయాలి. దానికి తోడు అవార్డుల, పోటీల సీజన్ ప్రారంభమవుతుంది. కాబట్టి ఆ రేసులో నిలబడాలంటే తొందరగా సినిమా ముగించాల్సిన అవసరముంది. శ్రావణిని మరిచిపోవాలి, మిగిలిన సినిమా కంప్లీట్ చెయ్యాలి.

అందుకే అభిషేకం గారితో మిగిలిన షూటింగ్ షెడ్యూల్ గురించి చర్చించాను. ఒక పది రోజులు ఉస్మానియా యూనివర్సిటీలో, సిటీలో ఔట్‌డోర్‌లో ఒక పదిరోజులు, రామప్పగుడిలో మూడు రోజులతో మిగిలిన సినిమా పూర్తి కావాలని అందరినీ సంసిద్ధం చేయమని చెప్పాను.

రుస్తుంపేటలో తీసిన సినిమా రష్‌ను బేస్‌గా తీసుకుని మిగిలిన స్క్రీన్‌ప్లేలో ఇన్‌కన్సిస్టెన్సీస్ ఏమైనా ఉన్నాయేమో చూడమని కొత్తగా చేరిన యంగ్ అసిస్టెంట్ డైరెక్టర్‌కి చెప్పాను. ఎందుకంటే, మిగిలినవాళ్ళంతా పాతవాళ్ళు కాబట్టి వాళ్ళకు తప్పులు దొరకవు. అదీకాకుండా, అతనిలో నేను స్పార్క్ గమనించాను. అందుకే, ఆ అవకాశం అతనికి ఇచ్చాను. అతను పొంగిపోయాడు.

ఎందుకంటే, కొత్తగా వచ్చిన అసిస్టెంట్ డైరెక్టర్లను గ్లోరిఫైడ్ ఆఫీస్ బాయ్స్‌గానే చూస్తారు. అవీ ఇవీ అందించడం, మేనేజర్‌కు, ప్రొడక్షన్‌కు అసిస్ట్ చేయడం వరకే పరిమితం చేస్తారు. తెలుగు చేతి రాత బాగుంటే, స్క్రిప్టు రాయిస్తారు. వాళ్ళల్లో జిజ్ఞాస ఉంటే షూటింగ్ సమయంలో అన్నీ గమనిస్తూ చూసి నేర్చుకోవాల్సిందే! చాలామంది అసిస్టెంట్లు, ఎప్పటికైనా డైరెక్టర్ అవుదామని కలలు కంటూ వచ్చిన వాళ్ళే. ఇక్కడ కళామతల్లి కర్కశ పాదాల కింద నలిగిపోయే వాళ్ళే. వాళ్ళల్లో ఉండే ఫ్రెష్‌నెస్, సృజనాత్మకత అంతా ఇక్కడి రొచ్చుగుంటలోపడి మకిలి పట్టి పోతుంది. ఆకలికి ఆగలేనివాళ్ళు, వయస్సు మీద పడుతూ ఉంటే ఇంకా జీవితంలో సెటిల్ కాలేకపోతున్నామని రాజీ పడిపోయిన వాళ్ళే ఏళ్ళ తరబడి అసిస్టెంట్లుగా పనిచేస్తుంటారు. కానీ, వారిలో నుంచే అప్పుడప్పుడు ఆణిముత్యాల్లాంటి వాళ్ళు బైటికొస్తారు. వాళ్ళే ప్రపంచం నివ్వెరపోయే అద్భుతాలు సృష్టిస్తున్నారు.

ఈ బాధంతా పడలేని వాళ్ళు తామే సొంతంగా సినిమా నిర్మించి దర్శకత్వం చేపడతారు, నాలాగా.

•••

రామప్పలో షూటింగ్ ఖరారైంది.

హీరో యూనివర్సిటీలో చదువుకుంటున్న ప్రస్తుతంలో (present day) తనతో పాటే చదువుతున్న ఒక అమ్మాయి ప్రేమలో పడతాడు. ఆ సందర్భంగా హీరో హీరోయిన్ల మధ్య శృంగార భావనలు పెంపొందించాలంటే వాళ్ళు అట్లాంటి దృశ్యమేదో చూడాలి. ఏదో ఒక తెలుగు సినిమాలోని శృంగార పరమైన పాట చూపించి కూడా వాళ్లిద్దరి మధ్య ప్రేమ భావనలు పుట్టినట్టుగా చూపించ వచ్చును.

అయితే, నాకలా కృత్రిమ సంఘటనలతో కథను నింపడం ఇష్టం లేదు. ఒక నిజజీవిత చిత్రణకు, విద్యార్థి జీవితంలోని యదార్థ సంఘటనలనే చిత్రకథలో రాసుకోవాలి. అందుకే  విద్యార్థులంతా రామప్పకు పిక్నిక్‌కు వెళ్లినట్టు స్క్రిప్టులో రాసుకున్నాము.

దీనివల్ల నాకు ఒక ప్రయోజనం కూడా నెరవేరుతుంది. అవార్డుల కోసం పోటీపడే సినిమాల్లో ఆయా ప్రాంతాల్లోని శిల్పకళా వైభవాన్ని, జానపద కళాకారులను, స్థానిక ఆచార వ్యవహారాలను, ప్రాంతీయ

**తెల్లారి తీయబోయే సీను గురించి, సరైన లీడ్ దొరక్క ఆలోచిస్తున్న దర్శకుడికి తలుపు తట్టిన చప్పుడైంది. వెళ్ళి తీశాడు. ఎదురుగా అభిషేకంగారు. సార్ మన హీరో కనిపించటం లేదు కంగారుగా అన్నాడాయన. దర్శకుడు కూడా భయపడి, ఏమైంది? ఎటెళ్లాడు? అంతటా వెతికారా? అంటూ ప్రశ్నల వర్షం కురిపించాడు. ఇంతకీ హీరో ఏమైనట్టు?**



జాతరలను ఏదోవిధంగా కథలో మిళితం చేయాలి.

రామప్పను 'brightest gem in the galaxy of Medical Deccan Temple Architecture' అని చరిత్రకారులు వర్ణిస్తారు. శిల్ప కళా వైభవానికి, శిల్ప చాతుర్యానికి ప్రతీక రామప్ప. గుడి పైకప్పుమీద క్షీరసాగర మథనం, జీవం ఉట్టి పడే నందీశ్వరుడు, త్రయోదశి రంధ్రాలున్న శిల్ప స్తంభాలు ఒక ఎత్తయితే ముఖద్వారం ముందున్న 'రాగిణి', 'నాగిని' శిల్పాలు మరొక ఎత్తు.

800 సంవత్సరాల క్రితమే పాదాలకు హైహీల్స్, చెవులకు అరచేతి మందమున్న ఇయర్ రింగ్స్, జీరోసైజు నడుము, 36-36 సైజులున్న నిలువెత్తు విగ్రహాలు చూపరులను కట్టి పడేస్తాయి.

ఇంతటి ఘన శిల్పచరిత్ర ఉన్న దేవాలయం కంటే మంచి పిక్నిక్ స్పాట్ ఏముంటుందనుకుని, కొన్ని పిక్నిక్ సీన్లను ప్లాన్ చేశాం.

స్క్రిప్ట్ ప్రకారం విద్యార్థులందరూ రామప్పకు వస్తారు. హీరో హీరోయిన్ల మధ్య కొంత చనువు ఏర్పడుతుంది. ఒక రొమాంటిక్ మూడ్‌లోకి వెళ తారు. అక్కడ హీరోయిన్ తనను ప్రేమిస్తుందా? లేక టైంపాస్ కోసం వాడుకుంటుందా? అన్న ప్రశ్న హీరోలో రేకెత్తించి, ఆ ఎపిసోడ్‌ను అక్కడ ముగించి, యూనివర్సిటీలో కంటిన్యూ చేసి, ఆ హీరోయిన్, అమెరికా నుండి తన బాయ్‌ఫ్రెండ్ రాగానే, అత నితో వెళ్లిపోతే, ఆమె తనను నిజంగానే టైంపాస్ కోసం వాడుకుందని అర్థం చేసుకున్న హీరోకు కను విప్పు కలుగుతుంది.

సినిమాలో, ఇది రెండో హీరోయిన్ పాత్ర.

ఈ పాత్రకు రీటా జాన్సన్ అనే గోవా అమ్మా యిని ఎంపిక చేశాం. పెద్దగా డైలాగులు లేవు. ఉన్న

## సినీవాలి
## కూపన్ నెం.14 విజేత
## కొర్రపాటి పద్మావతి
**రామచంద్రనగర్, అనంతపురం**

రెండు మూడు సీన్లలో, పాత్రపరంగా, తెలుగు రాన ట్టుగా, యాక్సెంటుతో పట్టిపట్టి మాట్లాడాలి. అందుకు ఆమె బాగా సూటయింది.

పల్లెటూరులో 'రత్తి' పాత్రను బాగా బలంగా సృష్టించాం. ఎందుకంటే, ఆమె ప్రేమలో సిన్సియా రిటీ ఉంది. అలాగే, ఆమె కోపంలో కూడా సిన్సియారిటీ ఉంది. కానీ, ఈ రెండో హీరోయిన్‌కి, ఇప్పటి యువత లాగా, జీవితంలో ఏ విషయంపై కూడా సీరియస్ నెస్ లేదు. హీరో హీరోయిన్ల మధ్య సాన్నిహిత్యా నికి ప్రేమ అనే బలమైన పునాది లేదు. హీరోను కౌగలించుకుంటుంది. ముద్దు పెట్టుకుంటుంది. కానీ, హీరో దగ్గరగా వస్తే నెట్టేస్తుంది. ఒక క్షణం అతనే తన సర్వస్వం అన్నట్టుగా ప్రవర్తిస్తే, మరు క్షణంలో అతనెవరో తెలియనట్టుగా ముఖం తిప్పు కుంటుంది. ఆ పాత్రకు తగ్గట్టుగానే, కొంచెం నెగె టివ్ షేడ్స్ ప్రతిఫలించే ముఖకవళికలున్న నటినే ఎంపికచేశాం.

రామప్పలో టూరిజం వారి అద్భుతమైన కాటే జెస్ ఉన్నాయి. రోడ్డు మీద నుండి ఓ ఇరవై మెట్లు ఎక్కితే కాటేజెస్ ఉంటాయి.

ఒక హిందీ రొమాంటిక్ సినిమాలోని సెట్టింగ్సులా ఉంటాయి. నిలువెత్తు కిటికీ అద్దాలలో నుంచి చెరువు, అడవిలోని చెట్లు, సీతాకోకచిలుకలు, పక్షులు, పువ్వులు కనిపిస్తూ మధురోహలు పుట్టిస్తుంటే, బైటకు అడుగుపెడితే నవంబర్ చిరు చలి... ఓహ్.. మది ప్రణయరాగాలు పాడుతోంది. వయస్సు ఒంటితో పోరాడుతోంది. నాలో శ్రావణి జ్ఞాపకాలు మంటలు పుట్టిస్తున్నాయి. షూటింగ్‌కు వచ్చిన పిల్లలు కేరింతలతో ఎంజాయ్ చేస్తున్నారు.

నా వయసువారే అయినా నేను వాళ్లతో కలవ లేకపోయాను. డైరెక్టర్ అనే కాక విషాదసంద్రంలో మునిగిన నా మనస్సూ, ఎంత కాదనుకున్నా నవీన్ లేని లోటూ నన్ను ఒంటరిని చేశాయి.

కానీ, అందరికీ రామప్పలో సరిపోయేన్ని రూములు లేవు. అందుకే, కొంతమందికి ములుగులో, ఇంకా కొంతమందికి వరంగల్లులో రూములు బుక్ చేశాం.

మొదటిరోజు షూటింగ్ ఏ ఆటంకం లేకుండా సాఫీగా సాగిపోయింది. ఆన్‌స్క్రీన్ శృంగారం బాగానే పండిది. రెండో హీరోయిన్‌కి ఎటువంటి ఇన్హిబిషన్స్ లేవు. మేము ఒకింత ఎక్స్‌పోజ్ చేయమంటే, దానికి రెండు రెట్లు చేసింది. మేమే తట్టుకోవాల్సి వచ్చింది.

అర్థరాత్రి అభిషేకం గారు నా గది తలుపు తట్టారు.

నేను నిద్రపట్టక పక్కమీద దొర్లుతున్నాను. రేపటి సీను గురించి సరైన లీడ్ దొరక్క, ఏమీ ఆలో చించలేక సతమతమవుతున్నాను.

ఆ రోజు శృంగార సన్నివేశాలను షూట్ చేస్తుంటే నాకు ప్రతీ ఫ్రేములోనూ శ్రావణే కనిపించింది. కెమేరా ఆన్ చేయగానే తనే నవ్వుతూ ప్రత్యక్షమైంది. మనసు గుర్రాన్ని బంధించి, షూటింగ్ ముగించాను కానీ, ప్యాకప్ చెప్పి రాత్రి రూముకొచ్చాక మాత్రం

**ఈవారం సినీవాలి చదివారు కదా!**
**మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి**
**కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!**

**సినీవాలి -16 (1-2-2017)**

మా ప్రశ్న: సినిమాలో రెండో హీరోయిన్ పాత్రకు ఎవరిని ఎంపిక చేశారు

మీ జవాబు--------------------------------------------------

చిరునామా--------------------------------------------------

----------------------------------------------------------

------------------------------పిన్------------------ఫోన్‌నెం--------------------

**ఈ కూపన్‌ను 31 జనవరి 2017 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.**

మా చిరునామా: నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33

శ్రావణి ఆలోచనలు నన్ను ముసురుకుని తనివి తీరా హింసిస్తున్నాయి.

అందుకే అభిషేకం గారు తలుపు కొట్టగానే వెంటనే తలుపు తీసి, "ఏమైంది?" అన్నాను గాభరాగా.

సినిమా అనేది మోస్ట్ అన్‌ప్రెడిక్టబుల్ వ్యవహారం. అనూహ్యమైన సంఘటనలెన్నో జరిగే అవకాశమున్న ప్రక్రియ. ఓ యాభై, వందమందిని మామూలుగా మేనేజ్ చేయడమే కష్టం. అలాంటిది ఔట్‌డోర్ షూటింగ్‌లో ఏ చిన్న పొరపాటు జరిగినా పెద్ద మూల్యమే చెల్లించాల్సి ఉంటుంది. అందుకే, ఔట్ డోర్ షూటింగ్ అంటే కేవలం ప్రతిభ, ఆర్గనైజింగ్ కేపబిలిటీస్ కాదు, చాలా అదృష్టం తోడై ఉండాలి. దాదాపు వందమంది టీం మెంబర్ల భార్యాపిల్లలు, బంధువులు హైదరాబాద్‌లోనో, మిగిలిన ఊళ్లల్లో, దేశవిదేశాల్లోనో ఉంటారు. వాళ్లందరూ అక్కడ క్షేమంగా ఉంటేనే ఇక్కడ షూటింగ్ నిరాటంకంగా జరుగుతుంది. ఎవరికి ఏమైనా, ఏ చిన్న ఎక్విప్‌మెంట్ మొరాయించినా, ఒక్క నట్టు సరిగ్గా తిరగకపోయినా, ప్రకృతి సహకరించక పోయినా షూటింగ్ ఆగిపోతుంది. లక్షలకొద్దీ డబ్బు వృథా అవుతుంది. పెద్దపెద్ద సినిమాల షూటింగులు కూడా ఏవో చిన్నచిన్న అవాంతరాలొచ్చి ఆగిపోయిన ఉదంతాలు ఎన్నో ఉన్నాయి.




అందుకే, అభిషేకం గారు నా దగ్గరకొచ్చి, తలుపు తట్టేసరికి, షూటింగ్ క్యాన్సిల్ చేయాలేమోనన్నదే నాకు కలిగిన మొట్టమొదటి భయం, ఆలోచన! తలుపు తీసేసరికి ఎదురుగా ఉన్న అభిషేకం గారు గుర్రమెక్కి స్వారీ చేసి ఉన్నాడు. వాసన గుప్పుమంది.

"సారీ సర్!" అన్నాడు తలుపు పట్టుకుంటూ.

"ఓకే, ఏమైంది?" అన్నాను చిరాకుగా.

"మన హీరో కనిపించడం లేదు సార్!" అన్నాడు.

నా గుండె జారిపోయింది. 'రామప్పగుడి పక్కనే కాకతీయుల నాటి చెరువు ఉంది. అందులో ఏమైనా..?' ఆ భయాన్ని బైటపెట్టకుండా,

'అంటే?' అన్నాను.

"రేపటి సీన్ గురించి డిస్కస్ చేద్దామని వెళ్తే తన రూములో లేడు సార్!" అన్నాడు.

"అంతటా చూశారా? మేనేజర్‌కి చెప్పి వెతికించండి" అన్నాను.

"ఆ, ఆ, ఆ... అదీ ఆ అవసరం లేదు సార్!" అన్నాడు.

మందు బాగా తలకెక్కినట్లుంది, ఇన్‌కొహరెంట్‌గా మాట్లాడుతున్నాడనిపించింది. ఈ టైంలో జోకు లేంటో అనుకుని, చిరాకుగా,

"అభిషేకం గారూ! ఏంటండీ మీరు మాట్లాడేది? హీరో లేడంటారు, వెతకాల్సిన పని లేదంటారు? ప్లీజ్, స్ట్రెయిట్‌గా చెప్పండి!" అన్నాను.

'అదేసార్! హీరో రూములో కన్పించడం లేదు. అంతటా వెతికాం. లేడు. కానీ, హీరో హీరోయిన్ రూములో ఉన్నాడు సార్!" అన్నాడు దగ్గరకొచ్చి, చెవిలో చెబుతూ. అంత దగ్గరగా వచ్చేసరికి కంపు వాసన కొట్టింది అతని శ్వాస.

"షిట్!" అని విసుక్కున్నాను.

హైదరాబాద్‌లో, షూటింగులో ఉన్నప్పుడు రాత్రిళ్లు ఎక్కడ గడిపినా ప్రొడ్యూసర్లకు సంబంధం లేదు. నిజానికి ఔట్‌డోర్లో కూడా మనకు బాధ్యత లేదు.

హీరోహీరోయిన్లతో రోజంతా రొమాంటిక్ సీన్స్ షూట్ చేయడం జరిగింది. ఒక్క సీను టేక్స్, రీ టేక్స్‌తో షూట్ చేయడం మూలంగా, వాళ్ళిద్దరి మధ్యన అనేకసార్లు శారీరక స్పర్శలు (bodily touches) ఉంటాయి. సహజంగానే వాటివల్ల యవ్వనంలో ఉన్న వారి మధ్య, స్క్రీన్ మీద పండించాల్సిన ప్రణయంతో పాటూ, నిజజీవితంలో కూడా రొమాంటిక్ భావనలు పెరుగుతాయి.

'అంతా కేవలం నటనే, మాకేం కాదు' అని ప్రెస్సుకు, ప్రపంచానికి హీరోయిన్లు చెప్పినా, అదంతా ప్యూర్ నాన్సెన్స్! స్త్రీ పురుషుల శరీరాలు పెనవేసుకున్నప్పుడు 'బాడిలీ రియాక్షన్స్' కలగడమన్నది చాలా సహజం. అలా కాకపోవడానికి వాళ్లేం సర్వసంగ పరిత్యాగులేం కాదు. వయసు మళ్లిన వాళ్లూ కాదు. బాగా పుష్టిగా ఉండి, నిండు యవ్వనంలో ఉండి మందూ, విందులతో కాలం గడుపుతున్నవాళ్లు.

ఆ అమ్మాయిది గోవా. వాళ్లకు ఇట్లాంటి పట్టింపులు ఉంటాయో ఉండవో నాకు తెలియదు. కానీ రాం కూడా ఇట్లాంటి వాడంటే నాకు నమ్మకం కలగలేదు.

అందుకే "ఏం చేద్దాం?" అని అభిషేకం గారిని అడిగాను.

నవీన్ ఉంటే ఈ సమస్యని, అసలు సమస్య అనుకుంటే, నా వరకు వచ్చేదే కాదు.

"పిలిచి నాలుగు చీవాట్లు పెట్టండి సార్! బయటకు తెలిస్తే బ్యానర్ పరువు పోతుంది సార్! ఔట్ డోర్లో, షూటింగ్ జరుగుతున్నప్పుడు తప్పుసార్! షూటింగ్ లేనప్పుడు, బయట, వాళ్ల చావు వాళ్లని చావనీయండి. కానీ ఇక్కడ మాత్రం కుదరదు సార్!" అన్నారు అభిషేకం గారు.

నేను కూడా అదే అనుకున్నాను.

"ఫోన్‌చేసి నేను రమ్మంటున్నానని చెప్పి పిలవండి. చూద్దాం" అన్నాను.

ఫోన్ ఆఫ్ చేసి ఉంది.

ఇక తప్పక, అభిషేకం గారు వెళ్లి హీరోయిన్ తలుపు కొట్టారు. నేను కూడా పక్కనే నిలబడి ఉన్నాను.

"కౌన్ హై?" అంది రీటా.

"కో డైరెక్టర్!" అన్నారు అభిషేకం గారు.

"ఇంత రాత్రి ఏంటీ న్యూసెన్స్!" అంది, నిద్రమత్తులో.

"రూములో నీతోపాటు ఎవరున్నారు?" అని గద్దించాడు.

అప్పుడు తనకు బల్బు వెలిగినట్టుంది. వణుకుతూ తలుపు తీసింది. ఒంటిమీద బట్టలు సరిగా లేవు. మంచంలో హీరో గారు, కలిగిన డిస్టర్బెన్స్‌కు అసహనంగా కదులుతున్నారు.

"సారీ సర్!" అంది నన్నుచూసి. సిచ్యుయేషన్ ఆక్వర్డ్‌గా ఉంది. సంగతి తెలిసిపోయింది.

ఈ విషయాన్ని పెద్దదిచేసి రచ్చరచ్చ చేసుకుంటే, మిగిలినవాళ్లు చూస్తే, మన పరువే పోతుందనుకుని,

"నేను రూముకు వెళ్తున్నాను. వాణ్ణి లేపి, బట్టలు తొడిగి తీసుకురండి" అనిచెప్పి, విసురుగా నా రూమువైపు నడిచాను.

పది నిమిషాల్లో, రాం నా ముందు నిలబడ్డాడు.

వెకిలిగా నవ్వుతూ, "ఆమెకు తెలుగు డైలాగులు నేర్పుతున్నాను సార్!" అన్నాడు.

"ఏదీ పక్కలోనా? తెలుగు నేర్పడానికి బట్టలు విప్పాలా?" అన్నారు అభిషేకం గారు.

నాకు కోపం తగ్గిపోయింది. అభిషేకం గారు నన్ను ఉసిగొల్పి అక్కడకు తీసుకెళ్లారుగానీ, ఇదో పెద్ద సమస్య కాదు.

"సరే! ఓకే. జాగ్రత్త! మళ్ళీ ఇంకోసారి షూటింగులో ఇలా జరగకూడదు. నేను పెద్ద ఉపన్యాసాలు ఇవ్వదలుచుకోలేదు గానీ, పైకి రావాల్సిన వాడివి. ఇది నీ క్యారెక్టర్‌పై, నీ ఫ్యూచర్‌పై బ్లాక్‌మార్క్! నువ్విలా చేస్తావని నేననుకోలేదు. యూ లెట్ మీ డౌన్!" అని వెళ్లమని చెప్పాను.

కొంతమంది ప్రవర్తన వల్ల సినిమారంగం పరువు గంగలో కలుస్తుంది.

సెక్స్, మందు, డ్రగ్స్, క్రైం - టాలీవుడ్‌ను పట్టిపీడిస్తున్న జాడ్యాలు. అదేమి ఖర్మోగానీ, ఈ నాలుగు దుర్గుణాలు ఈ సినిమాను అనుకున్నప్పటి నుంచీ, నన్ను వేటాడి వేధిస్తూనే ఉన్నాయి.

ఈ సంఘటన ఎందుకో బాధ కలిగించింది. ఏదో నిరాశ, నిస్పృహ ఆవరించింది. షూటింగ్ టైములో అస్సలు రాకూడని భావన. ఎందుకంటే డైరెక్టరే డల్‌గా అయితే, యూనిట్లో ఎవ్వరికీ ఉత్సాహం ఉండదు. తిట్టినా, కొట్టినా, మెచ్చుకున్నా, బుజ్జగించినా - డైరెక్టరే, యూనిట్‌ను తండ్రిగా నడపాల్సిన వాడు.

'వాళ్లకు ఎంతధైర్యం లేకపోతే, ఇంతలా బరి తెగిస్తారు. డైరెక్టర్ పక్క రూములో, షూటింగ్ సమయంలో కామకేళీ విలాసాలా?'

వరండాలో, నెమ్మదిగా, విచారంగా పచార్లు చేస్తున్న నన్ను చూసి, అభిషేకం గారు నా భుజం మీద చెయ్యి వేశారు, ఆప్యాయంగా. నేను ఉలికిపడి ఆయనను చూశాను.

"ఇవన్నీ మనసులో పెట్టుకోకండి సార్! మీకు తండ్రిలాంటి వాణ్ణి. ఇవన్నీ చూసి చూసి రాటుదేలిపోయిన వాణ్ణి. ఆ రోజుల్లోనే ఎం.ఎ., ఎం.ఫిల్ చేసి సినిమా మోజులో పడి నా పాండిత్యాన్ని, సాహిత్యంలో నాకున్న ప్రతిభను ప్రదర్శించాలని, ఇక్కడ సినీ కళామతల్లికి సేవచేద్దామని ఈ రంగానికి

వచ్చాను. ఒక్క నెలలోనే కలల ఆకాశం మీదనుండి కఠిన నేలమీద దభీమని పడ్డాను".

"ఏంటి సార్! మీరు ఫీల్డుకు వచ్చినప్పుడు కూడా ఇంతేనా?" అన్నాను నేను కుతూహలంగా.

సినిమా కష్టాలకు విరుగుడూ, మందూ - సినిమా ముచ్చట్లే.

నా ఇంట్రెస్ట్ గమనించి, ఇక రెచ్చిపోయారు అభిషేకం గారు.

"నేను వచ్చినప్పటి నుండే ఏమిటి సార్? 'సినిమా' అన్నది పుట్టినప్పటి నుంచి, లాస్‌ఏంజెల్స్‌లో మొట్టమొదటి స్టూడియో కట్టినప్పటి నుంచే ఈ అవలక్షణాలు ఉన్నాయి. అమెరికాలో కూడా మొదట్లో ఇటువంటి గుత్తాధిపత్యమే ఉండేది. దాని మీదనే తిరుగుబాటు జరిగింది.

అమెరికాలో మొదట్లో ముడిరీళ్ల సరఫరా, పంపిణీ అంతా 'సిండికేట్' చేతిలోనే ఉండేది. అప్పుడు కేవలం ఒకటి రెండు రీళ్లకు మించి సినిమాలు తీయొద్దని ఆంక్షలు ఉండేవి. ఆ నిబంధనను వ్యతిరేకించిన వారికి స్టూడియోలు దొరక్కపోవడం, ప్రదర్శించడానికి థియేటర్లు దొరకక పోవడం వంటి కష్టాలుండేవి, అచ్చం ఇప్పుడు టాలీవుడ్లో మాదిరిగానే.

ఆ అణచివేతకు వ్యతిరేకంగానే, మొదటి ప్రపంచ యుద్ధం సమయంలో, న్యూజెర్సీ నుండి, న్యూయార్క్ నుండి సినిమా పరిశ్రమలోని కొంతమంది ఔత్సాహికులు లాస్‌ఏంజెల్స్‌కు వెళ్లి, అత్యంత చౌకగా వేలాది ఎకరాలు కొని మహామహా, పెద్దపెద్ద స్టూడియోలు స్థాపించారు".

మెల్లిగా నడుస్తూ నా రూము ముందుకొచ్చి నిలబడ్డాం.

చేయివేస్తే అందేంత దూరంలో, ప్రశాంతంగా ఉన్న రామప్ప చెరువూ, చల్లటి గాలీ, పున్నమి వెన్నెలా ఎంతో ఆహ్లాదకరంగా ఉంది వాతావరణం. కానీ, గుండెల్లోనే దుఃఖం పొంగుతోంది. శ్రావణిని మర్చిపోలేక పోతున్నాను. ఈ అద్భుత, సుందర ప్రకృతి చిత్రంలో లోటు ఒక్కటే, శ్రావణి లేకపోవడం!

నిద్ర తేలిపోయింది.

అసలే నాకు నిద్ర చాలాతక్కువ. చీమ చిటుక్కుమన్నా మెలకువ వస్తుంది. చెరకుగడను రెండు రంపపు పళ్ల యంత్రం మధ్య పెట్టి మధుర రసమంతా కారి పిప్పి వచ్చేంతవరకూ తిప్పినట్టుగా, నా మనసును ఆలోచనలనే రంపపు యంత్రంలో పెట్టి నలిపేసినట్టుగా ఉంటుంది నాకు.

ఎలాగూ నాకు నిద్ర రావడం లేదు. కాబట్టి అభిషేకం గారిని లోపలికి వచ్చి కూర్చోమన్నాను. ఆయన ఇబ్బందిగా ముఖం పెట్టినా, వచ్చి లోపల కూర్చున్నాడు.

"ఎందుకు సార్! మరి కెరీర్‌ను కూడా పణంగా పెట్టి తాగుడుకు అలవాటు పడ్డారు?" అని అడిగాను.

"ఏం చెప్పాలి సార్! మొదట్లో ఎంతో ఆదర్శప్రాయంగా జీవించాలని, అద్భుతమైన కథలు, పాటలు పట్టుకుని నేను తిరగని ప్రొడ్యూసర్ లేడు సార్! ఎక్కే గడపా, దిగే గడపా! నా మీద నాకు నమ్మకం పోయి, నేనో పేడపురుగునో, నీచ నికృష్ట కీటకాన్నో అని నన్ను నేను చీదరించుకునేంతగా నన్ను నాశనం చేసింది సార్, ఈ చిత్రసీమ. అక్షరం ముక్క రానివాళ్లు కథారచయితలు, మహాకవులుగా చలామణి అవుతుంటే ఎం.ఏ; ఎంఫిల్ చేసి శ్రీశ్రీ లాంటి రచయిత చేతులమీదుగా యువకవి అవార్డును అందుకున్న నేను ఆఫీస్ బాయ్‌గా పనిచేసి పొట్ట పోసుకున్నాను సార్! ఇక్కడ తెలివి, విద్వత్తు, అందం, నటన ఏమీ పనికిరావు సార్!

ఇక్కడ 'చెంచాగిరీ' ముఖ్యం సార్!

ఇక్కడ 'కులం' ముఖ్యం సార్!

ఇక్కడ 'డబ్బులు' ముఖ్యం సార్!

ఈ కఠోర సత్యం తెలుసుకునేసరికి వయసు మీద పడిపోయింది. ఆఫీస్ బాయ్‌నుండి అసిస్టెంట్ డైరెక్టర్, అసిస్టెంట్ డైరెక్టర్ నుండి కో డైరెక్టర్ కావడానికి ముప్ఫై ఏళ్లు పట్టింది సార్! ఇప్పటి దర్శక ప్రముఖులను, బడా నిర్మాతలను చూస్తే కడుపు రగిలిపోతుంది. రగిలిన కడుపును దీంతోనే చల్లారుస్తాను సార్! వీళ్ల బతుకులన్నీ నాకు తెలుసు సార్! వీళ్లు ఎన్నెన్ని మోసాలు, నక్కజిత్తులు వేసీ, కాపీలుకొట్టీ, పక్కభాషా సినిమాలు ఎత్తుకొచ్చీ సినిమాలు తీశారో అన్నీ నాకు తెలుసు" అన్నారు అభిషేకం గారు, ఆవేశంగా.

"అయితే మనకంటే, ఎంతో కొంత బాలీవుడ్ నయమన్న మాట?"

"ఏం బాలీవుడ్ సార్? అక్కడ ఉండే అవలక్షణాలు అక్కడా ఉన్నాయి. బాలీవుడ్ మొత్తం మాఫియా కంట్రోల్లోనే నడుస్తుంది కదా సార్!"

"నిజంగానా?"

"ఏం సార్! మీకు తెలియదా, ఐఐటి ముంబైలో చదివారు? మీకు బాలీవుడ్ గురించి తెలియదా?"

"మీరు భలేవారే సార్! ముంబై ఐఐటిలో చదివితే బాలీవుడ్ గురించి ఎలా తెలుస్తుంది సార్? హైదరాబాద్‌లో ఉన్నవాళ్లకు టాలీవుడ్ లోపల జరిగే తతంగమంతా తెలుస్తుందా?" అని ప్రశ్నించాను.

"అవును. అదీనిజమే! బాలీవుడ్‌లో ఇప్పుడిప్పుడు లావాదేవీలన్నీ రహస్యంగా జరుగుతున్నాయి కాబట్టి మాఫియా లింక్స్ బైటికి పొక్కకుండా జాగ్రత్త పడుతున్నారు గానీ, ఓ రెండు దశాబ్దాల క్రితం వరకు బాలీవుడ్డును మాఫియానే రూల్ చేసింది కదా!" అంటూ సర్దుకుని కూర్చున్నాడు. అంటే సెషన్ పెద్దగానే ఉండబోతుందన్న మాట.

"1970 ప్రాంతంలో బొంబాయిని గడగడలాడించిన అండర్ వరల్డ్ డాన్ హాజీ మస్తాన్. బొంబాయి నగర వీధుల ఫుట్‌పాత్‌ల మీద పెరిగి, డాక్‌యార్డులో పోర్టరుగా చేరి, బంగారం స్మగ్లర్‌గా రూపాంతరం చెందిన మస్తాన్ హైదర్ మీర్జా అలియాస్ హాజీమస్తాన్, మొదటిసారిగా బాలీవుడ్‌తో సంబంధాలు పెట్టుకున్నాడు. మస్తాన్, మధుబాలకు వీరాభిమాని. కానీ, మధుబాల 36 ఏళ్ల వయసులోనే 1969లో చనిపోవడంతో మధుబాల పోలికలు కొట్టొచ్చినట్టు కనిపించే సోనా అనే డ్యాన్సరును పెళ్ళి చేసుకున్నాడు. ఆమె పేరుని షాజహాన్ బేగంగా మార్చి ఆమెతో సినిమాలు తీశాడు. హాజీ మస్తాన్ జీవిత చరిత్రను ఆధారంగా చేసుకుని చాలా సినిమాలు వచ్చాయి. వాటికి ఫైనాన్షియర్ మస్తానే! వాటిలో హీరోలుగా వేసినవాళ్లంతా మానవతామూర్తులే. హీరో స్మగ్లర్‌గా మారడానికి కారణం ఈ పాడు సమాజమే అనే నీతిని బోధించే సినిమాలే. ఈ సినిమాల్లో హీరోలుగా వేసిన వారు తర్వాతి కాలంలో యాంగ్రీ యంగ్‌మాన్లుగా పేరు ప్రఖ్యాతులు సంపాదించారు. అప్పటి నుంచే బాలీవుడ్ సినిమాలలో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో మాఫియా పెట్టుబడులు పెట్టడం ప్రారంభించింది. హాజీమస్తాన్ 1994లో చనిపోయేంతవరకు బాలీవుడ్‌తో ప్రేమపూర్వక సంబంధాలే ఉండేవి. హాజీమస్తాన్ చనిపోయేనాటికి వేల కోట్ల ఆస్తులు సంపాదించాడు. చనిపోయే ముందు ఒక రాజకీయ పార్టీ పెట్టాడు. ఆ పార్టీ మీటింగుల్లో సునీల్‌దత్, దిలీప్‌కుమార్ వంటి అప్పటి ప్రముఖ హీరోలతో రాసుకుని తిరిగేవాడు. మొన్నీమధ్యనే, ఆయనకు దక్షిణ ముంబయిలో పెద్దార్ రోడ్డులో ఉన్న ఒక బంగళా, వంద కోట్ల వరకు అమ్ముడు పోయిందని అనుకుంటారు.

హాజీమస్తాన్ క్షీణదశలో ఉన్నప్పుడు, ఆయన అడుగుజాడల్లో దావూద్ ఇబ్రహీం ప్రవేశించాడు. దావూద్ ఇబ్రహీం ప్రవేశంతో బాలీవుడ్‌తో సంబంధాలు కఠినంగా మారిపోయాయి. ఒక ప్రేమపూర్వక రిలేషన్ చెడిపోయింది. 'డీ' గ్యాంగుకు 'బి' రంగానికి అత్యంత దగ్గర సంబంధాలున్న విషయం అందరికీ తెలిసిందే. దావూద్ ఇంట్లో ఏ ఫంక్షన్ అయినా, అదీ ముంబయిలోనైనా, దుబాయిలోనైనా లేక ప్రపంచంలో ఏ మూలలోనైనా, భూమ్మీదైనా, గాలిలోనైనా, పడవల్లోనైనా బాలీవుడ్ నటీనటులు తమ సొంత ఇంట్లో జరిగిన ఫంక్షన్‌లా ఫీలయి డ్యాన్సులు వేసి, తాగి, వాగి, ఆడి, పాడి అలసి సొలసి పోతుండడం మనము ఫోటోలతో సహా చూశాము. వారిలో అనిల్‌కపూర్, షారుఖ్ ఖాన్, సల్మాన్‌ఖాన్, మమతా కులకర్ణిలతో పాటు టాలీవుడ్‌లో ఎన్నో సినిమాలు చేసిన మందాకిని, సాక్షి శివానంద్‌లు కూడా ఉండాల్సిందే.

**(ఇంకా వుంది)**

## కాజల్ కథ కంచికి చేరిందా?

*కెరీర్ ముగిసిపోయింది అనుకుంటున్న తరుణంలో మెగా ఛాన్స్ వచ్చింది కాజల్‌కి. దాంతో మరో రెండు మూడేళ్లు తన కెరీర్‌కి ఢోకా లేదని కాజల్ ధీమాగా ఉంది. కానీ అభిమానులకే ఆ ధీమా ఉండడం లేదు. కారణం. 'ఖైదీ నంబర్ 150'లో కాజల్‌ను చూసిన అభిమానులు షాక్‌కి గురయ్యారట! మునుపటి అందం కాగడా వేసి వెతికినా కాజల్‌లో కనిపించలేదన్నది ఆమె అభిమానుల ఆవేదన. డ్యాన్సుల్లో కూడా కాజల్ కన్నా రాయ్‌లక్ష్మికే ఎక్కువ మార్కులు వేస్తున్నారట!*



# కొత్తదనానికి పెద్ద పీట!




- రాజశుక

**ఉత్తర ప్రదేశ్‌లో అఖిలేశ్ యాదవ్ పార్టీ చిహ్నాన్ని చేజిక్కించుకుని, మహాకూటమికి కేంద్ర బిందువుగా మారడం ఆయనకు శుభశకునంగా కనిపిస్తోంది.**

**అమెరికాలో డోనాల్డ్ ట్రంప్ గెలవడమే కానివ్వండి, భారత్‌లో నరేంద్ర మోదీ విజయం సాధించడమే కానివ్వండి. ప్రజలు కొత్త దనానికి, తిరుగుబాటు ధోరణికే ఓటు వేస్తున్నట్టు కనిపిస్తోంది. ట్రంప్, మోదీల విజయాలే కాదు, ఇంకా అనేక నిదర్శనాలు కూడా కనిపిస్తు న్నాయి. ఎన్నికల నిపుణులు, జ్యోతిష్యులు, రాజకీయ దురంధరులు ఏం చెప్పినా సరే, ప్రజల ఓటు మాత్రం తిరుగుబాటు, కొత్తదనాల మేలు కలయికకేననిపిస్తోంది. ఈ రెండింటినీ దృష్టిలో పెట్టుకోకపోవడం వల్లే ఎన్నికల నిపుణులు లేదా సెఫాలజిస్టుల జోస్యాలు ఘోరంగా విఫలమవుతున్నాయని చెప్పక తప్పదు. ముమ్మందు ఐదు రాష్ట్రాలకు జరగబోయే ఎన్నికల్లో కూడా నూటికి నూరు పాళ్లు ఇదే జరగబోతోందని ఘంటాపథంగా చెప్పవచ్చు.**

ముఖ్యంగా ఉత్తర ప్రదేశ్ ఎన్నికల్లో మిగిలిన అన్ని సమస్యలు, ఎన్నికల అంశాలు ఈ రెండు అంశాల ముందు వెలవెలబోవడం ఖాయం. పెద్ద నోట్ల రద్దు, సర్జికల్ దాడులు, రామమందిర నిర్మాణం, సమాజ్‌వాదీ పార్టీ కుటుంబ రాజకీయాలు, గూండా రాజ్ వగైరా వగైరా అంశాలను దృష్టిలో పెట్టుకుని రాజకీయ నాయకులు, నిపుణులంతా ఉత్తర ప్రదేశ్ ఎన్నికల మీద లెక్కలు కడుతున్నారు. కానీ, చివరికి వీటిలో ఏ ఒక్కటీ లెక్కలోకి రాబోవడం లేదనిపిస్తోంది. ఓ సాధారణ ఓటరు వీటన్నిటికీ స్పందించే అవకాశమే లేదు. 1960 దశకం ద్వితీయార్థంలో ఇందిరాగాంధీ విషయంలో ఏం జరిగిందో గుర్తుందా? అప్పట్లో కొందరు కాంగ్రెస్ నాయకులు 'సిండికేట్'గా ఏర్పడి, ఇందిరాగాంధీని ప్రధానమంత్రి పదవిలో కూర్చోబెట్టారు. తాము ఆడించినట్టల్లా ఆమె ఆడుతుందని వాళ్లు ఆశపడ్డారు. కానీ చివరికి ఆమె వారి మాట వినలేదు సరికదా, పార్టీని నిట్టనిలువునా చీల్చి, అధికారాలన్నీ చేజిక్కించుకుని, ప్రజానుకూల, కార్మిక అనుకూల చర్యలెన్నిటినో తీసుకుని, చివరికి ఎన్నికలు ప్రకటించి ఘన విజయం సాధించారు. ఆమెను గుప్పిట్లో ఉంచుకోవాలనుకున్న కాంగ్రెస్ నాయకులంతా చప్పగా చల్లారిపోయారు.

ఆంధ్రప్రదేశ్‌లోనూ ఇలాగే జరిగింది. 1990ల మధ్యలో చంద్రబాబునాయుడువైపు ఓటర్లంతా మొగ్గు చూపడానికి కూడా దాదాపు ఇదే కారణం. ఎన్టీఆర్ భార్య లక్ష్మీపార్వతి రాజ్యాంగేతర శక్తిగా వ్యవహరిస్తూ, ప్రభుత్వ, పార్టీ వ్యవహారాలలో కల్పించుకుంటున్నారనే ఆరోపణతో చంద్రబాబునాయుడు తిరుగుబాటు జరిపారు. తెలుగుదేశం పార్టీ చీలిపోయింది. చంద్రబాబు తన పార్టీ మీద ఆధిపత్యం సంపాదించారు. ఆ తరువాత మళ్లీ వెనుతిరిగి చూడలేదు. ఆ తరువాత జరిగిన ఎన్నికల్లో ఆయన పార్టీయే ఘన విజయం సాధించింది. తమిళనాడునే తీసుకోండి. జయలలిత ఎమ్జీఆర్ భార్య జానకీ రామచంద్రన్‌పై తిరుగుబాటు చేశారు. అన్నా డీఎంకే మీద ఆధిపత్యం సాధించారు. చివరికి ఘన విజయాన్ని చేజిక్కించుకున్నారు. జానకి వర్గం కాలగర్భంలో కలిసిపోయింది. 'తిరుగుబాటు'కే విజయమని తేలింది.

మరో ఉదాహరణగా మోదీ గురించి చెప్పుకోవచ్చు. 2014 ఎన్నికలనాటి సంగతి ఇది. పార్టీలోనూ, మిత్రపక్షాల నుంచి గట్టి ప్రతిఘటన ఎదురవుతున్నప్పటికీ, నరేంద్ర మోదీ తన మాటలు, చేతలతో ప్రజలను ఆకట్టుకోవడం ప్రారంభించారు. ఆయనలోని ఎవరినీ లెక్కచేయని గుణమే విజయాలవైపు నడిపించింది. ఆయన, ఆయన పార్టీ ఆ ఎన్నికల్లో ఘన విజయం సాధించి అధికారంలోకి రావడానికి కారణం ప్రజలకు ఆయనలో కనిపించిన కొత్తదనం, ఆయనలోని తిరుగుబాటు ధోరణి. అయితే, ఉత్తర ప్రదేశ్ శాసనసభ ఎన్నికల్లో బీజేపీకి చెప్పుకోవడానికి ఏమీ లేకుండా పోయింది. రాష్ట్ర స్థాయిలో పార్టీకి సరైన నాయకుడు లేకపోవడం దురదృష్టకరం. కేంద్ర పార్టీ సాఫల్యాలు, విజయాలను ఎన్నికల్లో ఉపయోగించు



కోవడానికి రాష్ట్ర పార్టీ ప్రయత్నిస్తోంది కానీ, అవేవీ ఎన్నికల్లో ప్రజలను ఆకట్టుకునేలా కనిపించడం లేదు.

### విజయానికి తొలి మెట్టు!

ప్రస్తుతం ఉత్తర ప్రదేశ్‌లో ఆ కొత్తదనాన్నీ, తిరుగుబాటు ధోరణినీ ప్రదర్శిస్తున్నది అఖిలేశ్ యాదవ్. 'బ్రాండ్ అఖిలేశ్' ముద్రను సంతరించుకుని ఈ రెండు ధోరణులతో ఆయన ముందుకు దూసుకుపోతున్నాడు. తండ్రికి ఎదురు తిరగడం, ఆధిపత్య ధోరణితో వ్యవహరించడం, ఆశించిన స్థాయిలో ప్రజలకు ఏమీ చేయలేకపోవడం, ముస్లిం-యాదవ్ ఓటు బ్యాంకు వగైరాలన్నీ ప్రస్తుతానికి వెనుకపట్టు పట్టాయి. ఆయన సమాజ్‌వాదీ పార్టీకి సైకిల్ గుర్తు వచ్చినా, రాకపోయినా పరిస్థితిలో మార్పు రాకపోవచ్చు. ఆయన 'మోటార్ సైకిల్' ఆయనకు ఉండనే ఉంది! సెఫాలజిస్టులు, జ్యోతిష్యులు, రాజకీయ పరిశీలకుల జోస్యాలు తలకిందులయినా కావచ్చు. మోదీ గనుక బడ్జెట్ ప్రతిపాదనల ద్వారా ఏదైనా కొత్తదనాన్ని తీసుకువస్తే తప్ప అఖిలేశ్‌కు ఎదురుండకపోవచ్చు.

కేవలం కొత్తదనం, తిరుగుబాటు ధోరణి మాత్రమే కాక, అఖిలేశ్ రాజకీయంగా కూడా తన తండ్రి కంటే ఓ రెండు ఆకులు ఎక్కువగానే చదివినట్టు కనిపిస్తోంది. తండ్రితో తలపడడానికి కూడా వెరవని అఖిలేశ్ రాష్ట్రంలో పొత్తుల కోసం సొంత ప్రయత్నాలు ప్రారంభించి ఒక విధంగా విజయం సాధించారు. ఉత్తర ప్రదేశ్ పర్యటనకు సొంతగా కార్యక్రమం సిద్ధం చేసుకున్నారు. పార్టీ తరపున ప్రచార సారథులు, ప్రచార నాయకులు ఎవరన్నది ముందుగానే ఆలోచించి, అటువంటివారి జాబితాను సిద్ధం చేసి, వాళ్లను ఇప్పటికే ప్రచారానికి పంపించేశారు. మొత్తం 228 మంది సమాజ్‌వాది ఎమ్మెల్యేలలో 205 మంది, 68 మంది ఎమ్మెల్సీలలో 56 మంది, 24 మంది పార్లమెంట్ సభ్యుల్లో 15 మంది తన వైపే ఉన్నారని ప్రకటించిన అఖిలేశ్, పార్టీని నిట్టనిలువునా చీల్చి పెద్ద భాగానికి తిరుగులేని నాయకుడు అయ్యారు. ఇది చూసి సహజంగానే ములాయం డీలా పడ్డారు. గత ఇరవై ఐదేళ్లుగా ములాయం ఎంతో కష్టపడి, ఎన్నో అవమానాలకు ఓర్చి నిర్మించుకున్న పార్టీ చివరికి తాను ఇవ్వకుండానే తన కుమారుడి పరం కావడం ఆయనను ఇంకా ఆశ్చర్యం నుంచి కోలుకోనివ్వడం లేదు.

ములాయం కూడా ఏదో ఒక అద్భుతం చేయడానికి ప్రయత్నించవచ్చు కానీ, వయసు రీత్యా ఆయన అంత త్వరగా ఓటమి నుంచి బయటపడలేరనిపిస్తోంది. ఫిబ్రవరి 11న ఉత్తర ప్రదేశ్‌లో మొదటి దశ ఎన్నికలు జరగబోతున్నందు వల్ల ములాయం ఈ లోగా 73 స్థానాలకు అభ్యర్థులను ఎంపిక చేయడం కాస్తంత ఇబ్బందితో కూడుకున్న పనే. ఇతర పార్టీలను కూడా ఆశ్రయిస్తే తప్ప ఆయనకు ఈ పని సకాలంలో పూర్తయ్యే అవకాశం లేదు. పైగా ఆయనకు కొత్త పార్టీ పెట్టడానికే సమయం సరిపోదు! ఇదంతా అఖిలేశ్‌కే సదవకాశంగా మారింది. బంధువులు, వృద్ధ నాయకులు తండ్రి వైపే ఉండడంతో అఖిలేశ్ పార్టీకి ఓ కొత్తదనం వచ్చింది. తనది అవినీతి లేని పార్టీ అనీ, బంధుప్రీతికి కూడా తన పార్టీ అవకాశమివ్వదనీ ఆయన చెప్పకనే చెప్పినట్టయింది. పార్టీకి తాజాదనం కూడా అందివచ్చింది.



**తండ్రిపై తిరుగుబాటుచేసి పార్టీని నిలువునా చీల్చి సైకిల్‌గుర్తు సొంతం చేసుకున్న అఖిలేశ్‌యాదవ్ ఉత్తరప్రదేశ్ అసెంబ్లీ ఎన్నికల నేపథ్యంలో తొలి విజయం నమోదు చేశారు. గతంలో ఇందిరాగాంధీ, చంద్రబాబునాయుడు, జయలలిత లాంటివారంతా ఆ కోవలో ప్రయాణించినవారే. మరి యూపీలో ఇప్పుడు అఖిలేశ్‌కు ఎలాంటి అవకాశాలున్నాయి? ఇతరపార్టీలేమంటున్నాయి?**

### దూరదృష్టి కూడా ఎక్కువే!

తనను పార్టీ అధ్యక్షపదవి నుంచి ములాయం తొలగించడంతో గత సెప్టెంబర్‌లో తిరుగుబాటు చేసిన అఖిలేశ్ అప్పటి నుంచి పార్టీని తనకు అనుకూలంగా నిర్మిస్తూ వచ్చారు. తన తండ్రి తరపు బంధువు శివ్‌పాల్ యాదవ్‌తో పాటే ఆయన తండ్రి, పార్టీ వ్యవస్థాపక అధినేత ములాయంను కూడా దూరంగా పెట్టడం ప్రారంభించారు. కుట్రలు, కుతంత్రాలతో కాక, పోరాడి పార్టీని దక్కించుకున్నారని అఖిలేశ్‌పై ఇప్పటికే ప్రజల్లో ప్రచారం మొదలైంది. పార్టీలో ఛోటే నేతాజీగా పేరున్న అఖిలేశ్ తనకు పార్టీలో అధికార దళారులుగా వ్యవహరిస్తున్న బంధువులపై మమకారం ఏమీ లేదని నిరూపించినట్టయింది. ములాయంతోనూ, శివ్‌పాల్ యాదవ్ తోనూ ఆయన తెగతెంపులు చేసుకోవడం మిత్రులకే కాక, ప్రత్యర్థులకు సైతం నచ్చిన విషయమైంది. రాష్ట్రంలో అతి వేగంగా రూపుదిద్దుకుంటున్న రాజకీయ కూటమికి ఆయనే ఇప్పుడు కేంద్ర బిందువయ్యారు.

నరేంద్ర మోదీకి, ఇతర ప్రత్యర్థులకు గట్టి సవాలుగా మారుదామని గత కొంతకాలంగా విశ్వప్రయత్నం చేస్తున్న అరవింద్ కేజ్రీవాల్, మమతా బెనర్జీలను కూడా అఖిలేశ్ ఈ దెబ్బతో మించిపోయినట్టు కనిపిస్తోంది. అఖిలేశ్ నాయకత్వంలో మహా కూటమి గనుక ఏర్పడితే, బీజేపీకి ఉత్తర ప్రదేశ్‌లో ఓ గట్టి పోటీ ఏర్పడడం ఖాయమని రాజకీయ పరిశీలకుల అభిప్రాయం. షీలా దీక్షిత్ సహా ప్రతిపక్ష నాయకులంతా ఇప్పుడు అఖిలేశ్ విజయానికి ఆశగా ఎదురుచూస్తున్నారు. నిజానికి కాంగ్రెస్ తరపున ముఖ్యమంత్రి అభ్యర్థి కూడా అయిన షీలా దీక్షిత్ తన ప్రయోజనాలను పక్కన పెట్టి అఖిలేశ్ ప్రయోజనాల మీద దృష్టి కేంద్రీకరిస్తున్నారని పరిశీలకులు భావిస్తున్నారు. అంతేకాదు, సమాజ్‌వాది పార్టీ శ్రేణులకంటే కూడా లాలూప్రసాద్ యాదవ్ మరింత ఆసక్తితో వ్యవహరిస్తున్నారు. ఏదో విధంగా అఖిలేశ్‌తో సంధి కుదుర్చుకోవాలంటూ ఆయన ములాయంమీద విపరీతంగా ఒత్తిడి తెస్తున్నారు. బీహార్ ముఖ్యమంత్రి నితీశ్ కుమార్ ప్రస్తుతం అఖిలేశ్‌కే మద్దతునిస్తున్నారు. మహారాష్ట్రకు చెందిన ఎన్‌సీపీ కూడా అఖిలేశ్‌వైపే మొగ్గు చూపుతుంది. ఎన్నికల సంఘంలో తొలి విజయాన్ని చేజిక్కించుకున్న అఖిలేశ్ ఇక మలి విజయం వైపు అడుగులు వేయడమే మిగిలి ఉంది. బహుశా వ్యూహాత్మకంగా కాంగ్రెస్, ఆర్ ఎల్డీతో చేతులు కలపడం వల్ల విజయం అంత కష్టం కాకపోవచ్చు. ■

# విపులాచ పృథ్వీ

-నందిరాజు పద్మలతా జయరాం

**ఏమైంది నాన్నకి? నిన్నరాత్రేగా 'నాకేం కాదు తల్లీ! వెళ్ళిరా! వచ్చే వారం ఎలాగూ వస్తావుగా! ఆ సమయానికి నేను ఇంటికి వెళ్ళిపోతాను. అక్కయ్య, చిన్నీ ఇద్దరూ ఉన్నారుగా! దిగులొద్దు నాన్నా! వెళ్ళిరా!' అంటూ ఎంతో ధైర్యం చెప్పారు! ఉదయం బెంగుళూరులో దిగిందో లేదో చెల్లాయి ఫోన్ 'చిన్నక్కా! వెంటనే బయల్దేరవే! వివరాలు అడగొద్దు. ఫ్లైట్ బుక్ చేసుకో!'**

ఎందుకు, ఏమిటి అనే ప్రశ్నలకు అవకాశం లేకుండా అందరూ ఫోన్లు బిజీగా ఉంచుకున్నారు. ఏ విమానమూ అందుబాటులో లేకపోవడంతో బస్‌టికెట్ బుక్ చేయించుకుంది కుమారి. బస్ ఎక్కినప్పటినుంచీ ఆమె కంటనీరు ఆగడం లేదు. 'తాతయ్యకేం కాదమ్మా! ఏడవకే! ప్లీజ్ కూతురు సుమ సముదాయిస్తూనే ఉంది.

'ఈ మాయదారి లంగ్స్ ఇన్‌ఫెక్షన్ నాన్నను ఎందుకు పీడిస్తోంది? గత పదేళ్లుగా ఇంటి భోజనం తప్ప బైట ఎక్కడా ఎంగిలి పడలేదు. వక్కపొడి లాంటి అలవాట్లు కూడా పూర్తిగా మానేశారు. నిత్యం పూజాపునస్కారాలతో కాలం వెళ్ళబుచ్చుతున్న క్రమబద్ధ జీవనం నాన్ననెందుకు ఈ ఇన్‌ఫెక్షన్‌కి గురిచేసింది? గత వారం నుంచీ ఆసుపత్రిపాలైనా, ఆరోగ్యంగానే ఉన్నారు. మరో రెండ్రోజుల్లో డిశ్చార్జ్ చేస్తారనుకుని తను బెంగుళూరుకి తిరుగు ప్రయాణం కట్టింది. ఇంతలోనే ఫోన్ సమాచారం.

'నాన్న.. నాన్న... వెళ్ళిపోయారా! ఆ మాట అనుకోవడానికే భయంగా ఉంది. ఊహు! ఏంకాదు. నాన్నకేంకాదు. కాకూడదు'.

కుమారి సీట్లోనే వెనక్కి జారగిలబడింది. పాజిటివ్‌గా ఆలోచించమని తన స్టూడెంట్స్‌ని ఎప్పుడూ పోరే తనే ఇలా నకారాత్మక భావాలకు లొంగకూడదని మనసుని హెచ్చరించింది. కళ్ళముందు గతాన్ని ఆవిష్కరించుకుంది.

•••

ఎప్పుడో నలభైయేళ్ళక్రితం ఉద్యోగరీత్యా హైదరాబాద్ చేరిన చంద్రశేఖరం అక్కడే ఉండిపోతానని ఆనాడు ఊహించలేదు. 'పుట్టిన ఊరు, కన్నతల్లి' అవే తన మూలాలు. తన రక్తసంబంధాలన్నింటినీ అక్కడే వదిలి, ఎక్కడో బ్రతకాల్సిన అవసరం రాదు. వచ్చినా తను మరో ఉద్యోగమేదో చూసుకుని తిరిగివెళ్ళిపోతాడు, అంతే!' అనుకున్నారు. కానీ, ఆయన ఆశ, ఆలోచన ఫలించలేదు. 'అవసరం' అన్నింటి కన్నా చిక్కనైనది, రక్తసంబంధం కన్నా కూడా!

పెళ్ళైంది. ఒంటరి జీవితానికి జంటగా ఉమాదేవి తోడైంది. కొత్తకాపురం రెండుగదుల ఇరుకు ఇంట్లో మొదలైనా, దంపతుల హృదయ వైశాల్యం ముందు ఇంటి ఇరుకు పారిపోయింది. స్వంత ఊరు నుండి ఒక్కొక్కరుగా వచ్చిచేరిన శేఖరం తమ్ముళ్ళకీ, ఇతర బంధువులకీ హైదరాబాద్‌లోని చదువులు, ఉద్యోగాలు అవసరమయ్యాయి. అందరికీ ఆశ్రయం కల్పించిన ఆ దంపతుల కడుపు నిండకపోయినా, కన్నీటినిమాత్రం దగ్గరకు రానీయలేదు. తమ్ముళ్ళు, బావమరుదులు ఇతర బంధువుల పిల్లలు చంద్రశేఖరంగారి బంధుప్రీతిని, ఉమాదేవి ఆదరణనీ తనమన తేడా తెలియని వారిద్దరి మంచితనాన్ని పూర్తిగా ఆస్వాదిస్తూ ప్రయోజకులయ్యారు. ఎవరి కాళ్ళమీద వాళ్ళు నిలబడ్డాక రెక్కలొచ్చిన పక్షుల్లాగా కొత్తగూటికి చేరారు. అంతా వెళ్ళిపోయాక, తమ బిడ్డలు మాత్రమే మిగిలిన తరుణంలో కాస్త చెయ్యీ కాలూ కూడదీసుకుని ఊరిచివర చిన్న ఇల్లు కట్టుకుని రిటైర్డ్ జీవితాన్ని ప్రశాంతంగా వెళ్ళదీస్తున్నారు. కాలక్రమంలో పిల్లల పెళ్ళిళ్ళు అయ్యాక ఒకరికొకరై, ఒకరికోసమే మరొకరై బ్రతుకుతున్నారిద్దరూ.

తండ్రి జ్ఞాపకాలతో కుమారి కళ్ళు చెమర్చాయి.

•••

అయిపోయింది. అంతా అయిపోయింది. అందరికోసం జీవించిన ఓ అమృత ఆత్మ పరమాత్మలో ప్రశాంతంగా విలీనమైంది. హరినామ స్మరణం కంఠంలో నిక్షిప్తమై ఉండగానే, పెదవుల పైన చిరునవ్వు చెదరకుండానే చంద్రశేఖరంగారిలోని హంస ఎగిరిపోయి పరమహంసలో చేరిపోయింది.

'అమ్మా! అయిందేదో అయింది. దాన్ని మార్చలేం కదా! నాతో వచ్చెయ్యమ్మా! ప్లీజ్! నిన్ను ఒక్కదాన్నే వదిలి వెళ్ళలేనమ్మా!' ప్రాధేయపడింది కుమారి.

'అంతదూరం ఎందుకమ్మా? దగ్గర్లోనే ఉన్న నేను లేనూ! కాదనకమ్మా! మా ఇంట్లో ఉండమ్మా! హాయిగా కలిసి ఉందాం!' పెద్దకూతురు హైమ వేడుకుంది.

"అత్తయ్యా! నాకు అమ్మా, నాన్న ఇద్దరూలేరు. అన్నీ మీరే! నాకు, మీ మనవలకి మీ అండ కావాలి. ఇల్లు అద్దెకు ఇద్దాం. వచ్చెయ్యండత్తయ్యా" పెద్దల్లుడు ఈశ్వర్ అత్తగారి దగ్గరగా కూర్చుని చెప్పాడు.

ముగ్గురు కూతుళ్ళల్లో చిన్నది హిమబిందు. సమష్టి కుటుంబంలో ఉంటోంది. తల్లిని తీసుకెళ్తానని చెప్పలేదు. అలా అని అమ్మని ఒంటరిగా వదలనూలేదు. నిశ్శబ్దంగా కళ్ళొత్తుకుంటోంది బిందు.

ఎవ్వరికీ జవాబివ్వలేదు ఉమాదేవి. ఏమాలోచిస్తోందో తెలియదు. ఎక్కడ ఉంటుందో కూడా తెలియని అయోమయస్థితి. కూతుళ్ళకేమీ పాలుపోవడం లేదు.

నిజానికి ఉమాదేవికి తన పరిస్థితేమిటో తనకే బోధపడడంలేదు. ఇన్నాళ్ళ తన ఉనికి, అస్తిత్వం, మొత్తంగా జీవితం అంతా పూర్తిగా భర్త మీదే ఆధారపడి ఉందన్న సత్యం మహా విచిత్రంగా అనిపిస్తోంది. తన ఇంట్లోనే తనకు పరాయిదాన్ని అనిపిస్తోంది. మరొకరి ఆసరా, ఆధారమూ లేకుండా స్వేచ్ఛగా తన ఇంట్లో తాను జీవించే శక్తి అంతా ఆయన కూడగట్టుకుని వెళ్ళిపోయారంటే ఆశ్చర్యంగా ఉంది.

దినవారాలు అయిపోయాయి. అల్లుళ్ళే కొడుకులుగా మారి కార్యక్రమాలన్నీ ఎంతో ఘనంగా జరిపారు. పెద్దాయన అస్తికల్ని 'గయ'లోని జలాలు ఆర్తిగా తమలో ఇముడ్చుకున్నాయి.

పన్నెండవరోజు వేదఘోష తర్వాత అందరి సమక్షంలో ఆశీర్వచనం చేసిన పండితుడు, "అయ్యా! ఆ పెద్దాయనకు కొడుకులు లేరన్నలోటు ఈ పదకొండు రోజుల్లో నాకు ఒక్కసారికూడా కనిపించలేదంటే, ఊర్ధ్వలోకాలకి పయనిస్తున్న ఆ పెద్దాయన ఇహలోకంలో ఆర్జించుకున్న ప్రేమాభిమానాలు ఎంతగొప్పవో అర్థమైంది. పార్థివ శరీరాన్ని ముందుంచుకుని ఆస్తుల పంపకానికి సిద్ధమైన అనేక మందిని చూశాను. మీలాంటి అల్లుళ్ళు నిజంగా అదృష్టం కొద్దీ లభిస్తారు. ఇకనుంచీ మీ మామగారిని మీ అత్తగారిలోనే చూసుకోండి. ఆమెను కన్నతల్లిలా ఆదరించండి. ఆ తల్లి కన్నబిడ్డల్లారా! మీకు ఇప్పుడు మీ అమ్మ మరో సంతానం. ఆమె మనసు నొవ్వకుండా ప్రవర్తిస్తూ, ఆవిణ్ణి జాగ్రత్తగా చూసు



కోండి. అమ్మా! ఉమాదేవిగారూ! యాభై సంవత్సరాలపాటు కలిసి జీవించిన చంద్రశేఖరంగారు పుణ్యలోకాలకు వెళ్ళిపోయే ఈ సమయంలో మీరు కంటనీరు పెట్టకండి. పునర్జన్మరహితమైన మోక్షమార్గానికి చేరేందుకు ఆయనకు అవకాశమివ్వండి. మీ కన్నీళ్ళు ఆయనకు ఆటంకం కాకూడదు కదా! జాతస్యఃమరణం ధృవం. ఒకరు ముందు, మరొ

కరు కాస్త ఆలస్యంగా! అంతే! అందరం వెళ్ళిపోయే వాళ్ళమే!' పురోహితుడి మాటలకి దుఃఖం మరింతగా తన్నుకొచ్చింది అందరికీ. ఆయన మాటలు అక్షర సత్యాలే అయినా వాటిని జీర్ణించుకునే శక్తి ఎవ్వరికీ లేకపోయింది. తల్లిని కరుచుకుపోయారు ముగ్గురు కూతుళ్ళూ.

●●●

'ఏం చెయ్యనే కుమారీ? అమ్మ రానంది. రాలేను. అంది. ఇంకా నాన్న ఇక్కడే తిరుగుతున్నారంటోంది. పూజగదిలో కూర్చుని నాన్న మహన్యాస పూర్వకంగా అభిషేకం చేస్తున్నట్లూ, పెద్దగా గొంతెత్తి రామదాసు కృతులు పాడుతున్నట్లూ, తన పక్కనే కూర్చుని పనసపొట్టు తురుముతున్నట్టూ అనిపిస్తోందట. భోజనాలయ్యాక తనని వేధించీ వేధించీ మధ్యాహ్నం నిద్రపోనీకుండా చెస్ బోర్డు ముందు కూలేసి ఆడుతున్నట్లు, అందుకుగాను చిక్కటికాఫీ తానేకలిపి ఇస్తానని ఒట్టేసినట్లు అనిపిస్తోందట. ఇష్టమైన సీరియల్ చూస్తోంటే, తనతో గొడవపడి వార్తలు చూడ్డానికి రిమోట్ కంట్రోల్ కొట్టేసినట్లు, ఆ తర్వాత 'సారీ' చెప్పినట్లు అనిపిస్తోందట. ఇప్పుడు అమ్మకి నిద్ర పోవాలనిపించటం లేదుట, ఎందుకో తెలుసా? నిద్రలో నాన్న పోయినట్లుగా కలొస్తే తట్టుకోలేనేమో అనే భయంట' పెద్ద కూతురు హైమ కుమారికి ఫోన్ చేసింది.

"మరెలా అక్కయ్యా? నాకేం పాలుపోవడంలేదు. అమ్మ ఒంటరిగా ఎలా ఉంటుంది? అసలే అమ్మ ఆరోగ్యం అంత మంచిదికాదు కదా" అయోమయంగా ఉంది కుమారికి.



'రోజూ సాయంత్రాలు వెళ్ళొస్తున్నానే! బతిమిలాడుతున్నాను వచ్చెయ్యమని, ఊహు! వినడం లేదు. నాన్న జ్ఞాపకాలు వదిలి రానంటోంది. అసలు ఇల్లు కదలట్లేదు. గడప దాటడంలేదు' చెప్పింది హైమ.

అర్ధశతాబ్దం దాటిన దాంపత్యానికున్న బలమో, బలహీనతో... ఉమాదేవికి మరోలోకం లేదు. తల్లీ, తండ్రీ, స్నేహితుడూ, దేవుడూ కూడా చంద్రశేఖరం గారే! అలా అని ఆయనేమీ ఆమెని అపురూపంగా చూసుకోలేదు. అందలాలెక్కించనూ లేదు. తనతో పాటుగా, తన శరీరంలో ఓ భాగంగా చూసుకున్నారు. తన కష్టాలు ఆమెకు పంచారు. తన సంతోషంలో ఆమెను మమేకం చేశారు. తనంటే ఆమే అనుకున్నారు. ఆవిడా అంతే! భర్తకి వచ్చిన జబ్బేదో తనకు వస్తే బాగుండుననుకుంది. తనైతే తేలికగా తట్టుకోగలననుకుంది. జీవితాంతం ఏ కోరికా కోరని ఆమె, ఆయనకన్నా ముందుగా తనను పునిస్త్రీగా తీసుకెళ్ళిపొమ్మని ఆ జగన్మాతను వేడుకుంది. ఆ కోరిక తీరకపోయినా, భర్త తన ఎదురుగా సజీవంగా లేరన్న నిజాన్ని నమ్మడం ఇష్టం లేక కోరి భ్రమను ఆహ్వానిస్తోంది.

●●●

ఆరు నెలలు గడిచాయి.

ఊళ్ళోనే ఉన్న హైమ, హిమబిందు తల్లిని తరచుగా కలుస్తూనే ఉన్నారు. ఆమె అవసరాలు కనుక్కుని తీరుస్తున్నారు. అప్పుడప్పుడూ బంధువులు వచ్చి పరామర్శించి వెళ్తున్నారు. కుమారికి మాత్రం రోజువారీ హడావుడిలో తల్లిని చూసే వీలు చిక్కింది కాదు. అప్పుడప్పుడు ఫోన్‌చేసి మాట్లాడుతూ ఉన్నా తల్లిని చూడాలన్న తపన తీరడంలేదు. తన ఉద్యోగం, కూతురు చదువూ, కలిసిరాని సెలవులూ గంపగుత్తగా ఆమెని ఆపేస్తూంటే, వాటిని ఛేదించుకుని దసరా సెలవుల్లో కూతురిని స్పెషల్ క్లాసెస్ మాన్పించి హైదరాబాద్ వచ్చింది.

అక్కాచెల్లెళ్ళు ముగ్గురూ పిల్లలతోసహా ఉమాదేవి దగ్గర చేరారు.

**చంద్రశేఖరం మరణం అందరినీ ఆశ్చర్యపరిచింది. పుణ్యాత్ముడు. కొడుకులులేని లోటు కనిపించకుండా అల్లుళ్ళు ఆ కార్యక్రమాలన్నీ శ్రద్ధగా పూర్తిచేశారు. ఆయన కూతుళ్ళేకాదు, భార్య ఉమాదేవికూడా అతని జ్ఞాపకాలు మరచిపోలేకపోతోంది. భర్త సాంగత్యంలో యాభైఏళ్ళు ఎలా గడిచిపోయాయో తెలియలేదామెకు. ఎందరు బ్రతిమిలాడినా ఆ ఇంటిని వదిలి రాలేదు ఆమె. మరి ఆమె ఒంటరి జీవితానికి తోడు ఎవరున్నారు?**

ముందు గదిలోని తండ్రి ఫొటోచూసి "నాన్నా!" అంటూ ఏడుపు ఆపుకోలేకపోయింది కుమారి. గుమ్మంలోకి వచ్చిన తల్లిని కౌగిలించుకుని కుమిలిపోయింది. తనవాళ్ళ దుఃఖాన్ని కళ్లారా చూస్తూ ఉండిపోయారు ఫొటోగా మిగిలిన పెద్దాయన.

రెండోరోజుకి దుఃఖం కాస్త తెరిపికి వచ్చింది. ఒంటరిగా ఉన్న కోవెలలోకి కొత్తసందడి ప్రవేశించింది. అనుక్షణం తండ్రి మాటలూ, ప్రవర్తనా, మనసునీ తల్చుకుంటూ ఎవరి అనుభవాలు వాళ్ళు చెప్పుకుంటూ ఉంటే మరో రెండురోజులు గడిచిపోయాయి.

తోడు కోల్పోయిన తల్లిలో తను అనుకున్నంత విషాదం లేకపోవడం సంతోషంగా అనిపించింది కుమారికి. కారణం తెలియకపోయినా, అమ్మ ఒంటరిగా జీవించడంలో ఏదో తృప్తిని పొందుతున్నట్లు కూడా అనిపించసాగింది.

●●●

'ఏవిటే కాకమ్మా? ఎందుకే అంత అనుమానం? నీ పిల్లలమీద నాకెందుకే మమకారం? నాకూ ఉన్నార్లే పిల్లలు. అదిగో! తెల్లగా బొద్దుగా ఉందే! అది నా రెండో కూతురు కుమారి. నువ్వెప్పుడూ చూళ్ళేదు కదూ! బెంగుళూరులో ఉంటుందిలే, లెక్కల ప్రొఫెసరు. మా తలకాయలు నీ ముక్కుతో పొడిచెయ్యకే బాబూ!' ముద్దుగా విసుక్కుంటూ గోడ మీద గోల చేస్తున్న కాకికి గుప్పెడు అన్నం పెట్టింది ఉమాదేవి. అక్కడ ఉంచిన ముద్ద పెట్టీ పెట్టక ముందే కాకి ఆ ముద్దను నోటకరిచి రివ్వున ఉసిరి చెట్టు కొమ్మమీదికి ఎగిరింది. ఆ కొమ్మలమధ్య అల్లుకున్న గూట్లోని కాకి పిల్లలు ఎర్రటి నోళ్ళు తెరుచుకుని ఆహారంకోసం అరవ సాగాయి. పిట్టగోడమీద మిగిలిన మెతుకులకోసం గున గునా పరిగెత్తుకొచ్చింది కొబ్బరిమట్టలో కాపురం పెట్టిన ఉడుత.

'అయ్యో! నీ సంగతి మర్చిపోయానా ఉడుతమ్మా! ఆగు! నీ గింజలు నీకేలే!' అంటూ వంటఇంట్లోకివెళ్ళి వేరుశనగ పప్పులు తెచ్చిపెట్టింది ఉమాదేవి. చటుక్కున ఆవిడ చేతుల్లోంచి అందుకుని ఒళ్ళోదాచుకుని గబగబా తినేసింది ఉడుత.

'అమ్మమ్మా! నీ చేతిని కొరుకుతుందేమో!' భయంగా అంది సుమ.

'అమ్మమ్మా, ఆ ఉడుతా స్నేహితులే! ఏం చేయదులే!' చెప్పింది హైమ.

'సుమక్కా! అమ్మమ్మకి ఆ కుక్కకూడా ఫ్రెండే! చూడు అమ్మమ్మ దగ్గర కూర్చొని ఎలా తోకాడిస్తోందో' బిందు కొడుకు కల్యాణ్ చూపించాడు.

వీధి కుక్క ఒకటి ఉమాదేవి దగ్గర తోకాడిస్తోంది.

'ఇదెప్పటినుంచి అమ్మా! నీకు కుక్కలంటే భయం కదా!' అడిగింది కుమారి.

'పాపం! ఎక్కణ్ణించో వచ్చిందే! నేనుపెట్టే పిడికెడన్నం తిని, నాకు తోడుగా ఉంటోంది. నాలాగే ఒంటరిపక్షి. రండి. మీకు వడ్డించేస్తాను. అందరం తిన్నాక మిగిలిందికాస్తా దానికి పెట్టేస్తాను' లోపలికి వస్తూ అంది ఉమాదేవి.

'ఏంటో! ఈ అమృతం తినే అదృష్టం లేకుండా వెళ్ళిపోయారు నాన్న' అంది కుమారి. తల్లి వంటంటే ఆమెకు ప్రాణం మరి.

"నాన్నకి అమ్మ వంటతప్ప మరొకళ్ల వంట నచ్చేదే కాదు కదూ! ఏంటోనే అక్కా! అమ్మ చేతి మహత్యం, పాత చింతకాయ పచ్చడైనా సరే పరమాద్భుతంగా ఉంటుంది. అందుకే అమ్మకితోడుగా ఉంటానని కబుర్లుచెప్పి, ప్రతి ఆదివారం ఇక్కడే లాగించేస్తాను. పాపం! మా ఆయన నమ్మేస్తారు" చెప్పింది హిమబిందు.

భర్త గుర్తుకు వచ్చేసరికి ఉమాదేవి చేతిలో ముద్ద కంచంలోకి జారిపోయింది.

"ప్చ్! ఆయన లేకపోయినా, హాయిగా తింటున్నాను, తిరుగుతున్నాను. కొన్నాళ్ళైతే ఆయన ఊసే మర్చిపోతానేమో! నేనెక్కడ దిక్కులేనిపక్షిని అవుతానో అని నాకింత ఇల్లు, వాకిలి ఏర్పాటుచేశారు. తను లేకపోయినా 'హాయిగాబ్రతకవే' అని పెన్షన్ వచ్చేట్లు చేశారు. కానీ, నేనేంచేయగలిగాను ఆయనకి? జీవితం మొత్తంలో ఒక్కసారయినా ఏదైనా కొనిచ్చానా! పాపిష్టిదాన్ని. ఆయన ఇష్టపడి ఏదైనా కొనుక్కుంటానన్నా, ఆ ఖర్చో, ఈ ఖర్చో చూపించేదాన్ని. ఆయన ఆ పైనుంచి చూసి నా గురించి ఏమనుకుంటున్నారో!" ఒక్కసారిగా గొల్లుమంది ఉమాదేవి.

చిన్నపిల్లని దగ్గరికి తీసుకున్నట్టు తల్లిని తన గుండెల్లో పొదువుకుంది కుమారి.

"అలా అనకమ్మా! మేము చదువుకుని, ఈ మాత్రం మంచిగా బ్రతుకులు గడుపుతున్నామంటే కారణం ఎవరు? బాబాయిలు, అత్తయ్య, మేనమామలే కాకుండా, బంధువులు, ఏళ్ళతరబడి మన ఇంట్లోఉండి ప్రయోజకులయ్యారు. నాన్న తన ఒక్కడి జీతంతో ఇల్లు లాక్కొచ్చారంటే కారణం నీ పొదుపరితనం కాదూ! నాన్న ఎక్కడున్నా నిన్నే తల్చుకుంటూ ఉంటారమ్మా!" ఓదార్చింది.

"అవునమ్మా! నాన్నకి నువ్వంటే ప్రాణం" అమ్మమ్మను చూసి తనూ ఏడుస్తున్న పసివాణ్ణి దగ్గరకి తీసుకుని తల్లితో అంది బిందు.

ఇంతలో వాకిట్లో బల్లఉయ్యాల ఊగుతున్న కుమారి కూతురు గబగబా లోపలికి వచ్చింది.

"ఏవిటే సుమా! ఏంటా కంగారు?"

"పెద్దమ్మా! గడపదగ్గర చూడు. చిన్న గువ్వపిల్ల పడిపోయింది. పాపం! ఇంకా రెక్కలుకూడా రాలేదు" కంగారుగా అంది సుమ.

"అయ్యయ్యో! అనుకుంటూనే ఉన్నా! పిచ్చి పక్షి! సరైన తావు చూసుకోకుండా గూడు కట్టింది. ఇలా అవుతుందని అనుకుంటూనే ఉన్నా! ఉండండి. పిల్లలూ! పొరపాటున కూడా దాన్ని తాకకండి. తాకారో, తల్లి దాన్ని ముట్టుకోదు" అంటూ గబగబా లేచి దగ్గరగా వెళ్ళి జాగ్రత్తగా గువ్వపిల్ల దగ్గర నెమ్మదిగా తడుతూ దాన్ని ఓ మూలకు చేర్చి తల్లి చూసేలాగా ఏర్పాటుచేసింది ఉమాదేవి.

"అమ్మా! దాన్ని ఏ పిల్లో తినదు కదా! ఇందాక మెట్లకింద నల్లపిల్లిని చూశాను." అంది కుమారి.

'ఆ భయం లేదు లేవే! అవన్నీ ఫ్రెండ్స్. ఆ పిల్లి చూలింత. నేనే దానికి మెట్లకింద పక్కపరిచాను. ఇవాళో, రేపో కంటుంది' అంది ఉమాదేవి.

"నీ జీవకారుణ్యం బంగారంగానూ! కుక్క, పిల్లి, కాకి, గువ్వ, ఉడుత ఇవిచాలా! ఇంకా ఉన్నాయా!" నవ్వింది కుమారి.

"అయ్యో రామా! అమ్మ పందిని కూడా పెంచుతోందక్కా! చూడలేదా!" అంది హిమబిందు.

అవాక్కయ్యారు హైమా, కుమారి ఇద్దరూ!

పిల్లలకైతే మరీ తమాషాగా అనిపించింది.

"ఛ! పందిని పెంచడమేంటమ్మా!" అసహ్యంగా ముఖం పెట్టి అడిగింది కుమారి.

"పెంచడమూ కాదూ, దాని మొహమూ కాదు! పక్క స్థలం ఖాళీగా ఉందిగా! ఎక్కణ్ణించో ఓ పంది వచ్చి చేరింది. అది కూడా కడుపుతో ఉన్నట్టుంది. పాపం! కనేందుకని కొమ్మలు విరగ్గొట్టుకుని, మట్టి తవ్వుకుని నానా కష్టాలూ పడింది. ఒక పక్కన బానంత కడుపు. పురుటి నొప్పులు రొప్పుకుంటూ రొజుకుంటూ, నొప్పులు తీస్తూనే పైన పందిరిలాగా ఏర్పాటుచేసుకుంది. కింద ఎండుగడ్డి, పచ్చని ఆకులు కలగలిపి పుట్టబోయే పిల్లలకోసం పొత్తిలి ఏర్పాటు చేసుకుంది. కావాలంటే చూడండి" అంటూ పిట్ట గోడ దగ్గరికి తీసికెళ్ళింది ఉమాదేవి అందరినీ.

గోడకి అటుప్రక్కగా నీడలో పడుకున్న తల్లి పంది దగ్గర పాలు తాగుతున్న డజను పంది పిల్లలు. అరమూతకనులతో తాదాత్మ్యంగా ఉంది తల్లి పంది.

"సుమక్కా! ఎన్ని పిల్లలో చూడు!" అరిచాడు కల్యాణ్.

'అదేంటి? కన్నదా!' ఆశ్చర్యపోయింది హైమ.

"అవునే! మొన్నరాత్రే కన్నది. రాత్రంతా మూలుగుతూనే ఉంది. మనుషులకైతే మంత్రసానులైనా ఉంటారు. వాటికేం ఉంది? మనలాగా పురుటి బాధలు తప్పవుగానీ, ఆ బాధలు పంచుకునే వాళ్ళెవరుంటారు?" బాధగా అంది ఉమాదేవి.

"ఎందుకుండరు? నువ్వున్నావుగా! మీకు తెలుసా అక్కా! ఆ రాత్రంతా అమ్మ జాగారం చేసింది. పెద్ద గిన్నెడు అన్నం వండి, బానెడునీళ్ళు దగ్గరగా పెట్టొచ్చింది అమ్మ. అమ్మకి మనుషులే కాదు, జంతువులు కూడా కావాలి సేవలందించడానికి" తల్లి మెడచుట్టూ గొలుసులా చేతులు బిగించి అంది హిమబిందు.




ఏం దేశం రా నాన్నా యిది?
తలుపులూ, కిటికీలూ బిడాయించుకొని
కూర్చున్నారు!
గుమ్మం ముందు
ఆప్యాయంగా పలుకరించే ముగ్గేదిరా?

## ఏ దేశం రా నాన్నా యిది?

నాన్నా, ఒరే కన్నా,
నువ్వింతవాడివై, అమెరికాలో
బోలెడంత సంపాదిస్తూన్నందుకు
నాకు సంతోషమే గానీ
నా కోడలు పరాయి మగవాళ్లతో
నీవు వేరే వాళ్ల పెళ్లాలతో
కావలింతలూ, ముద్దులూ
హవ్వ! సిగ్గుతో చచ్చిపోతున్నాను రా!

ఈ గాలి ముక్కకంపు కొడుతూంది
రోజుల క్రిందట వండిన వంటకాలు
ఎంత ఫ్రిజ్‌లో పెట్టి తీసినవైనా
పాచివాసన వస్తున్నాయి
కన్నా, భోజనం శనాదివారాలు వండుకొని
వారమంతా తినే వ్యవహారం కాదురా
అది ప్రతిరోజూ వండుకొనే కమ్మని ఆహారం!
కిటికీలు తెరవండ్రా అబ్బాయ్!
మన ఊర్లో సజీవమైన ధ్వనులు
ప్రొద్దుటి వెలుగుల కలకల
వర్షంలో తడిసిన మట్టివాసన
రాత్రి పొలాల పైనుండి వీచే కమ్మని గాలి
వీటన్నిటికీ అలవాటుపడిన నేను
ఈ గదిని వెచ్చబరిచే
ఈ బట్టలుతికే
ఇంకా రకరకాల యంత్రాల



సెగల, పొగల, ధ్వనుల
ఉక్కిరి బిక్కిరవుతున్నాను రా!
సూరీడు వెలుగు, పచ్చిగాలికి
మొహం వాచిపోయిందిరోయ్!
చెమట, ఈగలు, దోమలు
దుమ్మూ ధూళీ
ఇవన్నీ ఉన్నాసరే!
ఇక్కడుండను, ఇక్కడుండను
మనూరెళ్లిపోతా
పంపించెయ్‌రా నాన్నా,
నీకు పుణ్యముంటుంది!

(శ్రీమతి ఉమాపరమేశ్వరన్ 'What kind of Place' కవితకు స్వేచ్ఛానువాదం)

**-పాణ్యం దత్తశర్మ**

**సెల్: 95502 14912**

"చూసింది చాల్లే! రండి. దిష్టి తగుల్తుంది" అన్న ఉమాదేవి మాటలకు అంతా నవ్వేసి లోపలికి నడిచారు.

●●●

పెరట్లో దబ్బచెట్టుకింద పరిచిన జంపఖానా మీద కూర్చున్నారందరూ! చల్లని సాయంత్రం, దుబ్బుగా పెరిగిన మరువం సువాసనతో, మేడ మీదికి పాకిన చెంబేలి పూలవాసన కలిసి వాతావరణం గుమ్మగా ఉంది. నీలాకాశాన్ని కప్పేస్తున్న కొబ్బరాకుల సందులోంచి అస్తమిస్తున్న ఆదిత్యకిరణాలు నులివెచ్చగా దోబూచులాడుతున్నాయి. విచ్చుకున్న పత్తిపూవులు కోసి, దీపారాధన వత్తుల కోసం ప్రత్తిని విచ్చదీస్తోంది హైమ. పసివాడైన అభిలాష్‌ని కాళ్ళమీద వేసుకుని ఊపుతోంది బిందు. పాత ఫొటోఆల్బమ్ చూస్తూ, తమ తల్లులు 'అంత పసివాళ్ళుగా కూడా ఎప్పుడైనా ఉన్నారా' అంటూ తెగ అబ్బుర పడిపోతున్నారు. ముగ్గురు అక్కచెల్లెళ్ళ పిల్లలు.

తల్లిఒడిలో తలపెట్టుకుని పడుకుంది కుమారి. 'అమ్మా! రేపు వెళ్ళిపోతున్నానమ్మా! దిగులుగా ఉందే!'

"ఎందుకే పిల్లా దిగులు? నీకిప్పుడు ముప్పయ్యేడు. కొత్తగా అత్తింటికెళ్తున్నావా ఏం?" ముద్దుగా తిట్టింది తల్లి.

"ఛ! నా గురించి కాదమ్మా దిగులు. ప్లీజ్! ఒంటరిగా ఉండొద్దమ్మా! అక్క దగ్గరో, నా దగ్గరో ఎక్కడో ఒకచోట ఉండమ్మా!" గొంతు బొంగురుపోయింది కుమారికి.

"అవునమ్మా! మేం ముగ్గురం కలిసిందీ, కలిసి ఇన్నాళ్ళు నీ దగ్గర ఉన్నదీ అందుకే! ఏదో ఒకటి తేల్చాల్సిందే" చెప్పింది హైమ.

ఏమీ మాట్లాడలేదు ఉమాదేవి.

"అసలు నీ ఉద్దేశమేంటో చెప్పమ్మా! ఇంత పెద్ద ఇంట్లో, ఈ వయసులో ఒక్కదానివే ఉండే సాహసం చెయ్యొద్దు" ఒళ్ళో ఉన్న పసివాణ్ణి పక్కన పడుకోబెట్టి తల్లికి దగ్గరగా వచ్చి అంది బిందు.

కొద్దిగా గొంతు సవరించుకుంది ఉమాదేవి.

ఆత్రంగా చూశారందరూ.

"ఎవరో తెలియనివాళ్లతో, ఎలా బ్రతకాలో తెలియని వయసులో మరో కుటుంబంలోకివచ్చి కొత్త జీవితంలోకి ప్రవేశించడమే ఆడదానికి సాహసం. ఎప్పుడో పద్నాలుగేళ్ళ వయసులో మీనాన్నగారి వేలు పుచ్చుకుని కాపురానికి వచ్చాను. ఎలా గడిచిపోయామో తెలీకుండానే అరవై అయిదేళ్లు దొర్లిపోయాయి. ఇంకా ఈ భూమ్మీద ఉండాలని లేదు. ఉండక తప్పేటట్లులేదు. ఇంటికి పెద్ద కోడలుగా మరుదులకి, ఆడబిడ్డలకి, నా తమ్ముళ్ళకి, ఇతరత్రా బంధువులకీ సేవలేచేశానో, బాధలేపెట్టానో భగవంతుడే తీర్పు చెప్పాలి. ఏదో, మీ నాన్న తెచ్చివ్వడం, నేను వండిపెట్టడంతప్ప ఎవ్వరినుంచీ ఏనాడూ ఏమీ ఆశించలేదు. ఇతరుల అవసరాలు అర్థం చేసుకుని వారికి ఉపయోగపడేలా నన్ను నేను మలుచుకున్నానేతప్ప, మరొకళ్ళనుండి ఏదీ పొందే తత్త్వం కాదు నాది. అహంకారమో, అభిమానమో నాదినాకే తెలియదు. నా మీద ప్రేమతో, పేగు బంధంతో మీ ఇళ్ళకు పిలుస్తున్నారు. నా వయసు పట్ల జాలితో నన్ను మీతో ఉండమంటున్నారు మీరు. కానీ, నావల్ల కాదమ్మా! ఈ ఇంటి అణువణువునా మీ నాన్నగారే కన్పిస్తున్నారు నాకు. ప్రతి మొక్క, పువ్వు అన్నీ నన్ను ఆయనలాగే పలకరిస్తూంటే నాకు ఒంటరితనంగా అనిపించడంలేదు. నేను లేని నాడు ఈ మొక్కలకి నీరెవరు పోస్తారు? ఈ పిల్లలకి నాలుగు గింజలు ఎవరందిస్తారు? మీ ముగ్గురూ పుట్టింట్లో నాలుగు రోజులుండాలంటే ఎక్కడికివెళతారు? నోరులేని ప్రాణులకి, మొక్కలకి తప్ప మరెవ్వ రికీ నా అవసరంలేదు. నేను ఒంటరిని కాదు. నాది సాహసమూ కాదు. అవసరాలు తీర్చడంతప్ప, తీర్చుకోవడం నాకు చేతకాదు. రేపు నేను లేవలేనినాడు నన్ను కాదనుకోకుండా కాచుకోండి. నాన్ననీ, ఈ ఇంటినీ వదిలి నేనుండలేనమ్మా!" దుఃఖంతో ఉమాదేవి మరి మాట్లాడలేకపోయింది.

తమ గురించి ఆలోచిస్తున్నందుకు చెట్లు ఆకులూ, పూలూ రాలుస్తూంటే ఆ తల్లి కన్నబిడ్డల ఆర్తి కన్నీరై వర్షించింది.

**సెల్:94929 21383**

## మనమీదేసర్రోయ్!

సరసి







# గెలవాలంటే వదులుకోవాలి

**శ్రీడెంచి మేలెంచాలి అని మన పెద్దలు ఊరికే అనలేదు. అంటే ప్రతిదీ నెగెటివ్‌గా ఆలోచించమని అర్థంకాదు. ఒకపని మొదలుపెట్టే ముందే దాన్లో ఉండే మంచి చెడులు విశ్లేషించి ఒక అవగాహనకువచ్చి పని మొదలు పెట్టాలనేదే పెద్దలు చెప్పిన సామెతలోని అంతరార్థం. గెలుపు కోరుకోని దెవరు? ఏవయసు వారైనా జీవితంలో కోరుకునేది గెలుపే. కానీ అన్ని సమయా ల్లోనూ అందరినీ గెలుపు వరించదు. ఒక్క మాటలో చెప్పాలంటే, ఎక్కడ తగ్గాలో తెలి సినవాడికి ఎలా నెగ్గాలో కూడా తెలుస్తుం దన్నమాట.**

మనలో చాలామంది గెలుపుదారిలోనే ప్రయా ణిస్తారు. ఏదైనా పని మొదలుపెట్టగానే వెంటనే ఫలితాలు రావాలని కోరుకుంటారు. లేకపోతే మాన సికంగా డీలా పడిపోతుంటారు. దానివల్ల లేని పోని అనారోగ్యం కూడా కొనితెచ్చుకుంటారు. ఒక వేళ ఓడిపోతే దాన్ని అవమానంగా భావించి ఆ తప్పుకు ఎదుటివారిని బాధ్యుల్ని చేసి మనసులోనే కుమిలిపోతుంటారు మరికొందరు. ఇలా మానసిక వ్యథతో ఆత్మహత్య చేసుకునే వారి సంఖ్య ఇటీవల కాలంలో పెరిగిందని అనేక రకాలైన సర్వేలు వెల్ల డిస్తున్నాయి. అయితే ఇలా జరిగిన వాటి గురించి బాధపడేకంటే వాటినుంచి పాఠాలు నేర్చుకుని, మనలో ఉన్న కొన్ని గుణాలు వదిలేసుకుని, మరి కొన్నింటిని అలవర్చుకుంటే జీవితంలో గెలుపు సాధ్యం అంటున్నారు మానసిక నిపుణులు. మరి ఆ లక్షణాలేంటో మీరూ తెలుసుకోండి!

### భయం వీడండి!

భయపడేవాణ్ణి మరింత భయపెడుతుంది భయం. అందుకే భయాన్ని విడనాడి ధైర్యంగా ఉండడం శ్రేయస్కరం. భవిష్యత్తులో ఎలాంటి ఇబ్బందులు వస్తాయో బేరీజువేసుకుని అందుకు అనుగుణంగా ప్రణాళికలు వేసుకోవడం మంచిపని. అయితే రానున్న రోజుల్లో ఏవైనా సమస్యలు ఎదు ర్కోవాల్సి వస్తుందేమో అని చిన్న చిన్న విషయా లకే కొందరు ఊరికే భయపడిపోతుంటారు. దీని వల్ల చేరుకోవాల్సిన లక్ష్యంపై శ్రద్ధపెట్టలేరు. దాంతో అనుకున్న ఫలితాలు పొందలేరు. ఈ కారణంవల్ల తాము ఏ పనీ చేయలేకపోతున్నామనీ, ఎందు లోనూ విజయం సాధించలేకపోతున్నామనీ బాధ పడుతుంటారు. అలా కాకుండా లక్ష్యసాధనలో ఎదురయ్యే అవరోధాలు చూసి భయపడి దాక్కునే బదులు, వాటికి ఎదురునిలిచి ధైర్యంగా పోరాడే లక్షణం అలవాటు చేసుకోవాలి. ఐతే ఉన్నఫళంగా ఒకేసారి ఇది అలవడదు. కాబట్టి నెమ్మది నెమ్మ దిగా దీన్ని అలవరుచుకోవాలి. ఇందుకోసం మీ నైపుణ్యాలను పెంచుకోవడం అవసరం. అప్పుడే ఆత్మవిశ్వాసంతో అడుగు ముందుకు వేయగలం.

### ఆశావహ దృక్పథం

క్లాస్‌రూమ్‌లో అందరికీ సమానమైన విద్య లభించినా కొందరు మాత్రమే ప్రథమశ్రేణిలో నిలు స్తారు. అలాగే ఓ పదిమంది కలిసి ఒకే స్థాయిలో కెరీర్ మొదలుపెడితే వారిలో ఒకరద్దరు మాత్రమే తాము కోరుకున్న, అనుకున్న స్థానానికి చేరుకోగ లుగుతారు. మిగిలినవారు తాము గొప్ప వ్యక్తులం కావాలని అనుకుంటారేతప్ప అనుకున్న ఫలితం అందుకోలేరు. ఎక్కడ జీవితం మొదలుపెట్టారో అక్కడే ఆగిపోతారు. దీనికి కారణం ఆశావహ దృక్పథం లేకపోవడమే. అదెలాగంటే ఈరోజు కష్టాల కడ

## సంకల్పం అవసరం

**ల**క్ష్యం చేరుకునే క్రమంలో మనం ఎంత పక్కాగా ప్రణాళిక రచించామో దాన్ని అమలు చేసే విషయంలోనూ అదే విధంగా వ్యవహరిం చాల్సి ఉంటుంది. లక్ష్యం వైపు అడుగులు వేయడం ప్రారంభించినప్పుడు ఎంత కష్టమైనా సరే లక్ష్యం చేరుకోవాలి అని దృఢనిశ్చయంతో ఉంటారు. కానీ పనిమధ్యలోకి వచ్చేసరికి వది లేస్తారు. గెలవాలనే సంకల్పం క్రమంగా తగ్గి పోవడం, పనిపైన ఆసక్తి క్షీణించడం వంటివి ఇందుకు కారణాలుగా చెప్పొచ్చు. అయితే వాటిని మధ్యలో వదిలేయకుండా చివరిదాకా కృషిచేసిన వారే విజయానికి చేరువవుతారు. ప్రస్తుతం మనం చూస్తున్న ప్రముఖులంతా దాదాపు లక్ష్యాన్ని చేరుకోవడంలో ఇబ్బందులు ఎదుర్కొన్నవారే. ఎన్ని కష్టాలెదురైనా లక్ష్యం చేరుకోవాలనే దృఢసంకల్పమే వారిని అలాంటి స్థాయిలో నిలబెట్టింది. అందుకే విజయం సాధించాలంటే ఈ లక్షణాన్ని తప్పనిసరిగా అలవరుచుకోవాలి.



లిలో ఉన్నప్పటికీ ఒడ్డుకు చేరే నావ తారసపడు తుందని, రేపు మంచి జరుగుతుందని నమ్మకం ఉన్నప్పుడు మాత్రమే వాటికి ఎదురొడ్డి నిలబడా లనే ఆలోచన వస్తుంది. కష్టాలలో కూరుకున్న పుడు నిరాశ సహజం. ఈ నిరాశానిస్పృహల ఫలి తంగా ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్టు తయారవుతుంది మనజీవితం. నిరాశను అధిగ మించగలిగితేనే రెట్టింపు కష్టపడేతత్వం అబ్బు తుంది. అప్పుడే మనకెదురవుతున్న ఇబ్బంది లన్నిం టినీ అధిగమించి విజయశిఖరాలు చేరుకోగలం.



### అహంకారం కూడదు!

అహంకారం ఉన్న వ్యక్తి ఇన్‌స్టంట్ విజయం సాధించగలడేమో కాని కీలక సందర్భాల్లో విజయం సాధించలేడు. అందుకే మనిషికి అహంకారం పనికి రాదంటుంటారు పెద్దలు. కొన్నిచోట్ల వివిధ అంశాల గురించి ఎవరితోనైనా మాట్లాడుతున్నప్పుడు చర్చలు సహజం. అయితే ఇవి ప్రశాంతంగా జరుగు తున్నప్పటికీ కొన్ని సందర్భాల్లో ఆ చర్చలు తీవ్రస్థాయికి చేరుకుంటాయి. ఇలాంటప్పుడు కొన్నిసార్లు ఇత రులు చెప్పిన విషయాన్ని మనసు అంగీకరించ లేకపోవచ్చు. ఐతే, మేలు జరుగుతుందనుకున్న పుడు ఆ విషయాన్ని సమర్థించడం మంచిది. అయితే కొందరు ఇది మరిచిపోయి, తమదే కరెక్ట్ అని వాదిస్తుంటారు. దానివల్ల సక్రమంగా జరగా ల్సినపని మధ్యలోనే ఆగిపోతుంది. కాబట్టి నేను చెప్పిందే వినాలనే పిడివాదం వదిలిపెట్టి, ఇత రులు చెప్పే విషయాలను లోతుగా ఆలోచించే అలవాటు చేసుకోవాలి. ముఖ్యంగా మనతో పాటు ఇంకా నలుగురు పని చేస్తున్నప్పుడు ఈ అంశాన్ని తప్పనిసరిగా దృష్టిలో ఉంచుకోవడం అవసరం. దీని వల్ల మనం సాధించాలనుకున్న పనిని ఎలాంటి ఇబ్బందులు రాకుండా సజావుగా పూర్తి చేయగలుగుతాం.

### కొన్ని మరిచిపోండి

బాధ కలిగినా, సంతోషం కలిగినా కొందరు తట్టుకోలేరు. మరికొందరేమో గతంలో జరిగిన సంఘటనలు తలుచుకుని బాధపడుతుంటారు. వర్తమానంలో మనం చేయాల్సిన పనులపై దృష్టి పెట్టకుండా జరిగిపోయినవాటికే ఎక్కువ ప్రాధాన్య మిస్తారు. ఇలా చేయడంవల్ల మరిన్ని కొత్త సమ స్యలు పుట్టుకొస్తాయి. అంతేకాదు విపరీతమైన ఒత్తిడి వల్ల ఆరోగ్యపరమైన ఇబ్బందులు ఎదురవుతాయి. అందుకే ఈ లక్షణాన్ని వెంటనే వదిలిపెట్టడం మంచిది. గతం గతః జరిగిన కాలం వెనక్కిరాదు. గతాన్ని మరిచిపోయి ఇప్పుడు జరుగుతున్న అంశాలపై దృష్టి సారించాలి. గతం నేర్పిన పాఠాలు మనసులో బాగా ఆకళించుకుని భవిష్యత్తు కోసం చక్కటి ప్రణాళిక రూపొందించుకోవాలి. తద్వారా మంచి జీవితం పొందవచ్చు.

### డోంట్ రిపీట్

తప్పులు చేయడం సహజం. అయితే కొందరు, తప్పులు కప్పిపుచ్చుకోవడానికి మళ్లీ మళ్లీ తప్పు చేస్తుంటారు. ఇతరుల్ని ఇబ్బందులకు గురిచేస్తుం టారు. పైగా ఆ తప్పులను ఇతరులపైకి నెట్టేస్తుం టారు. ఇలాంటి మనస్తత్వం గలవారిని చాలా మంది దూరంగా నెట్టేసే అవకాశం ఉంది. పైగా ఇతరులను అనవసరంగా ఇబ్బంది పెట్టామనే భావన మానసికంగా మనల్ని వేధిస్తూ ఉంటుంది. కాబట్టి చేసిన పొరపాట్లను ధైర్యంగా ఒప్పుకోవాలి. ఆ పొరపాట్లు పునరావృతం కాకుండా జాగ్రత్తపడాలి. లేదంటే వృత్తిగత జీవితంతో పాటు వ్యక్తిగత జీవి తంలోనూ ఒడిదొడుకులు ఎదుర్కోవాల్సి వస్తుంది. మనం చేసిన పొరపాట్లను ధైర్యంగా ఒప్పుకున్నట్లయితే వాటిని సరిదిద్దుకోవడానికి స్నేహితులు, సహోద్యోగులు సహాయంచేసే అవకాశం ఉంటుంది.

### ఓర్పుతో..

లక్ష్యానికి చేరువ కావాలంటే మనకు అవసరమై నది సహనం. చాలామంది ఏపని చేసినా ఫలితం త్వరగా కనిపించాలని ఆశిస్తూ ఉంటారు. అయితే అన్ని సందర్భాల్లో త్వరగా ఫలితాలు రాకపోవచ్చు. కొన్నిసార్లు ఆలస్యంగా కూడా రావచ్చు. అన్నీ సవ్యంగా చేసినా కొన్నిసార్లు ఫలితం ప్రతికూ లంగా ఉండే అవకాశాలున్నాయి. వీటికారణంగా ఆత్మస్థైర్యం దెబ్బతినకుండా సహనమే కాపాడు తుంది. సహనంగా ఉన్నట్లయితే ఉన్నతస్థాయి లోకి వెళ్ళిన తర్వాత కూడా కిందిస్థాయి వారితో మంచి సంబంధ బాంధవ్యాలు ఏర్పరుచుకోవచ్చు.

కొన్ని సందర్భాల్లో ఓర్పుతోపాటు సమయస్ఫూర్తి కూడా అవసరం. ప్రణాళిక ప్రకారం పనులు చేయా లనుకోవడం సరైన పద్ధతేకానీ ఒక పని మొదలు పెట్టినప్పుడు ఉన్న పరిస్థితులకు, మొదలుపెట్టిన తర్వాత ఉన్న పరిస్థితులకు చాలాతేడా ఉంటుంది. అప్పుడు చాలా మార్పులువచ్చే అవకాశం ఉంది. అలాంటప్పుడు సమయస్ఫూర్తితో పరిస్థితులకు తగినవిధంగా వ్యవహరించే నేర్పు ఉండాలి. అప్పుడే ప్రణాళికలో తగినన్ని మార్పులు చేసుకో గలం.

- నివేదిత

## ఆత్మహత్యలు మనదేశంలోనే ఎక్కువ!

మెదడులో స్రవించే అత్యంత ప్రధానమైన రసాయనాల్లో సెరిటోనిన్ ఒకటి. విపరీతమైన తొందరపాటు, తమను తాము గాయపరుచు కునే ధోరణి ఉన్న వారిలో దీని స్రవాలు తక్కువ. ఆత్మహత్యలకు పాల్పడే తత్వం ఉన్నవారిలో ఈ సెరిటోనిన్ స్థాయి చాలా తక్కువగా ఉన్నట్లు అధ్యయనాలు పేర్కొంటు న్నాయి. మన దేశంలో జరుగుతున్న ఆత్మహ త్యల విషయంలో ప్రపంచ ఆరోగ్య సంస్థ సైతం ఆందోళన వ్యక్తం చేసింది. ముప్పై ఏళ్ల లోపువాళ్ళు ఆత్మహత్యలకు పాల్పడటం మన దేశంలోనే ఎక్కువని డబ్ల్యూహెచ్ఓ పేర్కొంది. ఆత్మన్యూనత కారణంగా ఆత్మహత్య చేసుకునే వారి సంఖ్య పెరుగుతోంది.





# సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు

8



-కంఠంనేని స్వప్న

**అంతా నిశ్శబ్దంగా ఉంది.**

**చీమ చిటుక్కుమన్నా ఉలికిపడుతున్నాడు అక్షయ్.**

**ఆవేదనగా ఉందతనికి.**

**నైరాని తలుచుకుంటుంటే గుండె బద్దల య్యేట్లుంది.**

**"వై మీ? వై మీ? నాకే ఎందుకు జరగాలి?" ఆక్రోశిస్తున్నదతని మనస్సు.**

**'ఎన్నో తప్పులు చేసే వాళ్లున్నారు. భయంకరమైన నేరాలు చేసే వాళ్ళున్నారు. అలాంటి వాళ్ళంతా బాగానే ఉన్నారు. నాకే ఒక దాని తర్వాత ఒకటి ఇలా ఎందుకు జరగాలి? దేవుడా! తప్పుచేస్తున్నావు. ఇది చాలా అన్ ఫెయిర్' మనసులో ఉన్నాడో లేదో తెలీని దేవుడితో కనబడని యుద్ధం చేస్తున్నాడు.**

'ఎందుకు కిడ్నాప్ చేసి ఉంటారు? డబ్బుల కోసమా? ఇంకేదైనా?'

'డబ్బు కోసమైతే తనకి ఫోన్ రావాలి. ఫోన్ వస్తే బాగుండును. ఎంత డబ్బడిగినా ఏదో ఒక రకంగా సంపాదించి ఇవ్వొచ్చు. ఇంకా ఫోన్ రాదేమిటి?'

'ఇంకేదైనా కారణమయ్యుండొచ్చా?'

పసిపిల్లల మీద అత్యాచారాలు...

కన్నో, కాలో తీసేసే బెగ్గింగ్ మాఫియా...

అతీతశక్తుల కోసమో, నిధుల కోసమో పిల్లలను బలిచ్చే మంత్రగాళ్ళు...

ఇదివరకు పెద్దగా ప్రభావం చూపని వార్తలెన్నో ఒక్కొక్కటీ గుర్తొస్తున్నాయి. ఒళ్ళు జలదరిస్తోంది. వెన్నులో నుంచి చలి పుడుతోంది.

'మిస్సింగ్ చైల్డ్', 'కిడ్నాప్‌కి గురైన బాలుడు' వంటి వార్తలు టీవీలో మాత్రమే కనబడతాయనుకున్నాడిన్నాళ్ళూ తను. కానీ తనే ఇటువంటి పరిస్థితి ఎదుర్కోవలసి వస్తుందనుకోలేదు.

సాధారణంగా కిడ్నాప్ జరిగిన ఇరవై నాలుగు గంటల్లో దొరక్కపోతే, సజీవంగా దొరికే అవకాశాలు తక్కువ అంటారు, స్టాటిస్టిక్స్‌ని బట్టి చూస్తే!

అప్పుడే అయిదు గంటలు గడిచాయి. అదీ తను నిద్రలేచి నైరా ఇంట్లో లేదని తెలుసుకున్నప్పటి నుంచీ ఇప్పటివరకూ గడిచిన సమయం. అసలెప్పుడు ఇంట్లోకి చొరబడి తీసుకెళ్లారో?

తనకెందుకు మెలకువ రాలేదు?

తన కోసం పిలిచిందేమో? అరిచిందేమో? ఎంత భయపడి ఉంటుందో...

తనకి వినపడక పోవటం, పక్కగదిలోనే ఉన్న నైరాని తను రక్షించుకోలేక పోవటం అతనికి చాలా గిల్టీగా ఉంది.

అంత మొద్దు నిద్ర ఎలా పోయాడతను?

ఒక్కొక్క నిమిషం గడుస్తోంది.

అతనికి చాలా అసహనంగా ఉంది.

పసిపిల్లని ఎవరో ఎత్తుకుపోతే కనీసం వెతకటమైనా చేయకుండా ఫోన్ కోసం ఎదురుచూస్తూ కూర్చోవలసి రావటం చాలా బాధాకరంగా ఉంది.

●●●

ఫోన్ మోగుతోంది.

మొదటి రింగ్ పూర్తి కాకుండానే ఆన్సర్ చేశాడు అక్షయ్.

హర్ష కళ్ళలో కుతూహలం. నైరా గురించిన ఫోన్ అయ్యుండొచ్చనే ఆశ కనబడుతోంది, అతని మొహంలో.

'హలో... హలో!' ఆదుర్దాగా అన్నాడు అక్షయ్.

అవతల వైపు నిశ్శబ్దం.

'హలో....!' గట్టిగా అరిచినట్లే అన్నాడు.

ఏదో వాళ్ళలో వాళ్ళే మాట్లాడుకుంటున్న శబ్దాలు వినిపిస్తున్నాయి అవతల వైపు నుంచి.

చెవులు రిక్కించి జాగ్రత్తగా వినసాగాడు అక్షయ్. ఏదైనా క్లూ దొరకొచ్చనే ఆశ.

అప్పుడు వినిపించింది.

"హెచ్.డి.ఎఫ్.సి. బ్యాంక్ పర్సనల్ లోన్ కావాలా సార్?"

ఒళ్లు మండిపోయింది అక్షయ్‌కి.

ఫోన్ కట్ చేశాడు.

మళ్లీ ఫోన్ కేసి చూస్తూ కూర్చున్నారు.

## జరిగిన కథ

*అదో మల్టీ నేషనల్ కంపెనీ! రెండేళ్ళుగా ఆ కంపెనీలోనే పనిచేస్తున్నాడు అక్షయ్. కావ్య కూడా అదే ఆఫీసులో ఫ్రెషర్‌గా జాయినైంది. ఆఫీసులో కొత్తగా చేరిన సీమ, అక్షయ్ స్నేహితురాలని తెలిసి ఉడికిపోయింది కావ్య. అక్షయ్ వాళ్ళ అక్కా, బావ యాక్సిడెంట్‌లో చనిపోయారనే వార్త అతణ్ణి అతలాకుతలం చేస్తుంది. స్నేహితులంతా వచ్చి పరామర్శిస్తుంటారు. ఇక తనకు మిగిలిన ఒకే ఒక బంధం నైరాని ఎటువంటి లోటు రానీకుండా పెంచాలనుకుంటాడు. ఒక కార్పొరేట్ స్కూల్‌లో జాయిన్ చేస్తాడు. స్కూల్ టైమింగ్స్‌కి అనుగుణంగా తన ఉద్యోగ సమయాలను మార్చుకుంటాడు అక్షయ్. అకస్మాత్తుగా నైరా కనిపించకుండా పోయింది. పోలీస్ కంప్లయింట్ ఇస్తాడు అక్షయ్. **ఆ తర్వాత...***



నిశ్శబ్దం దుర్భరంగా ఉంది.

ఫోన్‌కి సిగ్నల్ ఉందో లేదో అని మధ్య మధ్యలో చెక్ చేసుకుంటున్నారు.

హర్ష తన ఫోన్ నుంచి పోలీస్‌స్టేషన్‌కి ఫోన్ చేశాడు.

'నైరా గురించి ఏదైనా ఇన్ఫర్మేషన్ దొరికిందా?'

'ఇంకాలేదు. ఎంక్వయిరీ చేస్తున్నాం. ఏదైనా ఫోన్ వచ్చిందా?' తిరిగి ప్రశ్నించారు.

లేదన్నాడు హర్ష.

'వెయిట్ చేస్తుండండి. ఫోన్ వస్తుంది. ప్రస్తుతానికి అంతకంటే చేయగలిగింది లేదు'.

నిరాశగా ఫోన్ పెట్టేశాడు హర్ష.

అప్పుడప్పుడు ఫ్రెండ్స్ నుంచి, కొలీగ్స్ నుంచి నైరా దొరికిందేమోనని ఫోన్‌కాల్స్ వస్తున్నాయి.

ఆ సమయంలో తీవ్ర అసహనానికి లోనవుతున్నాడు అక్షయ్.

ఒకవేళ అదే టైమ్‌లో కిడ్నాపర్ ఫోన్ చేస్తే..?

ఫోన్ కలవకపోతే ఆ కోపంతో నైరాని ఏమైనా



చేస్తాడేమో?

ఒక్కోక్షణం దుర్భరంగా గడుస్తోంది.

ఇరవై నాలుగు గంటల గడువు దగ్గర పడుతోంది.

నైరాని, తను మళ్లీ సజీవంగా చూడలేడా?

●●●

సాయంత్రానికి ఇన్‌స్పెక్టర్ శ్రీకాంత్, ఇద్దరు పోలీసులతో అపార్ట్‌మెంట్‌కి చేరుకున్నాడు.

నైరా వయసు ఆరేళ్ళలోపు కావడం, కిడ్నాప్ జరిగి పన్నెండు గంటల సమయం గడవటంతో ఆ కేస్ ప్రాధాన్యం సంతరించుకుంది.

సాధారణంగా ఒక్కో వృత్తిలో ఉండేవారి మీద మనకు ఒక రకమైన అభిప్రాయం ఉంటుంది. రాజకీయనాయకులు తడి గుడ్డతో గొంతులు కోస్తారనీ, పోలీసులు క్రూరంగా ఉంటారనీ, గవర్నమెంట్ ఉద్యోగులు లంచగొండులనీ ఇలా... అయితే ఒక్కోసారి ఆ వృత్తిలో ఉండే ఒక వ్యక్తిని మనం కలిసినప్పుడు వారి ప్రవర్తన, వైఖరి మనని ఎంతగా ప్రభావితం చేస్తుందంటే ఆ వ్యవస్థ మీద, వృత్తి మీద మనకున్న అభిప్రాయాలన్నీ తలకిందులవుతాయి.



శ్రీకాంత్‌తో మాట్లాడిన కాసేపటికే అక్షయ్, హర్షలకు పోలీస్ వ్యవస్థ మీద నమ్మకం పెరిగింది. తమకు వాళ్లు న్యాయం చేయగలరనే విశ్వాసం కలిగింది.

'నైరా పూర్తిపేరు?' అడిగాడు శ్రీకాంత్. దర్యాప్తు మొదలుపెట్టడానికి అవసరమైన అన్ని వివరాలు సేకరించసాగాడు.

చెప్పాడు అక్షయ్.

తల్లిదండ్రుల పేర్లు, ఎత్తు, రంగు, జుట్టు రంగు, కిడ్నాప్‌కి గురైనప్పుడు వేసుకున్న బట్టలు, ఆమె స్కూలు, టీచర్స్ పేర్లు, స్నేహితుల గురించిన డీటెయిల్స్ అన్నీ నోట్ చేసుకున్నాడతను.

ఒంటిమీద ఏవైనా గాయాలమచ్చలు కానీ, గుర్తు పట్టటానికి వీలయ్యే పుట్టుమచ్చలు కానీ ఉన్నాయేమో అడిగాడు.

'పళ్ళకు బ్రేసెస్ ఉన్నాయా?'

'మెడికల్‌గా కాంప్లికేషన్స్ ఏమైనా ఉన్నాయా? రోజూ మందులు వాడాల్సిన అవసరం ఏదైనా ఉందా?'

అన్నిటికీ జవాబులు రాసుకుని మాస్టర్ కేస్ ఫైల్‌లో పెట్టుకున్నాడు.

నైరా ఫోటోలు ఆల్బమ్‌లో నుంచి వెతికి, తమ ఇన్వెస్టిగేషన్‌కి సహాయపడే విధంగా ఉన్న వాటిని తీసుకున్నాడు.

'ఏమైనా ఆస్తి తగాదాలున్నాయా?' అడిగాడు.

'నాకు తెలిసినంతవరకూ లేవు' చెప్పాడు అక్షయ్.

'తల్లిదండ్రులు ఈ మధ్యే చనిపోయారంటున్నారు. ఏ పరిస్థితుల్లో వాళ్లు చనిపోయారు?' అడిగాడు.

'అది యాక్సిడెంట్. కార్ యాక్సిడెంట్‌లో అమెరికాలో చనిపోయారు' చెప్తుండగా తట్టింది అక్షయ్‌కి. ఒక్కసారిగా భయం ఆవహించింది.

'ఎందుకు అడుగుతున్నారు? ఒకవేళ నైరాని ఎవరైనా.....' ఆగిపోయాడు అక్షయ్.

అంతకుమించి వాక్యం పూర్తి చేయటానికి కూడా అతనికి మనసొప్పట్లేదు.

'ఇదంతా మా ఇన్వెస్టిగేషన్‌లో భాగమే. ఎవరైనా అపహరణకి గురైనప్పుడు అడగాల్సిన ప్రశ్నల లిస్ట్ ఒకటి మా దగ్గర ఉంటుంది. ప్రత్యేకించి ఈ కేస్ గురించి నేను మాట్లాడటం లేదు. ఇంకా ఏమై ఉంటుందనే విషయంలో మేమొక అవగాహనకి రాలేదు. డోంట్ వర్రీ!' చెప్పాడు శ్రీకాంత్.

ప్రశ్నల పరంపర కొనసాగించాడు.

'పాప కిడ్నాప్‌కి గురైన రాత్రి ఇంట్లో ఎవరెవరున్నారు?'

'నేనొక్కడినే!' చెప్పాడు అక్షయ్.

'ఆఖరిసారి పాపని ఎప్పుడు చూశారు?'

'ముందురోజు రాత్రి పది గంటల టైమ్‌లో...'

గులాబీరంగు స్లీప్‌వేర్‌లో తనకి గుడ్‌నైట్ చెప్పి

రూమ్‌లోపలికి వెళ్తున్న నైరా గుర్తొచ్చింది అక్షయ్‌కి.

ఎంత ధైర్యంగా ఉండేది తనున్నాడని.

ఒకరోజు తను నైరాతో ఏం చెప్పాడు... 'నిన్ను వదిలి నేనెక్కడికీ వెళ్ళను, నీకు నేనున్నాను' అని కదూ.

'పక్కగదిలోనే ఉండి కూడా తనామెని రక్షించుకో లేకపోయాడు!'

అప్రయత్నంగా కళ్ళనుంచి నీళ్ళు కార సాగాయి.

'ఆ రోజు నైరా తనకి గుడ్‌నైట్ చెప్పటమే గుర్తొస్తోంది. అదే ఆఖరి చూపా? జీవితంలో మళ్లీ తను నైరాని చూడలేడా?'

'ఎప్పుడైనా నైరా ఇంట్లో నుంచి పారిపోవటం గురించి కానీ, సూసైడ్ గురించి కానీ మాట్లాడటం జరిగిందా?'

ఉలికిపడి తలెత్తాడు అక్షయ్.

'సారీ, మిమ్మల్ని బాధపెట్టడం నా ఉద్దేశం కాదు. కానీ అన్నివైపుల నుండీ ఆలోచించి పరిశోధన సమర్థవంతంగా జరపటానికి ఈ సమాచారం అంతా మాకు ఉపకరిస్తుంది' చెప్పాడు ఇన్‌స్పెక్టర్.

తలూపాడు అక్షయ్.

'లేదు. ఎప్పుడూ అలా మాట్లాడటం జరగ లేదు'.

'చిన్నపిల్లయినా మా అందరికంటే ఎక్కువ పాజిటివ్ దృక్పథంతో ఉండేది. ఏజ్‌కి మించిన మెచ్యూ రిటీ చూపించేది. ఎప్పుడూ డిప్రెస్డ్‌గా కానీ, దిగు లుతో కుంగిపోయినట్లు కానీ ఎవరికీ అనిపించ లేదు' అందించాడు హర్ష.

'మీరెవరు?' అనుమానంగా చూశాడు శ్రీకాంత్.

సేకరించిన సమాచారం అంతా ఫైల్‌లో పెడుతూ చెప్పాడు శ్రీకాంత్.

"ఈ ఇన్వెస్టిగేషన్ ప్రక్రియ మీకు కాస్త బాధ కలిగించవచ్చు. కానీ ఇదంతా మాకు పరిశోధనచేసే క్రమంలో పనికొస్తుంది. మిమ్మల్ని భయభ్రాంతుల్ని చేయటం మా ఉద్దేశం కాదు. మీలో ఆశలు కల్పిం చడం కూడా మంచిది కాదు. అందుకే చెప్తు న్నాను".

"ప్రతి సంవత్సరం మన దేశంలో దాదాపు నలభై వేల మంది పిల్లలు అపహరణకి గురవు తారు. అందులో దాదాపు నలభై అయిదు శాతం కేసులు అపరిష్కృతంగానే మిగిలిపోతాయి. పరి ష్కారం దొరికిన కేసులన్నీ హ్యాపీ ఎండింగ్స్ ఏమీ కావు. అయినా మన ప్రయత్నం మనం చేయాలి. ఆఖరు నిమిషం వరకూ చైల్డ్ ఎక్కడో సురక్షితంగా ఉందనీ, మన సహాయం కోసం ఎదురు చూస్తుందనే మనం గట్టిగా నమ్మాలి. అప్పుడే ప్రయత్నలోపం లేకుండా పరిశోధన జరుగుతుంది".

'మా వైపు నుంచీ మేము ఇన్వెస్టిగేషన్ మొద లెడతాం. అయితే ఏదైనా అవసరమయినప్పుడు ఫోన్‌చేస్తే మీరు పోలీస్‌స్టేషన్‌కి రావలసి ఉంటుంది. మీకు ఫోన్ ఏదయినా వస్తుందేమో ఎదురు చూడండి. ఇంత ప్లాన్డ్‌గా ఇంట్లోకి చొరబడి పిల్లని ఎత్తుకెళ్ళారంటే తప్పకుండా డబ్బుకోసం ఫోన్ వస్తుందనే అనుకుంటున్నాను. మీ ఫోన్‌ని టాప్ చేయించుతాము. మీకు ఏ సమాచారం అందినా వెంటనే మాకు తెలియజేయండి'.

తలూపాడు అక్షయ్.

"ఒకసారి ఇల్లంతా సెర్చ్ చేయాలి" అన్నాడు శ్రీకాంత్.

వింతగా చూశాడు అక్షయ్.

"కొన్ని సందర్భాల్లో పిల్లలు ఆడుకుంటూనో, ఆటలో భాగంగానో ఏదో ఒక మూల ఇంట్లోనే దాక్కుంటారు. తర్వాత స్పృహ కోల్పోవటమో లేదా నిద్రపోవటమో చేయడంతో వెతికినా దొరకకపో వచ్చు. ఊపిరాడక చనిపోయి దొరికిన సంఘట నలు కూడా ఉన్నాయి" చెప్పాడు.

శ్రీకాంత్, అతనితో వచ్చిన పోలీసులు ఇద్దరూ మంచాల కిందా, ఫ్రిజ్‌లో, అటకల మీద, అల్మారాల్లో అణువణువూ గాలించారు.

నైరా గది ఫోటోలు తీసుకున్నారు.

వాళ్లు వెళ్తుండగా చెప్పాడు అక్షయ్.

"నైరా రక్షణ నా బాధ్యత. నేను దాన్ని సక్రమంగా నిర్వర్తించలేక పోయాను. మీ పరిశోధనలో నన్ను కూడా ఇన్‌వాల్వ్ చేయండి. ఒకవేళ మీరు వేరే కేసుల బిజీలో ఉండి నైరాని వెతకటానికి కుదరక పోతే ఏమి చేయాలన్నా నాకు చెప్పండి'.

అతనిలో ఫైటర్ ఇన్‌స్టింక్ట్ నిద్ర లేస్తోంది.

సానుభూతిగా చూసి కదిలారు పోలీసులు.

●●●

ఆరోజు రాత్రి నైరాకి సంబంధించిన అన్ని వివ రాలు మిస్సింగ్ చిల్డ్రన్ డేటాబేస్‌లో ఎంటర్ చేయ బడ్డాయి.

అన్ని పోలీస్‌స్టేషన్లకీ నైరా ఫోటో, ఆమె వివ రాలు పంపబడ్డాయి.

ఆ రాత్రి అక్షయ్ ఒక్కక్షణం కూడా నిద్రపోలేదు.

కళ్ళు ఎర్రబారాయి.

అతను ఎదురు చూస్తున్న ఫోన్ మాత్రం రాలేదు.

**నైరా పోలికలతో ఓ పాప దొరికింది, మీరు వచ్చి గుర్తుపట్టాలి అని ఫోన్ చేశాడు ఇన్‌స్పెక్టర్ శ్రీకాంత్. అక్షయ్ బయలుదేరి వెళ్లాడు. అతన్ని హాస్పిటల్‌కి తీసుకెళ్లాడు శ్రీకాంత్. దేవుళ్లందరికీ మొక్కుతున్నాడు అక్షయ్. భయపడుతూనే హాస్పిటల్ గదిలోకి అడుగుపెట్టాడు. పాపను చూస్తూనే, రెండు చేతుల్లో మొహం కప్పుకుని కూలబడిపోయాడు. ఇంతకీ ఆ పాప నైరాయేనా? అసలేమైంది?**

హర్ష అక్షయ్‌కి తోడుగా అక్కడే ఉండి పోయాడు.

●●●

ఆ ఏరియాకి చెందిన సీసీ ఫుటేజ్ తెప్పించు కున్నాడు శ్రీకాంత్.

కిడ్నాప్ జరిగిన రాత్రి పదిగంటల నుంచీ పొద్దున్న అయిదింటి వరకూ ఒక సెకండ్ కూడా మిస్ చేయకుండా చూశాడు.

ఎక్కడా ఏమీ క్లూ దొరకటం లేదు.

అనుమానించదగ్గ కదలికలు కూడా కనిపించ లేదందులో.

నైరా కేస్ కూడా అన్‌ట్రేసబుల్ సెక్షన్‌లోకి వెళ్ళి పోయి మూతపడుతుందని అతనికి బలంగా అని పించసాగింది.

●●●

ఫోన్ మోగుతోంది.

టక్కున మొదటి రింగ్‌కే ఎత్తాడు అక్షయ్.

అవతలివైపు నుంచీ శ్రీకాంత్ అడుగుతున్నాడు.

"ఏదైనా ఫోన్ వచ్చిందా?"

లేదన్నాడు అక్షయ్.

"మీ ఫోన్ టాప్ చేస్తామని ఊహించి మరే దైనా నంబర్‌కి చేయవచ్చు. మీకు దగ్గర బంధువు లకుగానీ, స్నేహితులకుగానీ..?'

"హర్ష కూడా నాతోనే ఉన్నాడు. ఇద్దరికీ ఫోన్లేమీ రాలేదు".

'స్ట్రేంజ్.. సీసీ ఫుటేజ్‌లో కూడా ఏమీ దొరక లేదు' బుర్ర గోక్కుంటూ అన్నాడు శ్రీకాంత్.

"సీసీ ఫుటేజ్! మేము కూడా చూడొచ్చా? ఒక ఇంజనీర్‌గా మీకు కనబడనిదేదయినా నాకు కన బడే ఛాన్సుంది కదా?' అడిగాడు అక్షయ్. అతనిలో ఏదో ఆశ తళుక్కుమంది.

"సారీ అక్షయ్! సీసీ కెమెరా ఫుటేజ్‌లో ఏమీ దొరకకపోవటం, మీకింతవరకూ ఫోన్ కూడా రాక పోవటం, ఆమెకి దగ్గర బంధువులు మీరు తప్ప మరె వరూ లేకపోవటం.. వీటన్నిటిని బట్టీ ఆలోచిస్తే అతి త్వరలో మీ మీదకే అనుమానాలు మళ్లేలా ఉన్నాయి" కరాఖండిగా చెప్పాడు శ్రీకాంత్.

ఒక్కక్షణం షాక్ తిన్నట్లయ్యాడు అక్షయ్.

కాసేపు నిశ్శబ్దం తర్వాత చెప్పాడు.

"మీరు ఏ ఎంక్వయిరీ అయినా చేసుకోండి. నాకు అభ్యంతరం లేదు. ప్రస్తుతానికి మాత్రం చేతులు ముడుచుకుని కూర్చోలేక పోతున్నాను. సీసీ ఫుటేజ్ చూస్తే నాకు ఏదైనా లీడ్ దొరకవచ్చు".

అతని మాటల్లో సిన్సియారిటీ వినబడిందేమో ఆలోచనలో పడ్డాడు శ్రీకాంత్.

సీసీ ఫుటేజ్ పరిశీలించడానికి రమ్మన్నాడు.



ఆదుర్దాగా సీసీ పుటేజ్ పరిశీలిస్తున్నారు వాళ్లు.

హర్షని ఇంటి దగ్గరే ఉంచి వచ్చాడతను.

రెండు గంటలు గడిచింది.

సీసీ పుటేజ్‌లో టైమ్, మూడు గంటల ఇరవై అయిదు నిమిషాలుగా చూపిస్తోంది.

"వన్ సెకండ్!" అరిచినట్లే అన్నాడు అక్షయ్.

ఒక్క నిమిషం ముందుకెళ్లి రీప్లే చేయండి.

అతన్ని ఆశ్చర్యంగా చూసి రివైండ్ చేసి ప్లే చేశాడు శ్రీకాంత్.

'నేను అనుకున్నది కరెక్టే. ఎవరో వీడియో టాంపర్ చేశారు!' అన్నాడు అక్షయ్.

'అసాధ్యం! సర్వర్స్ పోలీసుల ఆధీనంలో ఉంటాయి' కాన్ఫిడెంట్‌గా చెప్పాడు శ్రీకాంత్.

'చూపిస్తాను చూడండి' గబగబా సాఫ్ట్‌వేర్ ఒకటి డౌన్‌లోడ్ చేశాడు.

వీడియోని ఆ అప్లికేషన్ ద్వారా ఓపెన్ చేశాడు.

అతనేదో బటన్‌ని ప్రెస్ చేస్తున్నాడు.

చేసినప్పుడల్లా 'నెక్స్ట్ ఫ్రేమ్' అని కనబడు తోంది. ఇమేజెస్ జరుగుతున్నాయి. అయితే అతను టాంపరింగ్ జరిగిందని గుర్తించిన భాగంలో మాత్రం నెక్స్ట్ ఫ్రేమ్‌లోకి ఇమేజ్ మారటం లేదు.

"ఇంకా కొన్ని పద్ధతులున్నాయి, టాంపరింగ్ జరిగిందనే విషయం నిరూపించడానికి!" చెప్పాడు అక్షయ్.

ఆశ్చర్యంగా చూశాడు శ్రీకాంత్.

సాఫ్ట్‌వేర్ మీద అతనికి ఉన్న పట్టుకి ఇంప్రెస్ అయినప్పటికీ అతను అంత తేలిగ్గా టాంపరింగ్ జరిగి ఉండొచ్చంటే నమ్మలేక పోతున్నాడు.

అక్షయ్‌ని అక్కడే కూర్చోబెట్టి ఫోరెన్సిక్ డిపార్ట్ మెంట్‌కి సంబంధించిన టీమ్‌కి ఫోన్ చేశాడు.

వాళ్లతో మాట్లాడి ఫోన్ పెట్టాక చెప్పాడు.

"ఒక గంట వెయిట్ చేయాలి. సెకండ్ ఒపీని యన్ తీసుకుంటున్నాను".

అక్షయ్ తల వాల్చుకుని ఫోన్‌కేసి చూస్తూ కూర్చున్నాడు. శ్రీకాంత్ వేరే ఫైల్స్ చూడటం మొదలు పెట్టాడు.

సరిగ్గా గంట తర్వాత ఫోరెన్సిక్ డిపార్ట్‌మెంట్ నుంచి ఫోన్ వచ్చింది.

"మీరు చెప్పింది కరెక్టే. వీడియో టాంపర్ అయింది" కన్ఫర్మ్ చేశారు వాళ్లు.

సంభాషణ వింటున్న అక్షయ్‌వైపు చూశాడు శ్రీకాంత్.

భావరహితంగా ఉందతని మొహం.

అంటే పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో ఎవరి హ్యాండైనా ఉండి ఉండవచ్చా? ఆలోచనలో పడ్డాడు శ్రీకాంత్.

'బాకప్ సర్వర్స్ ఎక్కడ ఉంటాయి?' అడిగాడు అక్షయ్. చకచకా తర్వాత చేయాల్సింది ఆలోచిస్తు న్నాడతను.

బాకప్ సర్వర్స్ నుంచి డేటా తెప్పించారు.

అయితే వాళ్లకు ఆ రోజుకి సంబంధించిన పుటేజ్ దొరకలేదు.

నిస్సహాయంగా మొహం పెట్టాడు శ్రీకాంత్. పోలీస్ డిపార్ట్‌మెంట్ కంట్రోల్‌లో ఉండే వాటిలో కూడా టాంపరింగ్ జరగటం అతనికి అవమానకరంగా అనిపిస్తోంది.

అంతేకాదు, ఆ కేసులో తీవ్రత అర్థమవుతోంది.

"ఇది మామూలు కిడ్నాపింగ్ వ్యవహారం అయ్యుం డకపోవచ్చు" అతని ఇంట్యూషన్ చెప్తోంది.

"మేముండే వీధికి రెండువైపుల నుండి కలిపి అయిదు దారు లున్నాయి. ఆ కనెక్టింగ్ రూట్స్‌లో మనం టాంపరింగ్ చేశారనుకుంటున్న టైమ్‌కి ఒక రెండు నిమిషాలు అటూ ఇటుగా ఉన్న సీసీ పుటేజ్‌ని పరిశీలిస్తే?" అడిగాడు అక్షయ్.

'తర్వాత చేయాల్సిన పని అదే. అయితే అవి ఏ పోలీస్‌స్టేషన్ల పరిధిలోకి వస్తాయో చూడాలి. ఇదంతా కొద్దిగా టైమ్ పట్టే వ్యవహారం' చెప్పాడు శ్రీకాంత్.

"నేను ఆ పనిమీద ఉంటాను. అన్నట్లు డబ్బుల కోసం ఎవరూ ఫోన్ చేయలేదా?" అడిగాడు.

"లేదింకా?"

'ఇది మామూలు కేస్ లాగా లేదు. మీకు అర్థమై ఉంటుందనుకుంటాను. హైటెక్ ఫీల్డ్‌కి సంబంధించిన వాళ్లు కానీ, ఎవరో హై ప్రొఫైల్ వాళ్లు కానీ ఇన్ వాల్వ్ అయ్యారని నా నమ్మకం. కాకపోతే మనకి కొద్దిగా ఊరట కలిగించే సంగతి ఏమిటంటే ఇటు వంటి కేసుల్లో ఏదో స్ట్రాంగ్ మోటివ్ ఉంటుంది. కాబట్టి ఇప్పటివరకూ నైరాకి హాని తలపెట్టి ఉండ కపోవచ్చు. ఒకవేళ చంపటం వాళ్ల ఉద్దేశమయితే ఇంట్లోనే, ఆ రాత్రే చంపేసేవారు' అన్నాడు శ్రీకాంత్.

సంతోషించాలో బాధపడాలో అర్థం కాలేదు అక్షయ్‌కి.

•••

ఆ తర్వాత రెండు రోజులకి, సాయంత్రం నాలుగు గంటల ప్రాంతంలో అక్షయ్‌కి పోలీస్ స్టేషన్ నుంచి ఫోన్ వచ్చింది.

అప్పటికి అతను ఆఫీస్‌కి వెళ్ళటం మానే శాడు.

తిండి తినటం మానేశాడు.

కంటిమీద రెప్పవేయకుండా ఆలోచిస్తున్నాడు. నిద్రలేక కళ్ళు ఎర్రగా అయ్యాయి.

హర్ష అతనికి తోడుగా ఉండి ఇంట్లో నుంచి వర్క్ చేస్తున్నాడు.

ఫోన్ పెట్టేయగానే అక్షయ్ అన్నాడు.

"పోలీస్‌స్టేషన్ నుంచి ఫోన్, ఏదైనా లీడ్ దొరి కిందేమో! నేను వెంటనే వెళ్లాలి. ఒకవేళ నైరా వస్తే ప్లీజ్ టేక్‌కేర్ ఆఫ్ హర్. తొందరగా వచ్చేస్తాను. నైరా వస్తే నాకు ఇమ్మీడియట్‌గా కాల్‌చేయి".

"తప్పకుండా!" చెప్పాడు హర్ష.

## ఆ విషయాన్ని మరిచిన అనుపమ

ఆ విషయం అంటే మేకప్ అన్నమాట! మొదటి సినిమా 'ప్రేమమ్' లోనూ, ఆ తరువాతి సినిమా 'అ ఆ'లోనూ అనుపమా పరమేశ్వరన్ అందచందాలు ప్రేక్షకులను కట్టిపడేశాయి. కానీ మొన్న వచ్చిన 'శతమా నంభవతి' సినిమాలో మొదటి భాగం ఒకలా, రెండవ భాగం ఒకలా కని పించి చూసేవారిని అయోమయంలో పడేసింది. దానికి కారణం మేకప్ మీద దృష్టి పెట్టకపోవడమేనంటు న్నారు సినీ జనాలు. మొదటి భాగంలో ఆ విషయాన్ని మరిచిపోయిందనీ, రెండవ భాగంలో చాలా అందంగా కనిపించిందనీ అంటున్నారు. హీరో యిన్‌గా మంచి స్థాయికి వెళ్లాలంటే నటన ఒక్కటే సరిపోదనీ అందం మీద కూడా దృష్టి పెట్టాలనీ సలహా ఇస్తున్నారు.



•••

పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళేసరికి శ్రీకాంత్ వేరే కేస్ విచారణలో ఉన్నాడు. గద్దిస్తూ మాట్లాడుతున్నాడు తన ఎదురుగా ఉన్న ఇద్దరు టీనేజ్‌వాళ్లతో.

ఆ రూపం కొత్తగా అనిపించింది అక్షయ్‌కి.

అక్షయ్‌ని చూడగానే దగ్గరకొచ్చాడు.

"లెట్స్‌గో. నైరాకి మ్యాచ్ అయ్యే లక్షణాలున్న ఒక పాప దొరికింది. డ్రగ్ మాఫియాలో ఒకణ్ణి పట్టుకుంటే ఆ ఇంట్లో అపస్మారక స్థితిలో ఈ పాప కనబడింది. నైరా అవునో, కాదో గుర్తించాలి".

హాస్పిటల్‌కి చేరే లోపల కొద్దికొద్దిగా ప్రిపేర్ చేస్తూ వచ్చాడతను.

ఆ పాప అపస్మారక స్థితిలో లేదనీ, చనిపో యిందనీ అర్థమైంది అక్షయ్‌కి.

"నైరా కాకపోతే బాగుండును" మనసులో దేవుళ్ళందరినీ ప్రార్థించాడు.

మార్చురీ వైపుకి దారి తీశాడు శ్రీకాంత్.

అతన్ని చూడగానే వార్డ్‌బోయ్ లోపలికి దారి వదిలాడు.

శ్రీకాంత్, అక్షయ్ చివరగా ఉన్న స్ట్రెచర్ దగ్గ రికి వెళ్లారు. చేతులు వణుకుతుండగా మీద కప్పి ఉన్న దుప్పటిని జరిపాడు అక్షయ్.

తెల్లటి పాదాలు, దెబ్బలతో రక్తం గడ్డకట్టి కమిలి పోయిన కాళ్ళు...

విపరీతమైన హింసకి గురైందని ఆమె ఒంటి మీద ఉన్న గాయాలు చెప్తున్నాయి.

అక్షయ్‌కి రక్తం ఉడికిపోతోంది.

"పసిపిల్లలని ఇంత దారుణంగా హింసించ గల మనుషులుంటారా?" ఆక్రోశిస్తోందతని మనసు.

మొహం మీది దుప్పటిని పక్కకు జరిపాడు.

అంతే... రెండు చేతుల్లో మొహం కప్పుకుని కింద కూలబడిపోయాడు.

అక్కడే భళ్ళున వాంతి చేసుకున్నాడు.

**(ఇంకా వుంది)**




# టైనీటాట్స్ డాట్‌కామ్!

**'చైల్డ్‌పోర్నోగ్రఫీ కేసులో ప్రముఖ శాస్త్రవేత్త శంకర్ అరెస్టు' పేపర్‌లో వార్త చదివి చీదరించుకున్నాడు అసిస్టెంట్ రాము. ఆ వార్తలో శాస్త్రవేత్త చైల్డ్‌పోర్న్ చూస్తున్నాడన్న విషయానికే ప్రాధాన్యమిచ్చారు. వార్తా రచనలో శాస్త్రవేత్త నీచమైన చర్యపట్ల అసహ్యం కలిగించే కన్నా పాఠకులను రెచ్చగొట్టి, ఆసక్తి కలిగేలా రాశారు. డిటెక్టివ్ శరత్ వార్త చదువుతుండగా, సెక్రటరీ సుధ లోపలకు వచ్చింది.**

'బాస్... శాస్త్రవేత్త శంకర్ భార్య పార్వతి వచ్చింది అని చెప్పేలోపే, తలుపు తోసుకుని పార్వతి లోపలకు వచ్చి శరత్ ఎదురుగా కూర్చుంది. 'నా భర్త అమాయకుడు. అతడిపై ఎవరో నేరం మోపారు. మీరే నిరూపించాలి' నిశ్చయంగా అడిగింది.

●●●

చైల్డ్‌పోర్న్ చూడటం నేరం. పోర్న్‌బస్టర్స్ గ్యాంగ్ పేరుతో మా పోలీస్‌టీమ్ అలాంటివాళ్ళని కనిపెడుతుంది. శంకర్ కంప్యూటర్ క్రాష్ కావడంతో టెక్నీషియన్‌ని పిలిచాడు. అతను మా టీమ్ సభ్యుడే. పోర్న్ బస్టర్స్ గ్యాంగ్ అంటే, పోలీసులతో సంబంధంలేని సాఫ్ట్‌వేర్, హార్డ్‌వేర్ నిపుణుల టీమ్. శంకర్‌పైన కేసు బలంగా ఉంది' శరత్, రాము, కత్తిఉమేశ్‌లకు చెప్పాడు ఇన్‌స్పెక్టర్ విజయ్.

'తన భర్తకు సెక్స్‌మీద పెద్దగా ఆసక్తిలేదు, అప్పుడప్పుడు పోర్న్ చూస్తాడుతప్ప చైల్డ్‌పోర్న్ చూడటం అసంభవం, శంకర్ ధ్యాస ఎప్పుడూ పరిశోధనమీదే అంటోంది పార్వతి' చెప్పాడు శరత్.

'అవకాశం దొరికితే పోర్న్ చూసేవాళ్లెంతో మంది ఉన్నారు, ఇంటర్నెట్ ఇప్పుడు కల్పవృక్షంలా మారింది. సర్వర్‌ల నుంచి మేం వివరాలు సేకరిస్తాంకదా, మాకే ఈ విషయాలు ఎక్కువగా తెలుస్తాయి' చెప్పాడు విజయ్.

'నేను కాదనటంలేదుగానీ ఒకసారి శంకర్ కంప్యూటర్ చూస్తా' అన్నాడు శరత్. సరే, అన్నాడు విజయ్.

●●●

'శాస్త్రవేత్త శంకర్ కంప్యూటర్ చూసింది నేనే' చెప్పాడు డేనియల్.

'ఆ వివరాలు చెప్పండి' అడిగాడు శరత్.

'నేను వాళ్ల ఆఫీసు కంప్యూటర్స్ చూస్తుంటాను. అందుకే నన్ను పిలిచారు శంకర్. అతడు రెగ్యులర్‌గా చైల్డ్‌పోర్న్ చూడటమేకాదు, డౌన్‌లోడ్ చేస్తున్నాడని హార్డ్‌వేర్ చూస్తే తెలిసింది. 'ఇన్‌కాగ్నిటో మోడ్'లో చూస్తే ఎవరికీ తెలియదనుకున్నాడుగానీ సర్వర్‌కి తెలుస్తుంది. డౌన్‌లోడ్ చేసినప్పుడు వైరస్ వచ్చి కంప్యూటర్ క్రాషై ఉంటుంది. మేము కొన్ని చైల్డ్‌పోర్న్ సైట్లలో కంప్యూటర్‌ని 'క్రాష్' చేసే వైరస్ అమర్చాం'.

'ఈ సైట్లు అతడే చూశాడని ఏంటి గ్యారంటీ?' అడిగాడు శరత్.

'కంప్యూటర్ అతనిదే. పిల్లలు లేరు. భార్య కంప్యూ టర్ వాడదు. వాడేది ఆయనే, డౌన్‌లోడ్ చేసిన పోర్న్‌వీడియోలు హార్డ్‌డిస్క్‌లో దొరికాయి'

'వేరే ఎవరైనా అతడి కంప్యూటర్‌లో పోర్న్ వీడియోలు ఉంచే వీలుందా?' అడిగాడు శరత్.

'ఇంపాజిబుల్..'

'హ్యాక్‌చేస్తే?'

'హ్యాక్‌చేసి చైల్డ్‌పోర్న్ వీడియోలు ఉంచటం సంభవమే, కానీ అసంబద్ధం' చెప్పాడు డేనియల్.

●●●

బాస్...కేవలం నిపుణుడే ఈ పని చేయగలడు. కానీ హ్యాకింగ్‌కు గురైన కంప్యూటర్ తాలూకూ వ్యక్తికి నిరూపించుకునే వీలుండదు. ఇది చేయాలంటే కంప్యూటర్ పరిజ్ఞానంతో పాటు కసి కూడా ఉండాలి' చెప్పాడు కత్తి ఉమేశ్.

'ఇది హ్యాకర్ చేసిన పనే అనే విషయం కనుక్కోగలిగితే పని సులభం అవుతుంది, ప్రయత్నించు' అన్నాడు శరత్.

'అంత సులభం కాదు. మొత్తం హార్డ్‌డ్రైవ్‌లోనివన్నీ రిట్రీవ్ చేయాలి. అదృష్టం డేనియల్ ఫార్మాట్ చేయలేదు. ఫార్మాట్ చేస్తే ఇంకా కష్టపడాల్సి వచ్చేది' చెప్పాడు డేనియల్.

'నువ్వు ఆ పనిలో ఉండు' అన్నాడు శరత్ లేస్తూ.

●●●

'బాస్.. శంకర్‌కి నిశ్శబ్దం ఇష్టం. ఎవ్వరితో కలవడు. ఎటూ వెళ్లడు. స్నేహితులు, శత్రువులు ఉండే అవకాశం లేదు. ఆఫీసులో ల్యాబు, ఇల్లు తప్ప మరొకటి తెలియదు. అతడి భార్య అతడి బాగోగులు చూడకపోతే పళ్లు తోముకోవటం, డ్రస్సు వేసుకోవటం కూడా శంకర్ మరచిపోతాడు. ఎప్పుడూ పరిశోధనే. అతడి భార్య ఎంత ప్రయత్నించినా, నెలారెండునెల్లకు ఓసారి డ్యూటీలాగా వచ్చి కలుస్తాడటతప్ప అతనికి సెక్స్ ధ్యాస లేదని అతని భార్య చెప్పింది' సేకరించిన వివరాలు చెప్పాడు రాము.

'ఆఫీసులో విద్వేషాలు, పోటీలు...'

'ఏమీలేవు. జీతం ఎంత? ప్రమోషన్ ఎందుకు రాలేదు? లాంటివికూడా పట్టించుకోడు శంకర్. అందుకే అతడి పరిశోధనల ఆధారంగా ఇతరులు పైకి ఎదుగుతున్నారు. అతడేమీ పట్టించుకోడు. తననెవరూ మాట్లాడించకుండా పని చేసుకోనిస్తే చాలు అతడికి'.

కాస్సేపు ఆలోచిస్తూ కూర్చున్నాడు శరత్. చివరికి ఏదో నిశ్చయానికి వచ్చినట్టు లేచాడు.

●●●

'నేను పోర్న్ చూస్తాను' వణకుతున్న గొంతుతో చెప్పాడు శంకర్.

'మీకు సెక్స్ అంటే ఆసక్తి లేదని చెప్పారు?'

'నాకు పోర్న్ చూస్తేనే ఆలోచనలు వస్తాయి. పరిశోధనలో ఎక్కడైనా ఏదైనా అడ్డుపడ్డప్పుడు ఆలోచనకోసం రిలాక్సేషన్ కోసం చూస్తాను'.

'చైల్డ్‌పోర్న్ చూస్తారా?' పరిశీలనగా చూస్తూ అడిగాడు శరత్.

తల అడ్డంగా ఊపాడు శంకర్. చూడాలనీ లేదు. నేను సెక్స్‌లో డామినేట్ చేయలేను కాబట్టి, మగవాడు ఆడవాళ్లని డామినేట్ చేసే పోర్న్ నాకు సంతృప్తినిస్తుందనుకుంటాను. అదేచూస్తాను. ఇన్నిరోజులు ఒంటరిగా జైలులో ఉన్నప్పుడు నా గురించి నాకు అర్థమైనది ఇది. చైల్డ్‌పోర్న్ నేను చూడను' నిశ్చయంగా చెప్పాడు శంకర్.

'మీరెవరితోనూ మాట్లాడరు అంటారు. నిజమేనా?'

'నిజమే. నాకు మనుషులంటే భయం. ఎవరు, ఎప్పుడు మోసం చేస్తారో తెలియదు. అందుకని అందరికీ దూరంగా ఉంటాను'.

**శాస్త్రవేత్త శంకర్‌కి ఎప్పుడూ పరిశోధనల ధ్యాసే. భార్యను కూడా సరిగ్గా పట్టించుకోడు. కానీ కంప్యూటర్‌లో చైల్డ్‌పోర్న్ సైట్లు చూస్తూ ఉంటాడు. వాటిని చూడటం పెద్దనేరం. ప్రత్యేక సైబర్ పోలీసు బృందం ఈ విషయం కనిపెట్టి అతన్ని అరెస్టు చేసింది. కానీ అతడి భార్యమాత్రం నా భర్త అమాయకుడని వాదిస్తోంది. సాక్ష్యాలు కళ్లెదుట కనిపిస్తున్నాయి. ఐనాగానీ డిటెక్టివ్ శరత్ కేసు టేకప్‌చేశాడు. సైంటిస్టు అమాయకుడని శరత్ నిరూపించగలడా?**

'జాగ్రత్తగా ఆలోచించి చెప్పండి. ఇటీవలి కాలంలో మీరు మామూలుగా ఓపెన్‌చేసే సైట్లు కాక వేరేసైట్లు ఓపెన్ చేశారా? రీ డైరెక్ట్ సైట్లల్లో ఏవైనా క్లిక్ చేశారా?' అడిగాడు శరత్.

నెట్‌లో వెబ్‌పేజీల్లో ఒక పేజీకోసం తెరిస్తే, అది మరో పేజీ తెరుస్తుంది. దీన్ని 'రీ డైరెక్ట్' అంటారు. వెబ్ పేజీలు ఒకచోటనుంచి మరోచోటికి మారినపుడు ఒకే వెబ్‌సైట్‌కు పలు డొమైన్‌పేర్లు ఉన్నపుడు, వెబ్‌సైట్‌లోకి వెళ్ళటానికీ, బైటకు రావటానికీ ఉపయోగిస్తూ, ప్రైవసీ రక్షణకోసం కంప్యూటర్‌ను ఉపయోగించేవారి సమాచారం సేకరించటంకోసం 'రీ డైరెక్ట్' వాడతారు. అందుకే, ఒకోసారి కొన్నిసైట్లు తెరచిన తరువాత సెల్‌ఫోన్‌కు ఈ-మెయిల్ మెసేజ్‌లు వస్తుంటాయి. ఇందు వల్లనే.

శరత్.

'ఇతడు ఎవరితోనూ మాట్లాడడంటే నమ్మబుద్ధి కావటంలేదు. బడబడ వాగుతూనే ఉన్నాడు' శరత్ వస్తుంటే విజయ్ అన్నాడు.

'ఏదైనా షాక్ తగిలి, ఇలా ఒంటరిగా తప్పని సరిగా ఉండాల్సి వస్తే, ఇలాగే ప్రవర్తిస్తారు' అన్నాడు శరత్ నవ్వుతూ.

●●●

'బాస్... ఇతడు చూసేవన్నీ బలిష్టమైన మగవాళ్లు, సన్నగా బలహీనంగా ఉండే అమ్మాయిలు. గ్రూప్‌సెక్స్ కూడా చూస్తాడు' చెప్పాడు మహేశ్.

'అతడు ఏమి చూస్తాడో అనవసరం. అతడు చూసిన సైట్లలో అతడి వివరాలు సేకరించే సైటు గురించి చెప్పు' అడిగాడు శరత్.

'చెప్తాను బాస్.. ప్రతి సైటుకీ నెట్ చూసే



వ్యక్తి వివరాలు సేకరించే పద్ధతి ఉంటుంది. కుకీలుంటాయి.' మాటలు ఆపేశాడు ఉమేశ్.

సైటు ఒక ట్రాప్‌లాంటిది. హెచ్చరికలాంటిది. ఈ సైటు ఎవరైనా తెరిస్తే ఎక్కడో ప్రమాదఘంటికలు మోగుతాయి. వాళ్ళు వెంటనే ఎవరు సైటు చూశారో తెలుసుకుని వైరస్ పంపుతారు. దాంతో పాటు పోర్న్ పంపుతారు. ఎందుకనో తమగురించి ఎవరూ తెలుసుకోకూడదని జాగ్రత్తలు తీసుకుంటున్నారు' గబగబా చెప్పాడు ఉమేశ్.

టైనీటాట్స్ డాట్‌కామ్ అనుకున్నాడు శరత్.

●●●

'మేము ఎన్నో సైట్లను హోస్ట్ చేస్తాం. ఇదీ అందులో ఒకటి. క్లయింట్లు ఇల్లీగల్ కంటెంట్ అప్‌లోడ్ చేసినట్టు ఫిర్యాదువస్తే మాత్రం వెంటనే వాళ్లతో ఒప్పందం రద్దు చేసుకుంటాం' చెప్పాడు వెబ్ హోస్టింగ్ కంపెనీ నడిపే కరుణాకర్.

'మీ టెక్నికల్ హెడ్స్‌ని మేము కలవచ్చా?' అడిగాడు విజయ్.

ఆయన ఫోన్ చేసి అందరినీ పిలిచాడు.

నలుగురు యువకులు గదిలోకి వచ్చారు.

'ఫిలిప్స్ రాలేదే ?' అడిగాడు కరుణాకర్.

'ఒంట్లో బాగాలేదని వెళ్ళిపోయాడు'

'ఇందాక బాగానే ఉన్నాడే?'

'జస్ట్ పది నిమిషాలక్రితమే, వీళ్ళు మీదగ్గరకు వచ్చినపుడు వెళ్లిపోయాడు'.

'అతడి వివరాలివ్వండి' ఒకేసారి అడిగారు శరత్, విజయ్.

●●●

'చైల్డ్‌పోర్న్‌తో పాటు పలు అభ్యంతరకరమైన లైంగికచర్యల వీడియోలను దేశ విదేశాల్లో నిషేధించారు. వాటిని చూడటం కూడా నేరమే. నిషేధించిన ఆ వీడియోలను అక్రమంగా అందించే వెబ్‌సైట్ నడుపుతున్నాడు ఫిలిప్స్. దానికి గేట్‌వే లాంటిది టైనీటాట్స్ డాట్‌కామ్ సైటు. సభ్యత్వం లేని వారెవరైనా ఆ సైటుమీద క్లిక్ చేసినా వెంటనే ట్రేస్‌చేసి వారి కంప్యూటర్‌ని క్రాష్ చేస్తాడు ఫిలిప్స్. ఆ కంప్యూటర్లలో నిషేధిత పోర్న్ పెట్టి నేరం వారిపై నెట్టేసి తన వ్యాపారం కాపాడుకుంటూ ఉంటాడు ఫిలిప్స్. దురదృష్టవశాత్తు శంకర్ ఈ సైటుపై క్లిక్ చేశాడు. అయితే ఉమేశ్ కంప్యూటర్‌ని క్రాష్‌చేసిన తరువాత వివరాలు చూశాడు. నా పేరు తెలియగానే ఆటకట్టిందని కంగారు పడ్డాడు. పైగా పొద్దున్నే మమ్మల్ని ఆఫీసులో చూసి బెదిరాడు. పారిపోవాలనుకున్నాడు. కానీ పట్టుబడ్డాడు' నేరం జరిగిన విధానం వివరించాడు శరత్.

శంకర్ ఆలోచించాడు.

'నేను ఎప్పుడూ చూసే సైట్లు కాక వారం క్రితం ఓ సైటు ఓపెన్ చేశాను. అక్కడి వీడియో ఆసక్తిగా అనిపించింది. అయితే ఆ వీడియో ఎంత నొక్కినా వేరే సైటు తెరచుకుంది కానీ వీడియో రాలేదు. పలుమార్లు ప్రయత్నించాను. ఓసారి అనుకోకుండా ఆ సైటులో వీడియో క్లిక్ చేశాను. కానీ అది తెరచుకోకముందే డిలీట్ చేశాను' చెప్పాడు శంకర్.

'ఇది పోలీసులకు చెప్పారా?'

'వాళ్ళు నన్ను నేరస్థుడినని నమ్మి అలాగే ప్రశ్నించారు. నాకు వేరేమాట చెప్పే వీలివ్వలేదు' అతను సాధారణంగా చూసే సైట్లు, ఆ రోజు చూడాలనుకున్న వీడియోల వివరాలు రాసుకున్నాడు

అతడిముఖం సీరియస్‌గా అయింది.

కాస్సేపటికి 'బాస్' అంటూ తలపట్టుకున్నాడు ఉమేశ్.

'యెస్' అంటూ దగ్గరకు వచ్చాడు శరత్.

'బాస్.. 'టైనీటాట్స్ డాట్‌కామ్' ప్రమాదకరమైన సైటు' అన్నాడు మెల్లిగా.

●●●

'నువ్వు అడిగిన వివరాలు ఇదిగో బాస్... 'టైనీటాట్స్ డాట్‌కామ్' సైటు ఒక డెడ్‌ఎండ్ లాంటిది. దీని వెబ్‌హోస్టింగ్ చేసే సర్వర్ కంపెనీని తెలుసుకున్నాను. ఆ కంపెనీ వెబ్‌సైట్ల డిజైనింగ్, రిజిస్ట్రేషన్, మెయిన్‌టెన్స్ చేస్తుంది. ఈ

**-కస్తూరి మురళీకృష్ణ,**
**సెల్: 98496 17392**

# సౌభాగ్య చక్రం

జనవరి 25 నుంచి
జనవరి 31 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



### మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

ప్రముఖులతో సమావేశాలు, పెట్టుబడులు, ఆర్థిక సంస్థలతో లావాదేవీలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో ఆర్థిక విషయాల్లో పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. వృత్తిపరమైన సమావేశాల్లో జాగ్రత్త అవసరం. 28, 29 తేదీల్లో పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. సమావేశాల్లో తొందరపాటు వల్ల నష్టపోయే అవకాశం ఉంది. బృందకార్యక్రమాల్లో పాల్గొంటారు. 30, 31 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. సినీ రాజకీయాలు, ఉన్నత విద్యా రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. సన్నిహితులకు సంబంధించి కీలక నిర్ణయం తీసుకుంటారు.



### వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, సమావేశాలు, ప్రముఖుల కలయిక, బృందకార్యక్రమాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో వృత్తిపరమైన అంచనాలు ఫలించకపోవచ్చు. పెద్దలతో చర్చల్లో నిదానం అవసరం. రాజకీయ, సినీ రంగాల వారు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. 28, 29 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ఆచితూచి వ్యవహరించాలి. పైఅధికారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. ఉన్నత పదవుల కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. 30, 31 తేదీల్లో సమావేశాల్లో ప్రముఖులను కలుసుకుంటారు. వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరం. వృత్తిపరమైన సమావేశాల్లో నిదానం పాటించండి.



### మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, వేడుకలు, ఉత్సవాలు, వృత్తిపరమైన సమావేశాలు, ప్రయాణాలకు ఈ వారం అనుకూలం. బుధ, గురు, శుక్రవారాల్లో రుణ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక విషయాల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. ఖర్చులు అధికం. 28, 29 తేదీల్లో సమావేశాలు, చర్చల్లో అసౌకర్యం కలిగే అవకాశం ఉంది. సంకల్ప సాధనలో శ్రమాధిక్యం తప్పకపోవచ్చు. వేడుకల్లో పాల్గొంటారు. 30, 31 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో వ్యూహాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. సమావేశాల్లో ప్రముఖులను కలుసుకుంటారు. పైఅధికారుల వైఖరి నిరుత్సాహకరంగా ఉంటుంది.



### కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

భాగస్వామ్యాలు, స్పెక్యులేషన్లు, క్రయవిక్రయాలు, వేడుకలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. స్పెక్యులేషన్లలో అంచనాలు తప్పే అవకాశం ఉంది. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. 28, 29 తేదీల్లో రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. సంస్మరణల్లో పాల్గొంటారు. క్రయవిక్రయాలకు అనుకూలం. 30, 31 తేదీల్లో సమావేశాలు, వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. బృందకార్యక్రమాల్లో గతస్మృతులు నెమరు వేసుకుంటారు. పెట్టుబడులకు సంబంధించిన సమాచారం సేకరిస్తారు. ఖర్చులు అంచనాలు మించుతాయి.



### సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

వేడుకలు, భాగస్వామ్యాలు, పెట్టుబడులు, స్పెక్యులేషన్లు, సమావేశాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో విందు వినోదాల్లో పాల్గొంటారు. సన్నిహితుల ఆరోగ్యం కలవరపెడుతుంది. కృషి రంగంలో శ్రమాధిక్యం తప్పకపోవచ్చు. 28, 29 తేదీల్లో శ్రీవారు, శ్రీమతి వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. పందాలు, పోటీలకు దూరంగా ఉండాలి. వేడుకలు, సమావేశాలు ఉల్లాసం కలిగిస్తాయి. 30, 31 తేదీల్లో పెట్టుబడులు లాభిస్తాయి. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. ఆర్థిక విషయాల్లో సన్నిహితుల సహకారం లభిస్తుంది. ఖర్చులు అంచనాలు మించే అవకాశం ఉంది.



### కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

విద్యా విషయాలు, వృత్తి, వ్యాపారాలు, ఆరోగ్యం, వేడుకలు, విందువినోదాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురు, శుక్రవారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి కృషి రంగంలో లక్ష్యాలు సాధిస్తారు. చిన్నారులు, ప్రియతముల ఆరోగ్యం కలవరం కలిగిస్తుంది. విందుల్లో పాల్గొంటారు. 28, 29 తేదీల్లో ఆరోగ్యంపట్ల శ్రద్ధ చూపించాలి. వృత్తి, వ్యాపారాల్లో లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. విందులు వేడుకల్లో పాల్గొంటారు. 30, 31 తేదీల్లో భాగస్వామి సహకారంతో వృత్తి వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. జనసంబంధాలు విస్తరిస్తాయి. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు.



### తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

పొదుపు పథకాలు, విద్యా విషయాలు, వృత్తి, వ్యాపారాలు, వివాహాది శుభకార్యాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణరంగాల వారికి శుభప్రదం. కుటుంబ సభ్యుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. మార్పులు, చేర్పులు అసౌకర్యం కలిగిస్తాయి. 28, 29 తేదీల్లో చిన్నారులు, ప్రియతముల విషయాలు ఆందోళన కలిగిస్తాయి. పొదుపు పథకాల్లో ఆచితూచి వ్యవహరించాలి. ప్రేమానుబంధాలు బలపడతాయి. 30, 31 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. కొత్త పరిచయాలు ఉల్లాసం కలిగిస్తాయి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి.



### వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

విద్యా విషయాలు, స్థలమార్పులు, కుటుంబ వ్యవహారాలు, వృత్తి వ్యవహారాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురు, శుక్రవారాల్లో కాంట్రాక్టులు, అగ్రిమెంట్లకు అనుకూలం. స్టేషనరీ, ఏజెన్సీ, విద్యారంగాల వారు జాగ్రత్తగా వ్యవహరించాలి. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. 28, 29 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారు ఆచితూచి వ్యవహరించాలి. ఇల్లు, స్థలం మార్పిడి, బదిలీలకు అనుకూల సమయం. 30, 31 తేదీల్లో చిన్నారులు, ప్రియతముల రాకతో ఇల్లు సందడిగా ఉంటుంది. వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. ఆర్థిక విషయాల్లో ఒక నిర్ణయానికి వస్తారు. .



### ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, విద్యా విషయాలు, కుటుంబ వ్యవహారాలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో డిపాజిట్లపై మంచి ప్రతిఫలం అందుకుంటారు. ఆర్థిక వ్యవహారాల్లో ఆచితూచి వ్యవహరించాలి. కీలకపత్రాలు సకాలంలో కనిపించక ఇబ్బంది పడతారు. 28, 29 తేదీల్లో చర్చలు, ప్రయాణాల్లో నిదానం పాటించాలి. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లకు తగిన సమయం కాదు. ఒక సమాచారం ఆవేదన మిగులుస్తుంది. 30, 31 తేదీల్లో కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు లాభిస్తాయి. ఇంటికి అవసరమైన వస్తువుల రవాణాకు అనుకూలం.



### మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

ఆర్థికపరమైన నిర్ణయాలు, బ్యాంకు లావాదేవీలు, చర్చలు, బిల్లుల చెల్లింపులకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురు, శుక్రవారాల్లో అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక విషయాల్లో తొందరపాటు నిర్ణయాల వల్ల నష్టపోయే అవకాశం ఉంది. 28, 29 తేదీల్లో పెట్టుబడులు, పొదుపు పథకాల్లో నిదానం అవసరం. ఖర్చులు అంచనాలు మించుతాయి. విలువైన వస్తువుల గురించి ఆరాతీస్తారు. 30, 31 తేదీల్లో ఆర్థిక విషయాల్లో సన్నిహితుల సహకారం లభిస్తుంది. విలువైన పత్రాలు అందుకుంటారు.ఫీజులు, బిల్లుల చెల్లింపులకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి.



### కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలు, కీలక నిర్ణయాలు, పెట్టుబడులపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధ, గురు, శుక్రవారాల్లో సినీ, రాజకీయ రంగాల వారికి ప్రోత్సాహకరం. మనసు అశాంతిగా ఉంటుంది. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు సంబంధించిన అంశాలు కలవరపెడతాయి. 28, 29 తేదీల్లో కొత్త వ్యూహాలు రచిస్తారు. కీలక నిర్ణయాలు వాయిదా వేయండి. మీ ఆలోచనలు సమీక్షించుకుంటారు. 30, 31 తేదీల్లో పెట్టుబడులు, పొదుపు పథకాలు లాభిస్తాయి. కొత్త ఆదాయమార్గాల అన్వేషణ ఫలిస్తుంది. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. పెట్టుబడుల్లో తొందరపాటు తగదు.



### మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

సమావేశాలు, వేడుకలు, ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలు, పెట్టుబడులకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురు, శుక్రవారాల్లో బృంద కార్యక్రమాలు ఉల్లాసం కలిగిస్తాయి. బ్యాంకులు, ఆర్థిక సంస్థలతో పనులకు ఆటంకాలు ఎదురవుతాయి. పెట్టుబడుల్లో నిదానం అవసరం. 28, 29 తేదీల్లో విద్య, దూరప్రయాణాలకు ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. సినీ, రాజకీయ రంగాల వారు ఆచితూచి వ్యవహరించాలి. బంధుమిత్రులతో వేడుకల్లో పాల్గొంటారు. 30, 31 తేదీల్లో బోధన, న్యాయ, పరిశోధన, శాస్త్ర, సాంకేతిక రంగాల వారికి శుభప్రదం. ఒక సందేశం ఆనందం కలిగిస్తుంది. నవ్య

## నవ్య సినిమా

## భయపడుతున్న మాధురీదీక్షిత్

ఒకప్పుడు బాలీవుడ్‌ను ఏలిన అందాల తార మాధురీదీక్షిత్. ఎంతో మంది అభిమానుల ఆరాధ్య దేవత. అలాంటి నటికి భయమా? అన్న అనుమానం వస్తోంది కదా! నిజమే. కాకపోతే మాధురి భయపడుతోంది ఓ సినిమా విషయంలో. అసలు సంగతేమిటంటే.... బాలీవుడ్‌లో సంజయ్‌దత్ బయోపిక్ తీస్తున్నారు. ఇంత వరకూ బాగానే ఉంది. కానీ గతంలో సంజయ్‌దత్, మాధురీల రిలేషన్‌షిప్ మీద బోలెడన్ని కహానీలు వినిపించాయి. ఇప్పుడు వాటన్నింటిని తెర మీద చూపిస్తే తన ఫ్యామిలీ లైఫ్ డిస్టర్బ్ అవుతుందని మాధురీ భయపడుతోందట! ఈ మేరకు సంజయ్‌కు తమ మధ్య జరిగిన విషయాలను తెరకెక్కించకుండా చూడమని రిక్వెస్ట్ చేసిందట! ఎంతైనా తెరవెనుక జరిగిన దాన్ని తెరమీద చూపిస్తే ఇబ్బందే కదా? అని చాలామంది ఆమె మీద సానుభూతి చూపిస్తున్నారట!



## రాజుగారి లెక్క తప్పలేదు

రెండు పెద్ద సినిమాల మధ్య 'శతమానం భవతి' వస్తుంటే... ఈ సినిమా వాటి మధ్య నిలబడగలదా? అన్న అనుమానాన్ని చాలా మంది వ్యక్తం చేశారు. కానీ సినిమా మీద ఉన్న నమ్మకంతో నిర్మాత దిల్ రాజు ధైర్యంగా ఆ సినిమా విడుదల చేశారు. ఆయన నమ్మకం, లెక్కా తప్ప లేదు అంటున్నారు టాలీవుడ్ జనాలు. సంక్రాంతికి కుటుంబ కథా చిత్రాలను ప్రేక్షకులు తప్పకుండా ఆదరిస్తారన్న రాజుగారి నమ్మకం వమ్ముకాలేదు. మేకింగ్ ఖర్చులు, ప్రకటన ఖర్చులు కూడా వచ్చేసి సినిమా లాభాల బాట పట్టిందని అంటున్నారు. సినిమాల విడుదల, నిర్మాణ రంగంలో దిల్‌రాజు లెక్క ఎప్పుడూ తప్పలేదు అన్న విషయం మరోసారి రుజువైందంటున్నారు.





## టుస్సాడ్స్ మ్యూజియంలో బాహుబలి

ఈ వార్త నిజమే! మేడమ్ టుస్సాడ్స్ మ్యూజియంలో 'బాహుబలి' విగ్రహం ఏర్పాటు చేయబోతున్నారు. ఇంత వరకూ స్టార్ హీరోలుగా నీరాజనాలు అందుకుంటున్న దక్షిణాది నటీనటులకు ఎవరికీ దక్కని గౌరవం ప్రభాస్‌కు దక్కబోతోంది. ఎంతోమంది ప్రముఖుల చెంతన 'బాహుబలి' నిలవబోతున్నాడన్న వార్తను జక్కన్న అధికారికంగా ప్రకటించారు. ప్రభాస్ ఈ సినిమా కోసం నాలుగు సంవత్సరాల కాల్‌షీట్లు వృథా చేసుకున్నాడనీ, ఈ గ్యాప్‌లో డబ్బుతో పాటు స్టార్ హీరో స్టేటస్‌ను వదులుకున్నాడనీ ఇలా రకరకాల కామెంట్లు ప్రభాస్ మీద వినిపించాయి. ఎవరేమనుకున్నా నా కెరీర్ 'బాహుబలి'కే అంకితం అన్న స్థాయిలో ఆ సినిమా చేశాడు ప్రభాస్. ఇది దక్షిణాది సినీ పరిశ్రమకు దక్కిన గౌరవం అంటూ సినీజనాలు ఆనందం వ్యక్తం చేస్తున్నారు. మైనపు బొమ్మ కోసం 'బాహుబలి' కాస్ట్యూమ్స్ ప్రభాస్ ఫోటోలు దాదాపు 350 ఏంగిల్స్‌లో తీసుకున్నారట! త్వరలోనే మైనపు బొమ్మ ఏర్పాటు చేస్తారని చెబుతున్నారు. ఇది అమరేంద్ర బాహుబలికి దక్కిన అపురూప గౌరవంగా టాలీవుడ్ జనాలు అభివర్ణిస్తున్నారు.

## కుర్ర భామలకే ఓటు!

బాలీవుడ్, టాలీవుడ్, కోలీవుడ్ ఇలా ఏ బాషకు చెందిన సినిమాలు తీసుకున్నా హీరోకి 60 సంవత్సరాలు వచ్చినా కుర్ర వేషాలు వేస్తుంటారు. అదే హీరోయిన్లయితే 30 పైబడితే పక్కన పెట్టేస్తారు. ఇది అందరికీ తెలిసిన విషయమే! ఇలా ఎందుకు జరుగుతుంది? అన్నదానికి బాలీవుడ్ బాద్‌షా అద్భుతమైన నిర్వచనం ఇచ్చాడు. హీరోయిన్లు ఎంత అందంగా ఉన్నా, అద్భుతమైన నటన ప్రదర్శించినా, కొన్ని రోజులకి వారి అందాలు ప్రేక్షకులకు బోర్ కొట్టేస్తాయట! దాంతో కొత్త వారికే ప్రేక్షకులు ఓటు వేస్తారట! అందం అనేది హీరోయిన్లలోనే చూస్తారు తప్ప హీరోలలో చూడరు కనుక హీరోలకు వయస్సు వచ్చినా నష్టం లేదు. హీరోయిన్లకే ఆ బాధంతా అంటూ వారి పట్ల తన సానుభూతి ప్రకటించాడు. అసలు కొంత మంది హీరోయిన్లు లేకపోతే తను ఈనాడు ఈ స్టేజీలో ఉండేవాడిని కానని కూడా చెప్పుకొచ్చాడు. మాధురీ, జుహీచావ్లా వంటి వారి వలనే తన సినిమాలు సూపర్ డూపర్ హిట్లుగా నిలిచినా, ఇప్పటివారితో నటిస్తే ప్రేక్షకులు చూడరు అని స్పష్టం చేస్తున్నాడు.





## పదహారేళ్లుగా చంపుకోవాలనుకుంటున్నారట!

ఇది ఓ భార్యాభర్తల ముచ్చట! దీని గురించి భార్యగారే స్వయంగా ట్వీట్ చేశారు. ఇంతకీ ఆ భార్యాభర్త ఎవరా? అన్న అనుమానం వస్తోందా? ఇంకెవరు..? అక్షయ్‌కుమార్, ట్వింకిల్ ఖన్నా. వీరిద్దరికీ పెళ్ళి అయి పదహారు సంవత్సరాలు అయిందట! అప్పటి నుంచి ఒకరినొకరు చంపుకోవాలని ప్రయత్నిస్తున్నా వీలుపడడం లేదట! ట్వింకిల్ సరదాగా చేసిన ఈ ట్వీట్ మీద ఇప్పటికే బోలెడన్ని అనుమానాలు వ్యక్తం అవుతున్నాయి. వీరిద్దరికీ పడడం లేదనీ, ట్వింకిల్ అందుకే ఇలా ట్వీట్ చేసిందని అంటున్నారు. నిప్పు లేకుండా పొగ రావడం అంటే ఇదే అంటున్నారు బాలీవుడ్ జనాలు.

# ఆ వ్యక్తిని ప్రేమిస్తున్నాను

## -అమలాపాల్



**మూడు సంవత్సరాల ప్రేమ, మూడు ముళ్లు, ఏడడుగుల బంధంతో ముడిపడి రెండు సంవత్సరాలు గడవకుండానే ఆ పెళ్లి పెటాకులైపోయింది. వైవాహిక జీవితాన్నీ, అటు కెరీర్‌నూ ఆనందంగా ఆస్వాదిస్తున్న సమయంలో భర్తా, కెరీరా? ఏది ముఖ్యం అన్న క్లిష్టమైన పరిస్థితి ఎదుర్కోవలసి వచ్చింది. సమస్య క్లిష్టమైనదే అయినా విడాకులు అనే ఒకే ఒక్క మాటతో వైవాహిక జీవితాన్ని వదులుకుంది. భర్త కన్నా కెరీరే ముఖ్యం అనుకుని విడాకులు పొందింది. ఇంతకీ ఆ హీరోయిన్ ఎవరో గుర్తు పట్టే ఉంటారు. ఇంకెవరు? మాలీవుడ్ దీపికా పదుకొనెగా పిలిపించుకునే అమలాపాల్. కొన్ని నెలల క్రితం వరకూ భర్తను గాఢంగా ప్రేమించాను... ఇప్పుడు సినిమాను ప్రేమిస్తున్నాను అంటున్న అమలా పాల్‌తో..**

**విడాకుల దాకా ఎందుకు వెళ్లాల్సి వచ్చింది?**

పెళ్ళి అనేది జీవితంలో ముఖ్యమైనదే కానీ అదే జీవితమని నేను అనుకోను. ఎవరైనా కలకాలం కలిసి ఉండాలనే వివాహం చేసుకుంటారు. విడాకులు కోరుకోరు. కానీ నా జీవితంలో అంతా ఓ కలలాగా జరిగిపోయింది. వైవాహిక జీవితంలో సంతోషం కరవైనప్పుడు కలిసి ఉండడంలో అర్థం లేదు. ఆ రెండు సంవత్సరాలు నాకొక గుణపాఠం. పెళ్ళికి ముందు అనుకున్నది ఒకటి, ఆ తరువాత జరిగింది ఒకటి. దాన్ని జీర్ణించుకోలేపోయాను. కలిసి ఉండి కష్టపడడం కంటే విడిపోయి సంతోషంగా ఉండడం మంచిదని నిర్ణయించుకున్నాను. అసలు విజయ్ మీద నాకు కోపం లేదు. ఇప్పటికీ అతడంటే నాకు అభిమానమే! వ్యక్తిగా ఇష్టపడతాను. ప్రేమిస్తున్నాను.

**ప్రేమించిన వ్యక్తి దూరం అవుతుంటే బాధ అనిపించలేదా?**

చెప్పానుగా, పరిస్థితులు అలా వచ్చాయి. కలిసి ఉంటేనే ఎక్కువ బాధ పడేదాన్నేమో! విడిపోయి సంతోషంగా ఉన్నా. నా నిర్ణయానికి నా బ్రదర్ అండగా నిలిచాడు. తన సపోర్ట్ జీవితాంతం మరచిపోలేను.

**ఆ ఒత్తిడిని ఎలా తట్టుకున్నారు?**

మెడిటేషన్, యోగా బాగా ఉపయోగపడ్డాయి. ఇప్పుడు అవి చేయకుండా ఉండలేను. అవి చేస్తే మానసిక ప్రశాంతత కలుగుతుంది అని అందరూ అంటూంటారు. అది అనుభవపూర్వకంగా తెలుసుకున్నాను. ఆ భగవంతుడు నా జీవితంలో ఒక డోర్ క్లోజ్ చేసి మరో డోర్ ఓపెన్ చేశాడు. నా జీవితంలో ఏది జరిగినా నా మంచికే అనుకోవడం అలవాటు చేసుకున్నాను. చాలా ప్రశాంతంగా అనిపిస్తోంది.

**కెరీర్ ఎలా ఉంది?**

పెళ్ళయ్యాక నటించాను. ఇప్పుడూ నటిస్తున్నాను. విడాకులు నా కెరీర్ మీద ఎలాంటి ప్రభావం చూపలేదు. అవకాశాలు వస్తూనే ఉన్నాయి. మునుపటికన్నా హ్యాపీగా ఉన్నాను. పెళ్లయ్యాక కొన్ని పరిమితులు ఉండేవి. ఇప్పుడు అలాంటివి లేవు. నేను ఫ్రీబర్డ్‌ని.

**పాటలు పాడుతున్నారట?**

పాటలు కాదు. ఒక్క పాట పాడుతున్నాను. అదీ మలయాళీ సినిమాలో. సింగింగ్ వైపు వెళ్లే ఆలోచన లేదు. దర్శకత్వం చేయాలని ఉంది. అదీ భవిష్యత్తులో, ఇప్పుడప్పుడే కాదు. చిన్న చిన్న కథలు కూడా రాస్తున్నాను. ఇవన్నీ నాకోసం మాత్రమే!

**మీ డ్రెస్ సెన్స్ మీద వస్తున్న విమర్శలకు సమాధానం?**

ఒకప్పుడు నన్ను ఫ్యాషన్ ఐకాన్ అన్నారు. ఇప్పుడేమో విమర్శిస్తున్నారు. అసలు ఎలాంటి డ్రెస్సులు వేసుకోవాలి? అన్నది నా ఇష్టం. విడాకులు తీసుకున్న తరువాత అమల హాట్ హాట్ డ్రస్సులు వేస్తోంది అన్న విమర్శలు నా దాకా వచ్చాయి. విడాకులు తీసుకున్నంత మాత్రాన మోడ్రన్‌గా ఉండకూడదా? నా బాడీకి సరిపోయే డ్రెస్‌లు వేసుకుంటాను. దానికి విమర్శలు చేయడం ఎందుకు? నేను ఇలా కాకుండా మరోలా ఉంటే విడాకులు తీసుకుని బాధపడుతోంది అంటారు. ఎప్పుడూ ఏదో ఒక విమర్శలు

**నైపుణ్యం ఉన్నవాళ్ళు పంజరంలో చిలకలాగా ఆంక్షల మధ్య బతకలేరు. తమ నైపుణ్యం ఋజువుచేసుకోవాలని కోరుకుంటారు. పదిమందీ మెచ్చాలని కాంక్షిస్తారు. అలాంటివాళ్ళకి కొన్ని లక్ష్యాలు ఉంటాయి. అమలాపాల్ కూడా అంతే. ఆమె ఇప్పుడు ఫ్రీ బర్డ్. అంతా మన మంచికే అనుకునే మనస్తత్వం. అమలాపాల్‌లో కేవలం నటి మాత్రమే లేదు, ఆమెకింకా చాలా ఆలోచనలున్నాయి.**



చేసేవారిని పట్టించుకునే అవసరం లేదు.

**కోలీవుడ్ మిమ్మల్ని బహిష్కరించింది అన్నారు నిజమేనా?**

అది అబద్ధం అని చెప్పడానికే అక్కడ రెండు సినిమాలు చేస్తున్నాను. ఎవరైనా ఒకర్ని లేదా ఇద్దరినీ ఇన్‌ఫ్లుయన్స్ చేయగలరు కానీ, పరిశ్రమ మొత్తాన్ని శాసించలేరు కదా! నాకు అవకాశాలు ఇవ్వొద్దు అని చెబితే సరిపోతుందా? అందరూ వింటారా? వినరు. అలా విననివారే నాకు అవకాశాలు ఇస్తున్నారు. నన్ను కంట్రోల్ చేద్దామనుకున్నారు కానీ అది వారివల్ల కాదని తేలిపోయిందిగా? ఈ సంవత్సరం కోలీవుడ్‌లో రెండు సినిమాలు విడుదల కాబోతున్నాయి. కన్నడంలో కూడా ఓ సినిమా విడుదల కాబోతోంది.

**టాలీవుడ్, మాలీవుడ్‌లలో చేయడం లేదా?**

మాలీవుడ్‌లో ఓ సినిమా ఒప్పుకున్నాను. టాలీవుడ్‌లో ఇంతవరకూ ఒప్పుకోలేదు. చేసే అవకాశం ఉంది.

**గ్లామర్ పాత్రలకే పరిమితమైనట్టున్నారు?**

లేదు. నేను తెలుగులో చేసినవి గ్లామర్ పాత్రలు మాత్రమే. మిగతా భాషలలో మంచి నటనకు అవకాశం ఉన్న పాత్రలు చేశాను. నా నటనకు అక్కడ అవార్డులు కూడా వచ్చాయి. సినిమాకు గ్లామరు అవసరమే కానీ, అదే ముఖ్యం కాదు. ఒక సినిమా చేసేటప్పుడే నా పాత్ర గురించి ఒకటికి రెండుసార్లు ఆలోచిస్తాను.

**ఊహించని పరిణామాలు?**

అవి నా జీవితంలో చాలానే జరిగాయి. చిన్న వయస్సులోనే ఎన్నో అనుభవించాను. ఎన్నో ఎదురు దెబ్బలు. అన్నీ తట్టుకుని నిలబడ్డాను. ఈ రోజు ఇలా ఉన్నాను అంటే అది నా ఫ్యామిలీ, అభిమానుల సపోర్టుతోనే!

**మరిచిపోలేని అనుభూతి...**

నాకు జీవితంలో మరిచిపోలేని అనుభూతి మిగిల్చింది హిమాలయాల ట్రిప్పు. గత ఏడాది అక్కడికి వెళ్ళాను. అక్కడికి వెడతానని ఎప్పుడూ అనుకోలేదు. అనుకోకుండా వెళ్ళినా ఆ ప్రయాణం ఎప్పటికీ మరిచిపోలేను. అక్కడికి వెళ్ళే దారిలో ఎన్నో ఎత్తుపల్లాలు... అవన్నీ నా జీవితం లాగే అనిపించాయి. వాస్తవానికి నాకు కొత్త కొత్త ప్రదేశాలు చూడాలంటే చాలా ఇష్టం. సినిమాల ద్వారా ఆ ఇష్టం తీరింది. ఇప్పటికే షూటింగ్‌ల సందర్భంగా ఎన్నో ప్రదేశాలకు వెళ్లాను. గత ఏడాదితో పోల్చుకుంటే ఈ సంవత్సరం ఇంకా ఎక్కువ కొత్త ప్రదేశాలకు వెళ్లబోతున్నాను.



**పుకార్ల గురించి...**

నా మీద వచ్చినన్ని పుకార్లు బహుశా ఎవరి మీదా వచ్చి ఉండవు. పెళ్ళి దగ్గర్నుంచి విడాకుల వరకూ అందరూ నాదే తప్పు అన్న పుకార్లు పుట్టించారు. ఒక్కరి తప్పు ఉంటే విడాకులు అవుతాయా? ఇలాంటి విషయాలలో ఎంత సేపూ ఆడవాళ్లనే నిందిస్తారు కానీ మగవాళ్లని ఏమీ అనరు.

విడాకుల సమయంలో నాకు అండగా నిలిచిన ధనుష్‌కూ నాకూ ఏదో సంబంధం ఉందని అన్నారు. ఒక అమ్మాయికి సహాయం చేస్తే సంబంధం ఉన్నట్టేనా? ఏ సంబంధం లేకుండా సహాయం చేయకూడదా? ఇవన్నీ ఎందుకు ఆలోచించరు? మొదట్లో ఇవన్నీ పట్టించుకుని బాధపడేదాన్ని. ఇప్పుడు వాటిని పట్టించుకోవడం మానేశాను. ప్రస్తుతం నా దృష్టి అంతా సినిమాల మీదే పెట్టాను. పెద్ద పెద్ద దర్శకులతో సినిమాలు చేస్తున్నాను. గతం కన్నా హ్యాపీగా ఉన్నానని మాత్రం చెప్పగలను

-చిన్ని

## ఇంటర్వ్యూ

# ఎలాంటి వాటికైనా సిద్ధమే!

**-ఇంద్రజ**

**'సొగసు చూడతరమా' అంటూ అందాల విందు చేసి, 'కన్నెపెట్టరో... కన్ను కొట్టరో' అంటూ కుర్రకారుకు కిక్కెక్కించిన ఇంద్రజ గుర్తుండే ఉంటుంది. చెన్నైలో స్థిరపడిన తెలుగు కుటుంబానికి చెందిన ఇంద్రజ తెలుగులో కన్నా కోలీవుడ్, మాలీవుడ్‌లలోనే ఎక్కువ సినిమాలు చేసింది. 'బోలో బోలో' అంటూ అలనాటి సూపర్‌స్టార్ కృష్ణగారిని ఆటపట్టించినా, పక్కచూపులు చూస్తున్న భర్తను 'దిక్కులు చూడకు రామయ్య' అంటూ సరైన దారిలో పెట్టుకున్న గృహిణి పాత్ర అయినా ఇట్టే ఒదిగిపోయే నటి ఇంద్రజ. హీరోయిన్‌గా అయినా, క్యారెక్టర్ ఆర్టిస్టుగా అయినా సెలెక్టివ్ పాత్రలు ఎంపిక చేసుకుంటూ 'శతమానం భవతి' అని తనను దీవించమంటున్న ఇంద్రజతో....**

**'శతమానం భవతి' సినిమా సక్సెస్‌ను ఎంజాయ్ చేస్తున్నట్టున్నారు?**

చాలా బాగా ఎంజాయ్ చేస్తున్నాను. నేను ఊహించింది నిజమే అయింది. అందుకు మరింత ఆనందంగా ఉంది. సినిమా పేరులాగానే ప్రేక్షకులు మా యూనిట్‌ను ఆశీర్వదిస్తున్నారు. ఆదరిస్తున్నారు.

**ఈ సినిమా సక్సెస్‌ను ముందే ఊహించారన్నమాట?**

కథ చెప్పినప్పుడే అనిపించింది. అన్ని సినిమాలకన్నా కూడా కుటుంబ కథాచిత్రాలకే అన్ని వర్గాల ప్రేక్షకులు ఎక్కువ కనెక్ట్ అవుతారు. అలాంటి కుటుంబ కథాచిత్రమే ఈ సినిమా. మాస్, క్లాసిక్ సినిమాలు ఓ వర్గం ప్రేక్షకులకే నచ్చుతాయి. కుటుంబ కథాచిత్రాలు అలా కాదు అని చెప్పడానికి బోలెడు ఆధారాలున్నాయి. ఈ సినిమాలో మంచి మెసేజ్ ఉంది. ఇప్పటి యువతరం చాలా సమస్యలతో సతమతమవుతోంది. దానికి తోడు పెద్దల ప్రెజర్ కూడా వారిమీద ఎక్కువగానే ఉంటోంది. పై వాటికి సమాధానం చెప్పేందుకు సినిమాలో ప్రయత్నించాం. మంచి రెస్పాన్స్ వచ్చింది.

**సెకండ్ ఇన్నింగ్స్‌లో కూడా ఎక్కువ గ్యాప్ తీసుకోవడానికి కారణం?**

మంచి కథలు వస్తేనే చేస్తున్నాను. ఈ పాత్రకి ఇంద్రజ సరిపోతుంది అనుకునేవారు నన్ను వచ్చి అడుగుతున్నారు. నచ్చితే చేస్తున్నాను. ఈ మధ్య కథలు నచ్చక కొన్ని సినిమాలు వదులుకున్నాను. అక్కా, వదిన, భార్య ఇలా ఏ క్యారెక్టర్ చేయడానికి అయినా నాకు ఇబ్బంది లేదు కానీ, నా సినిమాల్లో నేరుగా లేదా అంతర్లీనంగా ఓ మెసేజ్ ఉండాలని కోరుకుంటాను. అలాంటివి వస్తేనే చేస్తున్నాను.

**మీ ఫ్యామిలీ గురించి...**

మేం ముగ్గురం అక్కచెల్లెళ్లం. నేనే పెద్దదాన్ని. మా హజ్బెండ్ మీడియాలో సిఇఓగా చేస్తున్నారు. నాకు ఒక పాప. మా మదర్ ఇటీవలే చనిపోయారు. మా ఫాదర్ నాతోనే ఉంటున్నారు. పాప థర్డ్‌క్లాస్ చదువుతోంది. చెన్నైలోనే సెటిల్ అయ్యాం.

**ఔట్‌డోర్ షూటింగ్‌లు ఇబ్బంది అనిపించడం లేదా?**

ఎక్కువగా ఔట్‌డోర్ షూటింగ్‌లు ఉండవు. నా సినిమాల షూటింగ్‌లు అన్నీ దాదాపు చెన్నైలోనే జరుగుతాయి. కానీ'శతమానం భవతి' సినిమాకి

